# చతుర

జూన్ 2001

రూ.7/-



మునిపల్లె లక్ష్మీరమణకుమారి **ధైర్యం**

# చతుర ప్రపంచం

## క్లాత్‌హెడ్స్

బట్టతల కొందరికి అసహ్యంగా కనిపిస్తే మరి కొందరు దాన్ని ఆకర్షణీయంగా భావిస్తారు. అలా ఆకర్షణీయంగా భావించడానికి బట్టతల మేధస్సుకి, ఓవర్ సెక్స్‌కి ప్రతీక అన్న విషయం ప్రచారంలో ఉండడం కారణం కావచ్చు

మనిషి తల మీద సగటున లక్ష వెంట్రుకలుంటాయి. ఈ జుట్టు ప్రొటీన్‌తో తయారవుతుంది. ప్రతి మగాడికి రోజుకి సగటున 100 వెంట్రుకలు ఊడిపోతూంటాయి. ఆ స్థానంలో మళ్లీ కొత్తవి మొలకెత్తుతూ ఉంటాయి. అవి తిరిగి మొలకెత్తక పోవడమే బట్ట తలకి కారణం. ...ట్టున్న వాళ్లకన్నా ...ఖకి ఎక్కువ ...ట్రుకలు రాలిపోతూ ఉంటాయనుకుం...రు బట్టతలవాళ్లు. ఇది నిజం కాదు. తిరిగి ...లకెత్తకపోవడం అసలు కారణం.

బట్టతల రావడానికి ఎన్నో కారణాలు చెపుతుంటారు. చుండ్రు, టోపీ వాడకం, విటమిన్స్ లోపం, నూనె రాయకపోవడం, ఎక్కువ ఆలోచనలు మొదలైనవేవీ బట్టతలకి కారణాలు కావు. వయసు, మనిషి శరీరంలోని హార్మోనుల లోపం, జీన్స్ బట్టతలకి నిజమైన కారణం. ఒకోసారి కొన్ని తరాలు బట్టతలలు లేక అకస్మాత్తుగా ఇంకో తరంలో అవి కనిపించచ్చు

ఆడవాళ్లలో అరుదుగా బట్టతల వస్తూంటుంది. మగవాళ్లకి బట్టతల వచ్చే కారణాలు ఆడవారికి బట్టతల రావడానికి వర్తించవు. కేవలం రోగం వల్ల కానీ, విపరీతమైన మానసిక క్షోభ వల్లగానీ ఆడవాళ్లకి బట్టతల వస్తుంది.

సాధారణంగా బట్టతల 20 లలో మొదలవుతుంది. ముందర వెంట్రుకలు సన్నబడిపోయి తిరిగి పెరగవు. పురుషుల్లోని డైహైడ్రో టెస్టోస్టెరోన్ అనే హార్మోన్ బట్టతలకి




కారణం. స్త్రీలలో ఈ హార్మోన్ తయారవదు కాబట్టి వాళ్లకి బట్టతల రాదు

ఈ హార్మోన్ కారణంగానే బట్టతల వాళ్లు అధికంగా సెక్స్‌లో పాల్గొంటారు అనుకోవడం కద్దు.

బట్టతలకి మందు కనిపెట్టాలని మానవుడు అనాదిగా విశ్వప్రయత్నం చేస్తున్నాడు. ఆవు మూత్రం, బాతుపెంట లాంటివి తలకాయకి రాసుకుంటే జుట్టు రాలదనే మూఢనమ్మకం కొన్ని ప్రాంతాల్లో ఉంది.

ఆధునిక ప్రక్రియ ద్వారా జుట్టుని తలలోని ఓ భాగం లోంచి తీసి మరో భాగంలో

ట్రాన్స్‌ప్లాంట్ చేస్తున్నారు. 'మినాక్సిడిల్' అనే మందు అమెరికాలో దొరుకుతోంది. అది రాసుకుంటే నుదుటిమీద కూడా జుట్టు మొలుస్తుంది. అయినా అది జీవితాంతం వాడాలి. మధ్యలో ఆపితే జుట్టు రాలిన చోట మళ్లీ మొలవదు. ఈ కష్టనష్టాలన్నింటికన్నా బోడిగుండే సుఖం కదా!

## పాము విషం ఖరీదెంత?

'బంగారంలా తూస్తావేం?' అంటాం. బంగారమే అన్నిటికన్నా ఖరీదనుకుంటాం. నిజానికి బంగారంకన్నా ఖరీదయిన వస్తువు ఇంకోటుంది. అది తాచుపాము విషం.

30 గ్రాముల బంగారం ధర 13500 రూపాయలుంటే 30 గ్రాముల విషం 2,70,000 రూపాయలు. వివిధ రకాల పాముల విషం ధరలు పరిశీలిస్తే...

1. తాచుపాము విషం ధర 2,70,000 రూపాయలు. 2. సముద్రపుపాము విషం 12,90,000 రూపాయలు. 3. కోరల్‌పాము విషం ధర 16,80,000 రూపాయలు. 4. ఆఫ్రికన్ బూమౌస్లేంగ్ పాము విషం ధర 84,90,000 రూపాయలు . 5. బంబూల్ బీ పాము విషం 3,40,20,000 రూపాయలు. సాలీడు విషం ఖరీదు ఇంకా ఎక్కువ. అమెరికన్ బ్లాక్‌విడో (ఆడసాలీడు) విషం ధర 31 గ్రాములకి 708,00,000 రూపాయలు.

విషం లభ్యం అవడం కష్టతరం అయిన కొద్దీ ధర పెరుగుతుంటుంది. కొన్నిజాతుల పాములు అరుదు కాబట్టి అవి దొరకడం కష్టం. అదికాక పామునించి విషం తీస్తే (మిల్కింగ్ అంటారు). వచ్చేది పది బొట్లే. తాచుపామునించి వచ్చే ఈ 10 బొట్ల విషం బరువు ఓ గ్రాముంటుంది. ఒకోసారి ఇంకో డోస్ విషం తీయడానికి నెలదాకా పడుతుంది. అలా వచ్చిన విషాన్ని తెల్లటి పొడిగా చేసి అమ్మడంతో తేమ పోయి బరువు తగ్గుతుంది.

ఇంత ఖరీదుపెట్టి ఈ విషాన్ని కొనేదెవరు?




మందులు తయారుచేసే ఫార్మసీ కంపెనీలు, బయోకెమిస్ట్ కంపెనీలు, వీటిని మిల్లీగ్రాముల పరిమాణంలోనే మందుల్లో వాడినా, అది వాడిన వారికి కలిగే లాభం ఎంతో వుంటుంది. సెరమ్స్‌లో వీటిని ఉపయోగిస్తే ఆ రకం పామూ లేదా పురుగు కుట్టడంవల్ల రక్తంలోకి చేరిన విషానికి విరుగుడుగా పనిచేసి మరణం తప్పుతుంది. తమాషా ఏమిటంటే పాము విషంతో చేసిన మందే పాము విషానికి విరుగుడు!

ఒక్క విషానికి విరుగుడుగాకాక ఇంకా ఎన్నో వ్యాధులకి చెందిన మందుల్లో పాము విషాన్ని వాడుతారు. పాము విషంలోని టాక్సిన్స్ మందులా పనిచేస్తాయి. ★



## సచిత్ర విచిత్రం

# బరువు తగ్గితే విమానం

ప్రకటనల్లో మల్టీ నేషనల్ కంపెనీలు కొత్త ధోరణుల్ని అనుసరిస్తూ వుంటాయి. 150 కిలోలకు మించి బరువున్న వారు తమ పేర్లని, బరువుని రిజిష్టర్ చేసుకుని జనవరి 1, 2000 ల కల్లా అంటే ఏడాది లోగా ఎవరు అతి తక్కువ బరువుకి దిగుతారో వాళ్లకి కార్లు, ఫోర్ సీటర్ విమానాలని బహుమతులుగా ఇస్తామని అమెరికన్ కంపెనీ క్యాంప్‌బెల్ ప్రకటన ఇచ్చింది 1999లో.

లావు అధికంగా ఉండే అమెరికన్స్ ఈ పోటీలో ఉత్సాహంగా పాల్గొన్నారు. 46,123 మంది క్యాంప్‌బెల్ కంపెనీ లో తమ పేర్లను రిజిష్టర్ చేసుకున్నారు. వారిలో 153 కిలోల బరువు గల డెబి డేవిస్ గడువు తేదీకి 43 కిలోలకు దిగింది. మిల్లీ గ్రామ్స్ తేడాలో ఈమె 6134 మందిని ఓడించి విమానం గెలుచుకుంది.



# చతుర కతలు

## నీళ్లు రాని కళ్లు

యమ్.ఎల్.ఏ. 'బుచ్చిబ్బాయ్‌గారు' ఓ కంటి డాక్టర్‌ని కలిశారు.

"ఏమన్నా ప్రాబ్లమా సార్?" కుశలం అడిగాడు ఐ స్పెషలిస్ట్ కాంత్.

"నావి నీళ్లు రాని కళ్లు" అన్నాడు బుచ్చబ్బాయ్ నిర్లిప్తంగా.

"ఓహ్... టైటిల్ చాలా బావుందండీ! కొత్తగా 'సిన్మా' ఏమైనా తీస్తున్నారా"




అన్నాడు డాక్టర్.

"జోక్ కాదు డాక్టర్ 'సీరియస్'. కొన్ని రోజులుగా నా కళ్లు నీళ్లు స్రవించడం లేదు. మా నియోజకవర్గంలోని నా దేవుళ్ళు, నా ప్రజలు, నా ఆత్మబంధువుల కష్టాల్ని చూసి నా కళ్లు కన్నీళ్లు కురిపించడంలేదు. దయచేసి మీరే పరిష్కారం చెప్పాలి"

"దీన్నే డ్రై ఐ అంటారు" అన్నారు డాక్టరు గారు.

"కారణం ఏమిటండీ?!"

"ఏమిటా!? ఏ భూకంపాలో, వరదలో వచ్చినప్పుడు ఫర్వాలేదుగానీ ఓట్లకోసం దొంగ ఏడుపులు ఏడిస్తే కంట్లో నీళ్లు ఇగిరి పోవూ?" గట్టిగానే అన్నాడు డాక్టర్.

"నేనేం చెయ్యాలి. 'కన్నీరు కరువైన బతుకెందుకూ' అని డిజిటల్ సౌండ్‌తోసహా ఏడ్వాలిసిందేనా? డాక్టర్" అంటూ అటు వైపు వచ్చిన నర్సుని కావులించుకొని ఏడ్వబోయాడు.

ఆమె లిప్తపాటులో తప్పించుకొంది.

"మీ కళ్లు వాకౌట్ చేశాయి. ఇక ఆపరేషన్ చేసి 'ఐ ట్రాన్స్‌ప్లాన్‌టేషన్' చెయ్యాలి"

"అంటే కొత్త కళ్లు అమరుస్తారా?"

"యస్... ఎగ్జాట్లీ"

"సరే... ఆపరేషన్ ఎప్పుడు ప్రారంభిస్తారు?"

"రేపే..."

మర్నాడు ఆపరేషన్ అయ్యాక రిజల్ట్ చెక్ చెయ్యాలని ప్రయత్నించాడు డాక్టర్.





కాని, బుచ్చబ్బాయ్ కళ్లు మూతబడే వుంటు న్నాయి తప్ప ఎంతకీ తెరుచుకోవడంలేదు.

"నా కళ్లు నిద్రపోతున్నట్టే వున్నాయి. ఎందుకని డాక్టర్?" అన్నాడు యమ్.ఎ ల్.ఏ.

"ఓ... సారీ! ఈ కళ్లు ఓ గవర్నమెంట్ ఉద్యోగివి. ఇవి పనికిరావు. కొత్తవి వేద్దాం" అని మళ్ళీ ఆపరేషన్ చేశారు.

ఈసారి కళ్లు చంద్రనిప్పులు కక్కుతు న్నాయ్.

"ఈ కళ్లు ఎవరివి డాక్టర్..."

"అవి పోలీసువో... నక్సలైటువో సరిగా తెలీదు" అన్నాడు డాక్టర్.

"ఇవి కూడా మార్చేద్దాం"

"డాక్టర్ ఈసారి కరెక్టువి వెయ్యకపోతే కన్స్యూమర్ ఫోరమ్‌లో కేసు వేయిస్తాను"

డాక్టర్ కాసేపు ఆలోచించి జూకి ఫోన్ చేశాడు. అక్కడ చెప్పిన సమాచారం విని సంతృప్తిగా తలాడించాడు.

కొంతసేపటికి విజయవంతంగా ఆపరే షన్ నిర్వహించాడు.

బుచ్చబ్బాయ్ కళ్లు బాగా కనబడ్తున్నాయి. పైగా స్విచ్ నొక్కినప్పుడల్లా కన్నీళ్లు కారుస్తు న్నాయి. అప్పటికప్పుడు నర్సు భుజంమీద తలపెట్టి ఏడ్చాడు కూడా టెస్టింగ్ కోసం.

"శభాష్ డాక్టర్. మీ ఫీజు గవర్నమెంట్ ఎకౌంట్ నుంచి బదిలీచేసి పంపిస్తాను" అంటూ వెళ్ళిపోయాడు.

"డాక్టర్" ఆ కళ్లు ఎక్కడివి? చక్కగా సరి పోయాయ్" అంది నర్సు అనుమానంగా.

"వాటిని స్పెషల్‌గా జూ నుంచి తెప్పిం చాన్లే. అవి మొసలి కళ్లు" నవ్వాడు డాక్టర్ కాంత్.

**–కె. శివసుబ్బారావు**

---

## డబుల్ ప్లే

థియేటర్‌లోకి అడుగుపెట్టాడు గౌతమ్. అప్పుడే లైట్లార్పి సిన్మా ఫోకస్ చేశారు తెరపైన. సిన్మా మొదలైంది. గౌతమ్‌కి చిన్నగా తల నొప్పి మొదలయింది. అర్థం పర్థంలేని డైలా గులు, సన్నివేశాల సాగతీత... ఆ సిన్మా మూడుగంటలు చూసి అది అవార్డుకి అర్హమో, అనర్హమో తేల్చాలి.

సిన్మా చూస్తూ 'ఎనర్జీ' వాంతి ఆపుకోలేక బయటికెళ్ళిపో యాడు. అతనూ, గౌతమ్‌లాగే అవార్డు సెలక్షన్ కమిటీలో మెంబర్. తలలోని నరాలు చిట్లింపచేసి, బాడీలోని సహనశక్తిని క్షీణింపచేసి, ఉత్సాహం ఆవిరి చేసి మొత్తంమీద సిన్మా పూర్తయింది. హాల్లో లైట్లు వెలిగాయి. "ఈ సిన్మాకి



మార్కులు వేయాలి! ఎలా వేద్దాం"? అడిగాడు గౌతమ్.

"సిన్మా డెడ్‌స్లోగా వుంది. బాగా తల్నొప్పి వచ్చింది. వాంతులూ వచ్చినట్లున్నాయి. కాబట్టి సిన్మాలో మనకు అర్థంకాని గొప్పదేదో వుండేవుంటుంది. దీనికి 'స్వర్ణనంది' ఇచ్చేద్దాం!"

"అలాగే..."

"తథాస్తు" అన్నట్లు రోడ్డుమీదెక్కడో వాల్ పోస్టర్ నెమరువేస్తున్న ఓ ఆవు 'అంబా' అంది.

ఇంకో సిన్మాకోసం మళ్ళీ లైట్లారిపోయాయి. మెంబర్స్ 'ఆస్ప్రిన్' మాత్రలేసుకొని రడీ అయ్యారు. వామిటింగ్ మాత్రలు సిద్ధం చేసుకున్నారు.

కానీ వాటి అవసరం రాలేదు.

ఆ సిన్మా బ్రహ్మాండంగా వుంది. మంచి డ్యాన్సులు, ఊపేసే పాటలు, కిర్రెక్కించే మ్యూజిక్కూ.

ఆహా... ఓహో అనుకున్నారంతా.

ఇంతలో 'గౌతమ్' సెల్ మోగింది.

"హలో" అన్నాడు గౌతమ్.

"హలో నేనో డైరెక్టర్ కమ్ ప్రొడ్యూసర్‌ని. మీరిప్పుడు 'మా ఆయన మీదొట్టు మీ ఆవిడ చాలా చెడ్డది' చూస్తున్నారుకదా!"

"అవును"

"సిన్మా బావుందా సార్!"

"బావుంది"

"మీరీ సిన్మాకు 'బంగారునంది' ఇవ్వాలి సార్? అలా అయితే మీకు 'లక్ష' రూపాయలిస్తా!"

"ఏమిటీ తెహల్కానా? "

"ఏమీకాదు. ఆ సిన్మా నా శత్రువుది. మీరు నంది ఇవ్వలేదనుకోండి. జనాలు విరగబడి చూస్తారు. మీరు 'నంది' ఇచ్చారనుకోండి. దరిద్రపుగొట్టు సిన్మా, ఏడుపుగొట్టు సిన్మా అని ఎవడూ చూడడు. వాడికి నష్టం వస్తుంది. నా కళ్ళు చల్లగా... హలో... హలో..."

—డా॥ కె.ఎస్.రావు

---

## సెన్సాఫ్ మైండ్

అక్కడ దాదాపు యాభై మంది యువకులున్నారు.

రవిచంద్ర అసహనంగా వాచ్ చూసుకొన్నాడు.

ఇంటర్వ్యూ చేసే అధికారులు తొమ్మిది గంటలకు రావాల్సింది. తీరిగ్గా పదకొండు గంటలకు వచ్చారు.

ఒక్కొక్క అభ్యర్థే లోపలికి వెళుతున్నాడు. వెళ్ళినట్లే గోడకు కొట్టిన బంతిలా వెనక్కు తిరిగి వస్తున్నాడు.

దాదాపు పదిమంది అలాగే వచ్చేశారు.

"లోపల వీళ్ళనేం అడుగుతున్నారు. కనీసం ఒక్కక్షణం కూడా లోపల ఉండటంలేదు" మనసులోనే అనుకున్నాడు రవిచంద్ర.

లోపల ఇంటర్వ్యూ అధికారులు ముగ్గురున్నారు. అభ్యర్థుల్ని ఒక్కొక్కర్నే లోపలికి పంపమని ప్యూన్‌కు ఆదేశించారు. ఒక్కొక్క అభ్యర్థే లోపలకు వస్తున్నాడు.

అధికారులకు రానురాను అసహనం పెరిగిపోతోంది. ఒక్క అభ్యర్థికీ సెన్స్ ఆఫ్ మైండ్ లేకపోవడం వాళ్ళకు ఆశ్చర్యాన్ని, కోపాన్ని కలిగిస్తోంది.

అంతలో ఓ అభ్యర్థి లోపలికి వచ్చాడు.

వస్తూనే "నమస్కారం సార్" అన్నాడు.

"ఊ" అని ఆ వెంటనే "ఇక నువ్వెళ్ళొచ్చు" అన్నారు ముగ్గురూ ఒకేసారి చిరాగ్గా.

ఆ అభ్యర్థి ఆశ్చర్యపోయాడు. ఇదేమిటి పేరు, క్వాలిఫికేషన్స్, కనీసం ఓ చిన్నప్రశ్న కూడా అడక్కుండా పొమ్మనడం ఏమిటి? అర్థం కాలేదు. బహుశా ఎవరన్నా రికమెండేషన్ కాండిడేట్‌కు ఈ ఉద్యోగం ఖరారైందేమో అనుకుంటూ బయటకు వచ్చాడు.

"ఏమడిగారు? " తన పక్కనుంచి వెళుతున్న ఆ అభ్యర్థిని అడిగాడు రవిచంద్ర. అతను జరిగింది చెప్పి వెళ్ళిపోయాడు.





అంతలో అక్కడ ఆఫీస్‌రూంలోకి మరో అభ్యర్థి ప్రవేశించాడు మౌనంగా నమస్కరిస్తూ. అధికారులు ముగ్గురూ తిరిగి విష్ చేస్తూ "నీ పేరు? " అనడిగారు.

"గోవిందం" బదులిచ్చాడా అభ్యర్థి.

"నువ్వెళ్ళొచ్చు"

"... ... ... బహుశా ఎవరన్నా డబ్బుతో ఈ ఉద్యోగాన్ని కొనుక్కొన్నారేమో" అనుకుంటూ బయటకు వచ్చేశాడతను.

మరో అభ్యర్థి వచ్చాడు నమస్కరిస్తూ.

"మీదేవూరు? " అడిగారు ముగ్గురూ.

"అనకాపల్లి"

రులు.

మౌనంగా తన సర్టిఫికెట్స్, దానిమీద పేరు చూపించాడు.

"ఇంకా ఇతర అర్హతలేమైనా ఉన్నాయా? "

దానికీ మౌనంగా తన సర్టిఫికెట్స్ చూపించాడు. అలా వాళ్ళు అడిగిన ప్రతీదానికి తన సర్టిఫికెట్స్ చూపించడమో లేక మౌనంగా ఓ వైట్ పేపర్‌మీద రాసివ్వడమో చేశాడు.

"నీకు బుద్ధుందా? మేము ఇలా నోరు తెరుచుకు అరచి అడుగుతుంటే అలా సమాధానాలు రాసిస్తావేంటి? నువ్వు మూగవాడివా? " కోపంగా అడిగారు అధికారులు.




"నువ్వెళ్ళొచ్చు"

బయటకు వచ్చిన ప్రతి ఒక్కర్నీ ఏమడిగారు అని అడిగి తెలుసుకొంటూనే ఉన్నాడు లైన్‌లో ఉన్న రవిచంద్ర. ఎందుకంటే ఆ లైన్‌లో అతను చివరివాడు. యాభయ్యో అభ్యర్థి. అలా ఓ తొమ్మిదిమందిని అడిగేసరికి అతనికి ఫ్లాష్‌లా ఓ అద్భుతమైన ఆలోచన వచ్చింది. తనవంతు రాగానే దాన్ని అమలు చేయాలనుకున్నాడు. మరో మూడు గంటల తర్వాత అతని వంతు వచ్చింది. మౌనంగా నమస్కరిస్తూ లోపలికి అడుగుపెట్టాడు.

"మీ పేరు? " అడిగారు ఇంటర్వ్యూ అధికా

"క్షమించండి నేను మూగవాణ్ణి కాదు. ఈ ఉద్యోగానికి ఇది సరైన అర్హతనుకొంటున్నాను" ఈసారీ రాసే బదులిచ్చాడు రవిచంద్ర.

"వెరీగుడ్. ఈ లైబ్రేరియన్ ఉద్యోగానికి నువ్వే సరైనవాడివి. యూ ఆర్ సెలక్టెడ్. నీ సెన్సాఫ్ మైండ్ అద్భుతం. కంగ్రాచ్యులేషన్స్" అంటున్న ఆ ముగ్గురి అధికారులకు థాంక్స్ అని కాగితంమీద రాసి చూపించి, నమస్కరించాడు కాబోయే లైబ్రేరియన్ రవిచంద్ర నోరు తెరవకుండానే.

—కలపర్తి సత్యం



# చతుర

28వ సంచిక

సంపుటి : 24

సంచిక : 5

జూన్ : 2001

ఆరంతస్థుల భవనం మెట్లమీదుగా పరిగెత్తుకుంటూ సుడి గాలిలా వచ్చిన ఆ అమ్మాయి పిట్ట గోడ ఎక్కి దూకబోయింది. అక్కడే పచార్లు చేస్తున్న ఓ యువకుడు క్షణాల్లో ఆమెను వెనక్కి లాగేశాడు. నన్నెందుకు బతికించారంటూ భోరున ఏడ్చిన ఆమె అలా ప్రాణం తీసుకునే ప్రయత్నం చేయడానికి కారణం 'ప్రేమ వైఫల్యం' అని తెలుసుకున్న అతను ఆమెకి ఓ గమ్మత్తయిన కథ చెప్పాడు.

ఆ కథ ఏ మలుపులు తిరిగి చివరికి ఆమె నిర్ణయాన్ని ఎలా ప్రభావితం చేసింది? అసలామెను ఆత్మహత్యకు ప్రేరేపించిన అనూహ్య సంఘటనలెలాంటివి?

హృదయపు లోతులను స్పృశించే ప్రేమకథ **మునిపల్లె లక్ష్మీరమణకుమారి** రచన **"ధైర్యం"** ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

ఆరో అంతస్తు టెర్రెస్‌మీద తిరుగుతూ ఫ్లోర్‌ని పరిశీలిస్తున్నాడు ఆనంద్.

అడ్వకేట్ ఆనంద్‌కు ఆ భవనం ఆరో అంతస్థులో ఆఫీసు ఉంది. రెండ్రోజులుగా వర్షాలు కురుస్తున్నాయి. ఈ వర్షాలకి అతని భాగంలో కొంత కురుస్తోంది. జనరల్ మెయిన్‌టెనెన్స్ వాళ్ళకి చెప్పాడు. అతను సాయంత్రం వచ్చి చూస్తానన్నాడు. ఎక్కడో కాస్త పగులు చూపటమో, ఏదో జరిగి ఉంటుందన్నాడు. స్పాట్ తెలిస్తే సరిచేస్తాన న్నాడు. ఈలోపల తను కాస్త పరీక్షించి, లోపం ఎక్కడుందో తెలుసుకుంటే మంచిద నిపించింది ఆనంద్‌కి. అందుకే పైకి వచ్చి చూస్తున్నాడు.

ఇంతలో ఎవరో పరుగెత్తుతూ మెట్లు ఎక్కుతున్న చప్పుడయింది. కాలి మువ్వలు ఘల్లుమంటున్నాయి. అతని మనసు ఏదో శంకించి పక్కకు తప్పుకున్నాడు.

అతని అనుమానం నిజమే అయింది. వేగంగా, విసురుగా మెట్లెక్కిన ఒక యువతి అదే ఊపులో వెళ్ళి పిట్టగోడమీదికి ఎక్కింది.

ఆనంద్ చటుక్కున ఆ వ్యక్తిని పట్టుకుని వెనక్కు లాగేశాడు. ఆ ఊపుకు ఇద్దరూ కిందపడ్డారు.

ఆమెకి ఇరవై రెండేళ్ళుంటాయి. మొహంలో ఇంకా అమాయకత్వం ప్రతిబిం బిస్తూనే ఉంది.

"వదులు... నన్ను వదులు" ఆమె ఏడుస్తూ గింజుకుంటోంది.

అతను వినిపించుకోకుండా ఆమెని బలంగా లాగి వెనక్కు తీసుకుని పోతు న్నాడు. అతని పట్టు వదిలించుకోవాలనీ, తప్పించుకోవాలనీ ఆమె విశ్వప్రయత్నం చేస్తోంది.

"నా మాట విను" అతను నచ్చచెపుదా మని చూశాడు.

"వద్దు... నాకేం చెప్పొద్దు. నన్ను చావనీ" ఆమె ఏడుస్తోంది.

అతను ఆమెని ఏడవనిచ్చాడు. ఆమె వెక్కివెక్కి ఏడుస్తోంది. అతను ఆమె చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

ఆమె తప్పించుకోవాలని ప్రయత్నించి, ప్రయత్నించి అలసిపోయింది. అట్లా ఎంత సమయం గడిచిపోయిందో కూడా తెలియ లేదు.

చివరికి ఆమె మౌనంగా కూర్చుంది. కన్నీళ్ళ ప్రవాహం ఆగింది. వెక్కిళ్ళు తగ్గాయి.

"నన్ను చావకుండా చేసే హక్కు నీకెక్క డిది? " అన్నదామె అరుస్తున్నట్లుగా.

అతను నవ్వాడు.

"ఏ మనిషికీ తన జీవితాన్ని అంతం చేసుకునే హక్కులేదు" అన్నాడు.

"కావచ్చు కానీ చావాలనుకున్న మనిషిని ఎవరూ ఆపలేరు. ఇవాళ ఇప్పుడు ఆపగ లవు. కానీ ఆ తర్వాత ఎవరి దారి వారిది. చావాలనుకుంటే లక్ష మార్గాలు"

"అవును" అతను ఒప్పుకున్నాడు.

"కానీ... నేను చెప్పేది కాస్త వింటావా? " అని అడిగాడు.

"నాకా అవసరంలేదు"

"సరే పోనీ పోదాం పద... ఒక్కసారి కిందకి చూడు"

అతను ఆమెని లేపి, పిట్టగోడ దగ్గరకు నడిపించాడు. ఈసారి కిందకు చూస్తే ఆమెకి భయంవేసింది. కళ్ళు తిరిగినట్ల యింది.

అంతలో మళ్ళీ మొండి తెగింపు ఆవరిం చింది ఆమెని.

"నన్ను చావనీ" అంది.

అతను ఆమె కళ్ళల్లోకి సూటిగా చూశాడు.

"చావనిస్తాను. కానీ ఇప్పుడు కాదు"

"అంటే? " ఆమె కళ్ళల్లో అనుమానం, భయం.

"నువ్వు నాతో రావాలి"

"వచ్చి...? " ఆమె కంఠంలో అనుకో





కుండా పదును తొంగిచూసింది.

"భయపడకు. నీకే అపకారం జరగదు. నువ్వు కనీసం ఓ రెండు మూడు రోజులన్నా ప్రశాంతంగా గడపాలి. ఇప్పుడున్న ఆవేశం తగ్గుతుంది. ఆ తర్వాత చావాలన్నా, బతకాలన్నా నీ ఇష్టం. నువ్వు హాయిగా చావొచ్చు. లేకపోతే సంతోషంగా బతకొచ్చు" అన్నాడతను.

ఆమె నొసలు చిట్లించింది.

ఇంకోమార్గం కనిపించలేదు. మరీ మొండికేస్తే అతను పోలీసులకి అప్పజెప్పుతాడు. అది మరీ ఘోరం. అంతకన్నా ఈ మూడురోజులూ అతను చెప్పినట్లుగా ఉండి, ఆతర్వాత చచ్చిపోతే సరి. మనిషి మంచివాడిలాగే కనిపిస్తున్నాడు.

అంగీకారంగా తల ఊపిందామె.

అతను ఆమె చేతిని మెల్లగా విడిచిపెట్టాడు.

"మీ ఇంట్లో ఎవరెవరుంటారు?" అడిగిందామె.

"ఓహో... అదో అభ్యంతరమా? నేనొక్కడినే... కానీ నీకు విడిగా ఒక గది ఉంటుంది. వంటమనిషి కూడా ఉంటుంది. నేనంటే భయమైతే తలుపు గడియపెట్టుకోవచ్చు"

"నాకేం భయంలేదు" అందామె.

"మరి మీ ఇంట్లో సంగతేంటి? వాళ్ళకి చెప్పొద్దూ?" అన్నాడతను.

"అఖ్ఖర్లేదు. మా వాళ్ళంతా వేరే ఊళ్ళో ఉన్నారు. నేను ఒంటరిగా ఉంటున్నాను. ఇంటి ఓనర్‌కి తర్వాత ఫోన్‌చేసి చెపితే చాలు" అందామె.

ఇద్దరూ ముందుకి నడిచారు.

అతను తన ఆఫీస్ లాక్‌చేసి వచ్చాడు. లిఫ్ట్‌లో కిందకు దిగారు ఇద్దరూ.

నడక నేర్చిన పాపాయిని పడిపోకుండా గమనిస్తున్నట్లు తనని ఒకకంట కనిపెట్టే ఉన్నాడని ఆమె గమనించింది.

కారులో అతని ఇల్లు చేరుకున్నారు.

"శాంతమ్మా. ఈ అమ్మాయి కొన్నాళ్ళు మనింట్లోనే ఉంటుంది" అని ఆ వంటమనిషికి చెప్పాడతను. చిన్న ఇల్లే కానీ అన్ని వసతులూ ఉన్నాయి.

"దగ్గర్లోనే బట్టలషాపుంది. వెళ్ళి నీక్కావల్సిన బట్టలు కొనుక్కోవచ్చు" అతను డబ్బు ఇస్తూ చెప్పాడు. ఆమె ఒక్కక్షణం ఆలోచించి చివరికి తీసుకుంది.

అతను తన గదిలోకి వెళ్ళి ఏదో పని చూసుకుంటున్నాడు.

రాత్రి భోజనాలప్పుడు మళ్ళీ మాట్లాడాడు. శాంతమ్మ తన గదిలోకి వెళ్ళిపోయింది. అతనూ, ఆమె ఇద్దరూ వడ్డించుకుని తింటున్నారు.

"నీ పేరు?" అతను అడిగాడు.

"కమలిని"

"నా పేరు ఆనంద్. అడ్వొకేట్‌ని. నువ్వేం చదువుతున్నావు?"

"బి.ఎస్సీ చదివాను. ఐ.ఏ.ఎస్ మెయిన్‌కి ప్రిపేరవుతున్నాను"

"అంటే ప్రిలిమ్స్ పాసయ్యావా?"

"ఊ..."

"మరి ఇంత తెలివిగలదానివి. పిరికిదానిలా ఈ పనేంటి?" అతను సగం మందలింపుగా, సగం ఆప్యాయంగా అడిగాడు.

కమలిని మాట్లాడలేదు.

"ఏదన్నా ప్రేమ వ్యవహారమా?" అడిగాడతను. కమలిని తలెత్తి చూసింది. అతని మొహంలో వెటకారం లాంటిదేదీ లేదు. కేవలం సానుభూతి, ఓదార్పు తప్ప.

"అవును" తలవంచుకుని చెప్పింది.

"ఏం జరిగిందసలు?"

"నేనూ, సురేష్ గాఢంగా ప్రేమించుకున్నాం. పెళ్ళిచేసుకుందామనుకున్నాం. కానీ అతను ఇప్పుడు హఠాత్తుగా మారిపోయాడు. తల్లితండ్రులు కుదిర్చిన సంబంధం చేసుకుంటాడుట. నాతో మాట్లాడటం మానేశాడు" కమలిని భోరుమంది.

అతను జాలిగా చూశాడు.

"అందుకని చచ్చిపోతావా? పిచ్చిపిల్లా... జీవితంలో ప్రేమ ఉండొచ్చు కానీ ప్రేమే జీవితం కాదు"

"అందరూ అలాగే చెపుతారు. కానీ నేను సురేష్ లేకుండా బతకలేను. అతనంటే నాకు వెర్రిప్రేమ. నా శరీరం, మనసూ, ఆత్మా అన్నీ సురేష్ కోసం పలవరిస్తున్నాయి. అతను లేని జీవితం నేను ఊహించలేను" కమలిని వెక్కుతూనే గబగబా చెప్పింది.

అతను మౌనంగా వింటున్నాడు.

"నాకు తెలుసు. నన్ను చూసి నవ్వుకుంటున్నారు. కానీ ప్రేమంటే ఏమిటో అనుభవించిన వాళ్ళకు తెలుస్తుంది. సినిమాల్లో, కథల్లో ప్రేమని గొప్పగా చెప్పుకుంటాం, చక్కగా ఎంజాయ్ చేస్తాం. కానీ నిజజీవితంలో ప్రేమంటే వెక్కిరిస్తాం" అంది కమలిని.

"కమలినీ. నిన్ను నేను అర్థంచేసుకుంటున్నాను. ప్రేమకథని బాగా ఎంజాయ్ చేస్తారన్నావు. నీకు ఒక ప్రేమకథ చెపుతాను. వింటావా మరి? అంతా విన్నాక నీ అభిప్రాయం చెప్పాలి" అన్నాడతను.

ప్రేమ కథ అనేసరికి అంత విరక్తిలోనూ కమలినిలో ఆసక్తి పుట్టింది.

"సరే..." అంది.

"నాకు తీరిక ఉండదు. వీలు చిక్కినప్పుడల్లా నీకా కథని చెపుతుంటాను" అన్నాడతను.

కమలిని తల ఊపింది.

★ ★ ★

ఇరవై ఏళ్ళ విజయ్ ఇంట్లోకి అడుగుపెట్టాడు. ఒడ్డూ పొడవూ, చక్కటి కనుముక్కు తీరులో అందంగా ఉన్న కొడుకుని రాజారావు ఆప్యాయంగా చూసుకున్నాడు.

"విజయ్ ఎట్లా ఉంది యూనివర్శిటీ?" పలకరించాడు. విజయ్ ఎమ్మెస్సీ క్లాసులకి హాజరై వస్తున్నాడు అదే మొదటిరోజు.





"బాగానే ఉంది నాన్నా" అన్నాడు విజయ్.

"ఎంతమందున్నారు క్లాసులో? ఫ్రెండ్సెవరన్నా దొరికారా? కాంటీన్ ఉందా?" గబగబా అడిగాడు రాజారావు.

విజయ్ ఒక్కొక్కటే చెప్పుకుంటూ పోతున్నాడు.

ఇంతలో లలిత వేగంగా ఇంట్లోకి రాబోతూ తండ్రిని చూసి గతుక్కుమని ఆగింది. ఆయన విజయ్‌తో మాట్లాడుతూ తనని గమనించలేదు లెమ్మనుకుని ఏమీ ఎరగనట్లు లోపలికి వెళ్ళబోయింది.

"ఆగు" అరిచాడు రాజారావు.

లలిత ఉలిక్కిపడి ఆగింది. చేతిలో బ్యాగ్‌ని రాజారావు కంటపడకుండా దాచాలని చూసినా, ఆయన దాన్ని చూడనేచూశాడు.

"ఆ బ్యాగ్ ఎవరిది? నీకిలాంటిది లేదనుకుంటాను?" అన్నాడు.

"నాది కాదు... నా ఫ్రెండుది"

"ఇంకొకళ్ల వస్తువులు తీసుకోవద్దని లక్ష సార్లు చెప్పాను"

ఇంతలో తల్లి రంగమ్మ కూడా అక్కడికి వచ్చింది.

"నీకెన్నిసార్లు చెప్పినా బుద్ధిరాదు. కాస్త మమ్మల్నిలా బతకనీ తల్లీ. అది చూస్తే వెర్రిబాగుల్ది. నువ్వు చూస్తే మహాగడుసుదానివి. ఛీ. ఏనాటి పాపకర్మమో ఇలా పిల్లల రూపంలో పీడిస్తున్నట్లుంది" కోపంగా అరిచింది రంగమ్మ.

"హు... అన్నిటికీ గొడవ" కొద్దిగా విసుక్కుంటూ లోపలకి వెళ్ళిపోయింది లలిత.

"దాని లోలాకులు చూశారా? ఎక్కడివంటే ఎవరో ఫ్రెండు ఇచ్చిందంటుంది. ఇది మారదు" అంది రంగమ్మ నిస్పృహగా.

వాళ్ళ బాధకి కారణం విజయ్‌కి తెలుసు. విజయ్‌కాక ఇద్దరు ఆడపిల్లలు వాళ్ళకి.

పెద్దది శిరీషకు పెళ్ళిచేసి పంపిస్తే డిప్రెషన్‌లో ఉందని పుట్టింటికి పంపాడు భర్త.

శిరీష ఇక్కడే ఉంటోంది.

లలితది మరోరకం గొడవ. లలితకి తాము జీవిస్తున్న మధ్యతరగతి జీవితం ఎంతమాత్రం నచ్చదు. ఆఖరుకు తన పేరు కూడా నచ్చలేదు. ఫ్రెండ్సంతా లల్లీ అనే పిలుస్తారు. లేటెస్ట్ మోడల్ దుస్తులూ, రోజుకోరకంగా కేశాలంకరణ, చక్కటి చెప్పులూ, బూట్లూ, బ్యాగ్‌లూ, ఇంతకన్నా ఆమెకి మరో ప్రపంచం పొడగిట్టదు. చదువుకొమ్మని కాలేజీకి పంపిస్తే, అది తన కలల సామ్రాజ్యానికీ, ఫ్యాషన్ ప్రపంచానికీ తెరిచిన తలుపులుగా భావిస్తోంది లలిత. ఊరికే ఫ్యాషన్‌గా తయారయ్యి తిరిగితే తల్లితండ్రులకి కూడా బాధ ఉండేది కాదు. లలిత ఒక్కొక్కసారి అతిగా ప్రవర్తిస్తుంది. మధ్యతరగతి మనుషులకు ఉండే భయాలూ, పరిమితులూ లలితకు లేవు. కాలేజీకి సరిగ్గా వెళ్ళదు. ఎగ్గొట్టి బాయ్‌ఫ్రెండ్స్‌తో సినిమాలు చూస్తుంది. తల్లితండ్రులకి తెలిసి మందలించినా దులుపుకుని పోతోంది తప్ప లాభంలేకపోయింది.

రెండేళ్ళక్రితం ఇంటర్ చదువుతున్నప్పుడే ఎవరో కుర్రాడితో పార్కులో ప్రేమకలాపాలు సాగిస్తూ తండ్రి కంటపడింది లలిత. ఆయన ఇంటికి వచ్చాక లలితను గొడ్డును బాదినట్లు బాదాడు. నాలుగురోజులు కాలేజీ మాన్పించి కూర్చోబెట్టాడు. ఇకమీదట పిచ్చి వేషాలు వేస్తే చంపేస్తానని బెదిరించాడు. లలిత కాస్త జంకినట్లు కనిపించటంతో, గట్టిగా బుద్ధిచెప్పి, మళ్ళీ కాలేజీకి పంపారు. రోజూ కూర్చోబెట్టి నీతిపాఠాలు చెపుతారు. సరే సరేనని తల ఊపుతుంది. ఎవరిచేతిలోనైనా ఇట్టే మోసపోతుందని తల్లితండ్రుల భయం.

రాజారావు లలితను మందలించాక, పెరట్లోకి వెళ్ళి, మామిడిచెట్టుకింద కుర్చీలో కూర్చున్నాడు. విజయ్ వెళ్ళి పక్కన నిలబడ్డాడు.

"రా విజయ్ కూర్చో" ఆప్యాయంగా పక్కన కూర్చోబెట్టుకున్నాడు రాజారావు.

తల్లిదండ్రులకి విజయ్ ఒక్కడే ఆశాకిరణం. విజయ్ బుద్ధిమంతుడు, బాగా చదువుకుంటాడు అని మురిసిపోతూ ఉంటారు ఎప్పుడూ.

"లలితను అంతగట్టిగా మందలించకుండా ఉండాల్సింది నాన్నగారూ" అన్నాడు విజయ్.

"ఆ మాత్రం అనకపోతే అసలు మాట వినదు. అయినా దాని వ్యవహారం చూస్తుంటే చదువుకూడా వచ్చేట్లు కనిపించటంలేదు. ఏదో ఒక సంబంధం చూసి పెళ్ళి చేసి పారేస్తే నా బాధ్యత తీరిపోతుంది. విజయ్... నా ఆశలన్నీ నీమీదే. నువ్వు బాగా చదువుకుని, మంచి ఉద్యోగం సంపాదించాలి. గొప్ప పేరు తెచ్చుకోవాలి. అదే నా కోరిక..." రాజారావు ఇంకా ఏదో చెప్పబోయి సందేహిస్తూ ఆగిపోయాడు.

"ఏమిటి నాన్నగారూ..."

"ఏం లేదు... మరోలా అనుకోకు. ఈ వయసులో ప్రేమలూ ఆకర్షణలూ సహజం. నువ్వు ఎప్పుడూ అలాటి ఆకర్షణలలో చిక్కుకోకు. నాకీ ప్రేమలూ, దోమలూ, వీటిమీద నమ్మకంలేదు. ఇవి నీ లక్ష్యాన్ని నీనుంచి దూరంచేస్తాయి. ఇలా చెప్పానని ఏమీ అనుకోకు" అన్నాడు రాజారావు.

విజయ్ నవ్వి ఊరుకున్నాడు.

కానీ...

తండ్రి ఆశలు కల్లలు చేస్తాననీ... తనూ ప్రేమలో చిక్కుకుంటాననీ అతను ఎన్నడూ ఊహించలేదు.

★ ★ ★

విజయ్‌కి అప్పటికి క్లాసులు మొదలయ్యి మూడురోజులైంది.

ఆరోజు అతను తన క్లాస్‌రూమ్ వైపు నడుస్తున్నాడు. కాళ్ళకింద ఆకుపచ్చటి తివాసీలా ఉన్న పచ్చిక మీద మెత్తగా అడుగులు పడుతున్నాయి.

"ఎక్స్క్యూజ్ మీ ప్లీజ్" పక్కనుంచి మృదువుగా, తియ్యగా ఉన్న గొంతు వినిపించింది.

అతను తల తిప్పి చూశాడు.

అంతే... అతని మనసు, చూపు అతని అదుపులో లేకుండా పోయాయి.

తొలిచూపులోనే ప్రేమ అంటే అదేనేమో... అక్కడ ఒక యువతి నిల్చుంది. ఆడవాళ్ళని ఏనాడూ పరికించి అయినా చూడని అతను, ఆమెకేసి కళ్ళప్పగించి చూడకుండా ఉండలేకపోయాడు.

ఆమెది అపూర్వ సౌందర్యం. పురాతన దేవాలయాల గోడలమీది శిల్పసుందరి ప్రాణం పోసుకు వచ్చిందేమోనన్న సందేహం కలిగింది అతనికి.

మచ్చలేని స్వచ్ఛమైన బంగారంరంగు వర్ణం, పట్టులా మెరుస్తున్న కేశరాశి, పౌర్ణమినాటి చందమామలా ప్రకాశిస్తున్న మొహం, చెరువులో చేపల్లా తళతళలాడుతున్న నల్లటి, పెద్దపెద్ద కళ్ళు, సూటయిన ముక్కు, గుండ్రటి ఎర్రటి పెదిమలు. ఎంత చక్కగా ఉంది సుమా అని ఆశ్చర్యపోయేట్లున్న శరీరం. ఆ అందమైన శరీరాన్ని అద్భుతంగా చుట్టి మెరుస్తున్న లేత వంగపండు సిల్కుచీరె, అదేరంగు సిల్కు జాకెట్టు.

కళ్ళు మిరిమిట్లు కొలిపే అందం, అందానికి తగ్గ గొంతు.

"ఎమ్మెస్సీ... కెమిస్ట్రీ... ఫస్టియర్... క్లాస్ ఎక్కడో మీకు తెలుసా? " ఆమె మృదువుగా ప్రశ్నించింది.

అందానికి తగ్గ మృదుత్వంతో మర్యాదగా ఆమె అడిగిన తీరుకి అతను ఇంకాస్త ముగ్ధుడయ్యాడు.

"నేను కూడా ఎమ్మెస్సీ కెమిస్ట్రీ ఫస్టియర్ స్టూడెంట్‌నే. నాతో రండి" అన్నాడతను ఆమెని చూసిన మత్తులోంచి తిరిగి ఈ లోకంలో పడుతూ.

"అలాగా. నా పేరు అమూల్య. మీ పేరు? " నవ్వుతూ అడిగింది ఆమె.

నవ్వుతుంటే ఆమె ఎంతో అద్భుతంగా ఉంది. అతను ఈ సమస్త ప్రపంచాన్నీ మర్చిపోయి, అప్రయత్నంగా ఆగిపోయి ఆమెవైపు తదేకంగా చూశాడు. వెంటనే తనను తాను మందలించుకుని మనసునీ, శరీరాన్నీ అదుపులోకి తెచ్చుకోవడానికి ప్రయత్నించాడు.

"నా పేరు విజయ్" అన్నాడు.

ఇద్దరూ నడిచి కారిడార్ చేరుకున్నారు.

"ఇదే మన క్లాస్..." అతను ఆమెకి క్లాస్ చూపించి ఆమెవైపు చూస్తే మళ్ళీ గుడ్లప్పగించాల్సొస్తుందేమోనని భయపడి, ఎటో చూస్తూ చెప్పాడు.

"చాలా థాంక్సండీ..." ఆమె ముందుకి కదిలింది.

కొంచెం ఆగి అతను కూడా వెళ్ళి క్లాస్‌లో కూర్చున్నాడు.

ఆమె అతనికి కుడివైపున్న వరసలోనే కూర్చునుంది. అతనికి ఆమె ఎడమభాగం చెక్కిన శిల్పంలా కనిపిస్తోంది. సైడ్‌ఫోజులో కనిపిస్తున్న నుదురు, సూటిముక్కు, నున్నటి బుగ్గలు, భుజాలు, మెడ, ఎత్తుగా కనిపిస్తున్న వక్షస్థలం, అన్నీ అతను ఆత్రంగా చూసేశాడు.

ఆమెమీద నుంచి కళ్ళు మరల్చుకోలేకపోతున్నాడు. అది కూడదని అతనికి అనిపించింది. అయినా ఎందుకో మానలేకపోయాడు. వీలయినప్పుడల్లా ఆమెని చూస్తూనే వున్నాడు.

లెక్చరర్ ఎపుడు వచ్చాడో, ఏం చెప్పాడో, ఎలా చెప్పాడో కూడా అతనికి తెలియలేదు. తెలిసిందల్లా వీలయినప్పుడల్లా ఆమెని చూడడం.

ఒకసారి ఆమె హఠాత్తుగా పక్కకి తిరిగితే ఆమెనే తదేకంగా చూస్తున్న అతను పట్టుబడిపోయాడు. తడబడిపోయాడు.

ఆమె చిన్నగా నవ్వింది.

ఆ నవ్వు అతని గుండెల్లోకి దూసుకుపోయింది.

తృళ్ళిపడి, మామూలుగానే చూసినట్లు నటిస్తూ తిరిగి చిరునవ్వు నవ్వుతూ, లెక్చర

ర్ వైపు తిరిగి ఆయన చెప్పేది వినటానికి ప్రయత్నం చేశాడు.

పాఠం ముగిసింది. అంతా లేచి బయటకు వచ్చారు.

తర్వాత క్లాసు లేదు. అంతా టీ తాగడానికి బయటకు వచ్చారు.

"ఎవరా మెరుపుతీగె? మన క్లాసుకి ఇంక లైట్ అవసరం లేదనుకుంటా" అన్నాడు బలరాం.

"ఎవరు? " అర్థంకాక చూశాడు విజయ్.

"అదేనయ్యా, నువ్వు దారి చూపించి తీసుకువచ్చినట్లున్నావుకదా. మన క్లాస్‌లోకి ఈరోజు వచ్చింది చూడు, ఆ అమ్మాయే"

బలరాం అమూల్య గురించి మాట్లాడడం విజయ్‌కి నచ్చలేదు. అసలు ఆమె గురించి ఎవరూ, ఏదీ మాట్లాడకూడదనిపించింది. ఆ గంటలోనే ఆమెపట్ల అదోమాదిరి అధికారం, తనది అనే భావన కలిగాయి. ఆమె గురించి తను తప్ప ఎవరూ మాట్లాడకూడదనే భావన.

"ఏంటి ఆలోచిస్తున్నావు? "

"ఏంలేదు. పద టీ తాగుదాం"

"ఇన్నాళ్ళూ నేను ఎంతోమందిని చూశాను గానీ, ఇంత అందగత్తెని చూడలేదు. ఆ కళ్ళు, ఆ ముక్కు, ఆ పర్సనాలిటీ, ఓహ్ మగాడ్ని తల్లకిందులు చేసే అందం"

"చెత్తగా మాట్లాడకు" అరిచాడు విజయ్.

"అదేంటి? ఇందులో తప్పేముంది. ఆమె అందంగా ఉంది. నేను ఆ అందాన్ని మెచ్చుకున్నాను" బలరాం విస్తుపోతూ కొంత నిష్ఠూరంగా అన్నాడు.

అవును. నిజమే అనిపించింది విజయ్‌కి.

'ఆమెని నేను ప్రేమిస్తున్నాను' అని బలరాంకి చెప్పాలనిపించింది. చెబితే, బలరాం పగలబడి నవ్వుతాడు. ఒక గంటక్రితం దాకా ఎవరో తెలియని, కనీసం చూడనైనా చూడని వ్యక్తిని ఏకంగా ప్రేమించేస్తున్నానని చెపితే ఎంత వెటకారం చెయ్యాలో అంత వెటకారం చేస్తాడు.

అసలేమిటిదంతా? అతనికే ఆశ్చర్యం కలిగింది. తన శరీరం, హృదయం తన కంట్రోల్‌లో ఎందుకు ఉండడంలేదు, అని ప్రశ్నించుకున్నాడు. ఒక గంటక్రితం ఆమె ఎవరో కూడా తెలియదు. మరి ఇది ప్రేమని ఎలా అనుకోవాలి? ఇది కేవలం ఆకర్షణ, యౌవనంలో ఉండే మోజు కాబోలు. ఇన్నాళ్ళూ లల్లీని తిట్టి ఇప్పుడు తనూ అదే పంథాలో పయనిస్తున్నాడేమిటి? అని తనను తాను తిట్టుకున్నాడు.

"నువ్వు అదుపు తప్పిపోకు. బుద్ధిగా ఉండు" అని మనసుని చివాట్లు వేశాడు.

పెళ్ళిళ్ళు స్వర్గంలో జరుగుతాయంటారు. మరి రెండు హృదయాల కలయిక ఎక్కడ జరుగుతుంది? ప్రేమ ఎక్కడ పుడుతుంది? బహుశా అది కూడా స్వర్గంలోనే జరుగుతుంది కాబోలు. లేకపోతే తన మనసు ఆమెకోసం ఎందుకిలా కొట్టుకులాడిపోతోంది. ముందే విధి నిర్ణయించిందా? అతనికి ఎన్నడూలేని ఊహలు, ఆలోచనలు ఏవేవో కలిగాయి. ఆలోచనలకి అర్థంపర్థం లేకుండా పోయింది.

మళ్ళీ ఆమెని చూడాలన్నకోర్కె...

మళ్ళీ క్లాసు మొదలయ్యింది. వీలైనప్పుడల్లా ఆమెవైపు చూస్తూనే వున్నాడు.

ఆమె ఇద్దరు ముగ్గురు అమ్మాయిలతో ఫ్రెండ్‌షిప్ చేసి వాళ్ళతో టీ తాగి వచ్చినట్లుంది. వాళ్ళంతా నవ్వుతూ, తుళ్ళుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

"మీరు ఇవ్వాళే వచ్చినట్లున్నారు? " బలరాం ఆమెని పలకరించాడు.

"అవును" ఆమె నవ్వుతూ సమాధానమిచ్చింది.

బలరాం ఆమెతో మాట్లాడడం విజయ్‌కి నచ్చలేదు.

"ఎందుకు? " అని తనని తాను ప్రశ్నించుకున్నాడు.

'ఎందుకంటే, బలరాం ఆమెని కేవలం ఒక అందమైన స్త్రీగా మాత్రమే చూస్తు

న్నాడు కాబట్టి' అని సమాధానం చెప్పుకు న్నాడు. ఆమెని క్లాస్‌మేట్‌గా పలకరించి ఉంటే అది వేరు. కానీ ఇందాక ఆమె శరీ రాన్ని వర్ణించి ఇప్పుడు ఆ కళ్ళతోనే ఆమెని చూస్తూ, ఆ నోటితోనే మాట్లాడుతున్నాడు. ఆమె అందాన్ని బలరాం అలా అతని కళ్ళతో ఆస్వాదించడం విజయ్‌కి ఎంత మాత్రం నచ్చలేదు.

ఇంతలో లెక్చరర్ రావడంతో అంతా సైలెన్స్ అయిపోయారు.

ఆ రోజంతా అలాగే గడిచిపోయింది. వీలైనప్పుడల్లా ఆమెవైపు చూడడం, ఆమె రూపాన్ని కళ్ళలో, నిలుపుకోవడం ఆ మత్తుని గుండెల్లో నింపుకోవడం ఆనందాన్ని అనుభవించడం,

మళ్ళీ మళ్ళీ ఆ ఆనందాన్ని పొందాలని, తిరిగి తిరిగి ఆమెవైపు చూడడం....

ఆరోజు క్లాసులు ముగిశాయి.

ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోవాల్సిరావడం అతనికి దుర్భరం అనిపించింది.

రాత్రంతా ఆమెగురించే ఆలోచన. మళ్ళీ ఆమెని ఎప్పుడు చూస్తానా అని ఆతృత.

అతనుపొద్దున్నే లేచాడు. స్నానం గట్రా ముగించి బీరువా దగ్గరకు వెళ్ళి నిలబ డ్డాడు.

విజయ్ కొత్తగా యూనివర్శిటీలో చేరాడని రాజారావు అతనికి కొన్ని కొత్త డ్రస్‌లు కుట్టించాడు. నిజానికి విజయ్‌కి బట్టలమీద పెద్దగా ఆసక్తిలేదు. ఏది దొరికితే అది వేసు కుని వెళ్ళిపోయే రకం. కానీ ఈరోజుమాత్రం అట్లా చేయలేదు. ఆమె కళ్ళకి అందంగా ఆకర్షణీయంగా కనిపించాలనిపించింది. లేత నీలిరంగు ప్యాంటూ, షర్టూ తీశాడు. అవి వేసుకుని షూస్ బిగించి, చకచకా బయ టకు నడిచాడు.

రోజూకన్నా చాలా చురుగ్గా ఉన్నాడీ రోజు. ఏదో తెలియని ఊపు, ఉత్సాహం, ఆనందం అనుభవించేస్తూ మత్తులో ముని గిన మనిషిలా అయ్యాడు.

రోడ్డు, మనుషులు, యూనివర్శిటీ, ఫ్రెండ్స్, క్లాస్‌రూమ్, ప్రొఫెసర్లూ, ఏవీ అత నికి తెలియడంలేదు. పలకరించినవాళ్ళకు ఏదో సమాధానం చెప్తున్నా, అదంతా కేవలం లాంఛనంగా జరిగిపోయింది. ఏదో కలల్లోని వ్యక్తిలా, వాస్తవిక ప్రపంచం, మను షుల మధ్య నిలబడ్డా, తను వీటికి చెందని వేరే మనిషిలా అనిపిస్తోంది అతనికి. అంద రిమధ్యా నిలబడి, ఆమెకోసం ఎదురుచూస్తు న్నాడు.

ఆమె రాదా ఏమిటి? అతని గుండె గుభే లుమంది.

క్లాసు మొదలైంది.

ఇవాళ ఆమె రాకపోతే ఎట్లా? అతని మొహం చిన్నబోయింది. మనసు దిగులుగా ఉంది. ఆమెని చూడ్డానికే తన జీవితం అని పించిందతనికి.

అయిదు నిమిషాలు అయిదు యుగాల్లా గడిచిపోయాయి.

ఆమె రాలేదు.

ఆరో నిముషంలో "సర్... నేను రావచ్చా" ఆమె స్వరం మార్దవంగా వినిపించింది.

తలుపువైపే మొహం తిప్పి ఊపిరి బిగ పట్టి ఆమె రాకకోసం ఒళ్ళంతా కళ్ళు చేసుకుని ఎదురుచూస్తున్న అతని నిరీక్షణ ఫలించింది.

ప్రొఫెసర్ రమ్మన్నట్లు తల ఊపాడు. ఆమె మెల్లగా చప్పుడు చెయ్యకుండా వచ్చి క్లాసులో కూర్చుంది. ఆ కుడివైపు సీట్లోనే.

కూర్చుని సర్దుకోగానే అతనివైపు చూసి పరిచయంగా నవ్వింది. అతనూ చిరునవ్వు నవ్వాడు. అంతవరకూ బిగపట్టిన ఊపిరిని ఒక్కసారి రిలీఫ్‌గా వదిలాడు.

క్లాసు ముగిసింది. ఏదో వంకతో పలక రించాలని ఆమె దగ్గరకు వెళ్ళాడు.

"లేటయిందేం? " అన్నాడు.

అమూల్య నవ్వింది. "కారు ట్రబుల్ ఇచ్చింది"

"ఓహో... ఆటోలో రావల్సింది"

"ఆ పనే చేశాను. అందుకే కేవలం అయిదు నిమిషాల లేట్‌తో సరిపోయింది"

"పోనీలెండి. ఏదో ఒకలాగా వచ్చేశారు, అంతేచాలు" అన్నాడు.

అమూల్య కొద్దిగా విస్మయంగా చూసింది.

విజయ్ పొడిదగ్గు దగ్గాడు.

"ఏంలేదు. మీరు అట్లా రాకపోతే క్లాస్ మిస్ అయి ఉండేవాళ్ళు కదా... అందుకని"

"అవును"

"మీరు ఉండేది ఎక్కడ?" విజయ్ అడిగాడు.

"హిమాయత్‌నగర్‌లో"

"మేం చిక్కడపల్లిలో ఉంటాం. మన ఇద్దరి ఇళ్ళూ దగ్గరే. ఏవన్నా పుస్తకాలు ఎక్స్‌ఛేంజ్ చేసుకోవచ్చు" అన్నాడు విజయ్.

"అవును"

ఇంకేం మాట్లాడాలో తెలియలేదు.

ఇంతలో ఆమె ఫ్రెండ్స్ వచ్చి పక్కన నిలబడ్డారు. ఆమె వాళ్ళతో వెళ్ళిపోయింది.

నాలుగు వారాలు గడిచేసరికి అతనికి ఆమెతో కాస్త స్నేహం పెరిగింది. రోజూ మాట్లాడుకోవడం జరుగుతోంది.

ఆమె తనవైపు ప్రశంసగా చూడడం, తనతో మాట్లాడేటప్పుడు ఆమె కళ్ళల్లో కనబడే వెలుగు, చిరునవ్వులు చిందులాడడం, ఇవేవీ అతని దృష్టిని దాటిపోలేదు. కానీ ఎందుకోగానీ అమూల్యతో ఎక్కువ మాట్లాడలేకపోయాడు.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను" అనేయాలని ఎన్నోసార్లు మనసు గంతులు వేసింది. కానీ అనలేకపోయాడు.

అంటే ఆమె ఏమనుకుంటుందో? అపార్థం చేసుకుని అసలు మాట్లాడడమే మానేస్తే? అప్పుడు ఈపాటి ఆనందం కూడా దక్కకుండా పోతుందేమో?

అతనికి ఈ స్థితి దుర్భరంగా ఉంది. అన్నం సహించడంలేదు. నిద్రపట్టడంలేదు.

అతను వెర్రివాడిలా అయిపోయాడు. తండ్రి తనకు చేసిన బోధ అంతా మర్చిపోయాడు. ఆ బోధ సంగతి అటుంచి, అసలు స్వతహాగా అతనికి ఇట్లాంటివి కూడదనిపించేది ఇదివరకు. ఒక చెల్లెలు, ఒక అక్క, ఇద్దరు మనుషుల బాధ్యత నెత్తిమీద ఉంది. ప్రేమా దోమాలాంటివాటి జోలికి పోక బుద్ధిగా చదువుకుని, వాళ్ళకు ఆదర్శప్రాయంగా ఉండాలనుకునేవాడు. ఇప్పుడు అతనికి అవేవీ గుర్తులేవు. అమూల్య తప్ప మరేదీ అతని మనసులోలేదు.

తన మనసు విప్పి, ఆమెముందు పరిచెయ్యాలనే వెర్రికోరిక... వ్యతిరేక ఫలితం వస్తుందేమోననే భయం అతన్ని కుదిపేస్తున్నాయి.

ఆరోజు అమూల్య రోజూకన్నా అందంగా అలంకరించుకుంది. నున్నటి, గుండ్రటి మెడచుట్టూ కెంపుల నెక్లెస్, చెవులకు ఊగిసలాడుతున్న కెంపుల జూకాలు, అందమైన జడలో నవ్వుతున్న జాజులమాల, ఎర్రటి జరీ అంచు పట్టుచీరె, జాకెట్టు.

"మీరు ఇవాళ స్పెషల్‌గా కనిపిస్తున్నారు" అనేశాడు.

"అవును. రేపు మా ఇంట్లో చిన్న ఫంక్షన్ వుంది. తెలిసినవాళ్ళని పిల్చి వస్తూ అట్లాగే ఇటు వచ్చేశాను. నా ఫ్రెండ్స్‌ని కూడా కొంతమందిని పిలుస్తున్నాను. మీరూ తప్పకుండా రావాలి. మా అన్నయ్య కొడుకుని రేపు ఉయ్యాల్లో వేస్తున్నాం" అంటూ ఆమె ఒక కార్డు అతని చేతికందిస్తూ చెప్పింది.

"ఆడవాళ్ళ ఫంక్షనేమో" సందేహంగా చూశాడు విజయ్.

అమూల్య విరగబడి నవ్వింది.

"అట్లా అయితే మిమ్మల్నెందుకు పిలుస్తాను? రాత్రి డిన్నర్. మా అన్నయ్య ఫ్రెండ్సంతా వస్తారు. మీకేం సందేహం వద్దు. తప్పకుండా రావాలి. మన క్లాసులో నా ఫ్రెండ్స్ రమ, విమల వస్తారు. విమల భర్త కూడా ఉంటాడు" అంటూ ఆప్యాయంగా చెప్పింది.





"తప్పకుండా వస్తాను" అన్నాడు విజయ్.

నిజానికి ఆమె ఇంటినీ, ఇంట్లోవాళ్ళనీ ఎప్పుడెప్పుడు చూద్దామా అని ఉంది అతనికి. ఆమెకి సంబంధించినవి ఏవైనా సరే, వాటన్నిటినీ పరిచయం చేసేసుకోవాలని ఉంది.

ఆమె ఇల్లు ఎట్లా ఉంటుందో? ఆమె తల్లి దండ్రులు, తోబుట్టువులూ ఎట్లా ఉంటారు? వెళ్ళి చూడాలి. అందర్నీ పరిచయం చేసుకోవాలి అనిపించింది.

ఆమె వెళ్ళగానే బలరాం మెల్లగా వచ్చాడు. "ఏమిటి? నీకేదో కార్డు ఇచ్చినట్లుంది? " అన్నాడు బలరాం. అతని కళ్ళలో అసూయ.

"వాళ్ళ అన్నయ్య కొడుకుని ఉయ్యాల్లో వేసే ఫంక్షన్‌ట"

"అట్లాగా. ఏమిటి నీకొక్కడికే స్పెషల్‌గా ఆహ్వానం? "

"అప్పుడప్పుడూ మాట్లాడుతుంటాంగా. అదే స్పెషల్" అన్నాడు విజయ్.

"నేనూ మాట్లాడుతుంటానుగా అప్పుడప్పుడూ అయినా నన్ను పిలవలేదు" గొణిగాడు బలరామ్.

అమూల్య తనని పిలవకపోవటం అతనికి ఉక్రోషం కలిగించింది. అందుకే ఆ విషయాన్ని అంతటితో వదిలెయ్యకుండా పొడిగించాడు.

"పిలిచినా ఎవరు పోతార్లే. ఈ బ్రాహ్మిన్స్ ఇళ్ళకి ఫంక్షన్స్‌కి వెళ్ళటం అంటే నాకు మహా మంట. నాకు తెలీక ఒకసారి వెళ్ళాను. నాకు విడిగా వడ్డించారు. బ్రాహ్మ ణులందరికీ ఒక రౌండ్‌లో వడ్డించి, మిగతా వాళ్ళకి ఇంకో పంక్తి పెట్టారు. ఏమనుకుంటారో ఏమిటో? ఆవిడ నన్ను రమ్మని ప్రార్థించినా నేను పోను"

మొదటి రెండు వాక్యాలూ తప్ప మరొక్క ముక్క కూడా విజయ్ చెవుల్లోకి ఎక్కలేదు.

అతని చెవులు అప్పటికే ఘోషపెట్టడం మొదలుపెట్టాయి. గుండెల్లో రొద... మరేదీ వినబడకుండా కందిరీగల రొద. నిస్సహాయంగా, విషాదంగా నిలబడిపోయాడు.

"అమూల్య బ్రాహ్మిన్" ఈ నిజం అతని గుండెని కోతపెట్టింది. అతనెందుకో అమూల్య తన కులమే అనుకున్నాడు.

అమూల్య నవ్వు, అమూల్య ఆప్యాయత, ప్రేమ, అమూల్య అందం వీటిని వేటినీ తను ఇంక తలవటం శుద్ధ దండుగ. తమ మధ్య కులాల అంతరం ఉంది.

అమూల్య బ్రాహ్మిన్. ఓ దేవుడా! ఇన్ని కులాలు ఉండగా అమూల్య బ్రాహ్మిన్ ఎందుకు కావాలి? తన ఇంట్లో ఈ పెళ్ళికి ఒప్పుకోరు. తండ్రిని ఎట్లాగో ఒకలా ఒప్పించగలిగినా అసలు అమూల్య తనను చేసుకునేందుకు ఒప్పుకోవాలికదా. ఒప్పుకోకపోవచ్చు అసలు ఈ ఆహ్వానమే ఎక్కువ. ఇంక స్నేహం, ప్రేమ అసలు అసంభవం. తండ్రి చెప్తూనే ఉంటాడు వీళ్లందరికీ కులం పట్టింపు ఉండితీరుతుందని. ఎక్కడో అరుదుగా కులాంతర వివాహాలు జరుగుతూనే ఉన్నాయి. మరి తన అదృష్టం ఎలా ఉందో?

అతనికి మిన్ను విరిగి మీదపడినట్లయింది. పిడుగు దెబ్బతిన్న చెట్టులా అయ్యాడు.

"ఏమిటి? అట్లా అయిపోయావేం? " బలరామ్ విజయ్‌ని కుదుపుతూ అడిగాడు.

"ఏంలేదు. ఎందుకోగానీ అమూల్య బ్రాహ్మిన్ అని అనుకోలేదు"

"ఎందుకనుకోలేదు. ఆ అందం, ఆ తెలివీ చూస్తే తెలియటంలేదూ... అవి ఉండబట్టే కదా, ఇన్నాళ్ళూ వాళ్లు మిగతావాళ్ళని అజ్ఞానంలో పడేసి అణగదొక్కారు" అక్కసుగా అన్నాడు బలరామ్.

"అవన్నీ పూర్వపు రోజులు. ఇప్పుడదంతా ఎక్కడుంది. అంతా సమానమే. అంతా ఒక్కటే"

"అని నువ్వనుకుంటున్నావు. సరే

ఎట్లాగూ నిన్ను పిలిచిందికదా. రేపు వెళ్ళి చూడు. చూస్తే నీకే తెలుస్తుంది" అన్నాడు బలరామ్.

ఆరాత్రి విజయ్‌కి నిద్రపట్టలేదు. కలత నిద్ర, పీడకలలు.

ఫంక్షన్‌కి వెళ్ళాలో వద్దో నిర్ణయించుకోలేకపోయాడు. ఎంతో ఆలోచించి చివరకు వెళ్ళటానికే నిశ్చయించుకున్నాడు. బ్రాహ్మణుల్లోనూ ఎంతోమంది సంఘంలో దురాచారాలపట్ల పోరాటం సాగించిన వాళ్లున్నారు. సమానత్వం కోసం పోరాడినవాళ్లున్నారు. అందరినీ ఒకేవిధంగా ఎందుకనుకోవాలి. అమూల్య హృదయం మంచిదే అయివుంటుంది. పోనీ ఆమె ఎట్లా అయినా ఉండనీ, తనకు స్నేహితురాలు అంతే! స్నేహం కోసం వెళ్ళాలి.

అతను వెంటనే పిల్లల బట్టలూ బొమ్మలూ అమ్మే షాప్‌కి వెళ్ళి చిన్నపిల్లాడికి ఏదన్నా ప్రెజెంటేషన్ చూపించమని అడిగాడు.

"ఎంత వయసు"

"రోజుల పిల్లవాడు"

"డ్రెస్ చూస్తారా? "

"డ్రెస్ వద్దు..." ఏం కావాలో అర్థంకాలేదు విజయ్‌కి.

"చూడండి మరి"

విజయ్ షాప్ అంతా తిరిగాడు. ఒక బొమ్మ అతన్ని ఆకర్షించింది. ఇప్పుడే వాడికి బొమ్మలంటే తెలియకపోవచ్చు కానీ రెండు మూడు నెలలు పోగానే బొమ్మలు గుర్తుపట్టి కేరింతలు కొడతాడు.

"ఆ బొమ్మ ప్యాక్ చెయ్యండి" అన్నాడు. కాస్త ఖరీదు ఎక్కువే. అయినా ఆ బొమ్మ ఎంతో ముద్దుగా అనిపించింది.

అమూల్య తన మేనల్లుడిని ఎత్తుకుని ఆ బొమ్మ చూపించి ఆడిస్తుంది. ఆ ఊహకి అతనికి నవ్వు వచ్చేసింది.

"సాయంత్రం పార్టీకి వెళ్తున్నావా? " బలరామ్ అడిగాడు.

"వెళ్తున్నాను"

"వెళ్లు. పిలిచాక వెళ్లకపోతే బాగుండదు" అని, ఆ తర్వాత అతనే మళ్ళా చెప్పాడు.

"నువ్వు చెప్పింది నిజమే. అంతా ఒకేలా ఉండరు. అమూల్య ఫ్రెండ్స్ రమా, విమలా ఉన్నారు చూడు. వాళ్ళు మాట్లాడుకుంటూంటే విన్నాను. వాళ్ళిద్దరూ మాంసాహారులే. అమూల్య అందరితో కలిసిపోతుందిట. వాళ్ళేమన్నా పెట్టినా తినేస్తుందిట. వాళ్ళింట్లో అంతా సహృదయులట. ఇంకో సంగతి తెలుసా. ఇప్పుడు ఈ పిల్లాడు అమూల్య అన్నకి సొంతంగా పుట్టిన కొడుకు కాదుట" అన్నాడు బలరాం.

"మరి..."

"వాళ్ళన్నయ్యకి పెళ్ళయి చాలా రోజులైంది. కానీ పిల్లలు పుట్టలేదుట. చూసి చూసి ఆశ వదిలేసుకున్నారుట. ఎవర్నయినా పెంచుకోవాలని అనుకుని, ఈ పిల్లాడిని దత్తత చేసుకున్నారుట. అనాధాశ్రమం నుంచి తెచ్చుకున్నారుట. వాడి కులమేదో, గోత్రమేదో ఎవరికీ తెలీదు"

"అట్లాగా"

"అవును. ఇట్లాంటివి అందరూ చెయ్యలేరు. తమ కులాభిమానం వదులుకోలేరు. ఏదో మామూలు జనరల్ ఫంక్షన్స్‌కి అందర్నీ పిలుస్తారు కానీ లేకుంటే అంతా తమ తమ కులాలవాళ్ళే ఉంటారు. అట్లాంటి సమాజంలో బతుకుతున్నవాళ్ళు, ఏ కులమో కూడా చూడకుండా పిల్లాడ్ని తెచ్చుకుని పెంచుకుంటున్నారంటే అదో విశేషమే"

"అవును"

"అమూల్య వాళ్ళన్నయ్య ఏదో పెద్ద వ్యాపారం చేస్తున్నాడుట. బాగా సంపాదించాడుట కూడా. మరి ఎవరికో తమ ఆస్తి మొత్తం ధారపోయటం కష్టంగా ఉండదూ"

"ఉంటుంది"

"అదే నాకు ఆశ్చర్యంగా ఉంది. ఇవన్నీ తెలిశాక వాళ్ళమీద దురభిప్రాయం





పోయింది నాకు"

ఈ సంగతి విన్నాక విజయ్‌కి అమూల్యమీద ప్రేమ ఇంకా ఇంకా పెరిగింది. వెళ్ళి వాళ్ళందరినీ చూడాలనిపించింది.

కాలేజీనుంచి ఇంటికి వెళ్ళి శుభ్రంగా స్నానంచేసి చక్కగా తయారయ్యాడు.

హిమాయత్‌నగర్లో ఇల్లు కనుక్కోవటం ఏమంత కష్టం కాలేదు. అంత పెద్ద కాంపౌండ్‌ని, మ్యూజియంలాంటి ఇంటిని అతను బయటనుంచి తప్ప ఎన్నడూ లోపలికి వెళ్లి చూడలేదు. ఇంటిముందు చాలా కార్లు ఆగిఉన్నాయి. ఇల్లంతా లైట్లతో అలంకరించారు. ఇంద్రభవనంలా వెలిగిపోతున్న ఆ ఇంట్లోకి వెళ్లాలంటే ఏదో జంకుగా అనిపించింది. తనలా నడిచివచ్చినవాళ్ళు అక్కడెవరూ లేరని గ్రహించాడు.

గేట్లోనే అమూల్య ఎదురయింది.

"రండి. రండి" అంది సంతోషంగా ఆహ్వానిస్తూ.

"ఇల్లు తొందరగానే దొరికిందా? ఇవాళ క్లాసులో ఏంచెప్పారు?" అమూల్య ఏవో ప్రశ్నలు అడుగుతూ ముందుకి నడుస్తోంది. ఆమెని అనుసరిస్తూనే చుట్టూ పరికించాడు విజయ్.

ఎత్తయిన గోడల కాంపౌండ్‌లో ముందువైపు అన్నీ పూలమొక్కలున్నాయి. గులాబీలు, సన్నజాజులు, లిల్లీలు ఇంకా ఏవేవో విరగపూసి ఉన్నాయి. కుండీల్లో మొక్కలు. వాటి పేర్లేవో కూడా అతనికి తెలియలేదు. పూలమొక్కలకి కంచెలా చిన్న చిన్న పూలున్న చెట్లు లైన్‌గా పెంచారు. విశాలమైన ఆవరణలో ఎత్తైన భవనం. ఒకపక్కగా కారుషెడ్లు. భవనం దాటి లోపలకు వెళ్ళాక పెద్దతోట. అందులో పెద్ద పెద్ద చెట్లు, మధ్య మధ్య కుర్చీలు వేసి పార్టీ అరేంజ్ చేశారు. తోటలో అక్కడక్కడా ఆర్చీలమీద పాకించిన పూలతీగెలు. అక్కడక్కడా శిల్పాలు కూడా ఉన్నాయి. నీళ్ళబిందె పట్టుకున్న యువతుల శిల్పాలూ, కూర్చుని ఉన్నట్లుగా ఉన్న కుక్కబొమ్మలూ అన్నీ సజీవంగా కనిపిస్తున్నాయి. నగరం నడుమ, అలాంటి సెంటర్‌లో అంత పెద్ద కాంపౌండ్ ఉంటుందని అతను ఊహించలేదు. బిల్డింగ్ పాతకాలపుదైనా, చిన్నదిగా అందంగా ఉంది. ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయాడు.

అతిథులంతా ఖరీదైన మనుషుల్లాగే ఉన్నారు. పట్టుచీరెలు, వజ్రాల, కెంపుల ఆభరణాలు, తెల్లతెల్లటి మనుషుల, అహంభావపు చూపులు, మల్లెపువ్వుల ఘుమఘుమలు. వాళ్ళందరినీ చూస్తే, లోకంలో డబ్బున్న వాళ్ళూ, లేనివాళ్ళూ అని రెండే కులాలేమో అనిపించింది అతనికి. అమూల్యకీ, తనకీ ఉన్న అంతరం కొట్టవచ్చినట్లు కనిపించింది. కులంకన్నా మిన్నగా అంతస్థుల అంతరం ఉంది. కులాన్ని లెక్కచేయకపోవచ్చుగానీ, అంతస్థుల్ని అధిగమించటం ఎట్లా?

అమూల్య మేనల్లుడిని ఎత్తుకుని వచ్చింది. పిల్లాడంటే మరీ పసిపిల్లాడేం కాదు. ఆరు నెలలు దాటినట్లున్నాయి. అప్పుడే తన కొత్త తల్లిదండ్రులకీ, మేనత్తకీ బాగా అలవాటయిపోయినట్లున్నాడు. వాళ్ళు తప్ప ఇంకెవళ్లు ఎత్తుకున్నా ఏడుస్తున్నాడు. బొద్దుగా ముద్దుగా ఉన్నాడు. అమూల్య ఎత్తుకుంటే నవ్వులు ఒలికిస్తున్నాడు. మొత్తానికి ఆ ఇంట్లో వాళ్ళంతా బాగా కలిసిపోయి ఒకళ్ళకొకళ్ళు అలవాటు పడిపోయినట్లున్నారు.

"వీడేనండీ, మా అల్లుడు" అంది అమూల్య విజయ్‌కు పిల్లవాడిని చూపిస్తూ.

విజయ్‌ను చూసి వాడు కేరింతలు కొట్టాడు.

"ఫర్వాలేదు. మిమ్మల్ని చూసి బాగా సంతోషిస్తున్నాడు" నవ్వింది అమూల్య.

తర్వాత తన తండ్రిని పరిచయం చేసింది.



ఆయన ఆరడుగుల పొడవున్నాడు. సూటిగా చూస్తున్న కళ్ళు, సూటయిన ముక్కు, పాలు, గులాబీలు కలిపి చేసిన ట్లున్న ఒంటిరంగు, కాస్త వయసు పైబడ్డ గ్రీకుయోధుడిలా ఉన్నాడనిపించింది విజ య్‌కు.

విజయ్ నమస్కారానికి ఆయన ప్రతినమ స్కారం చేశాడు. అంత బిజీలోనూ విజ య్‌ని ఆప్యాయంగా పలకరించాడు. చదువూ, అభిరుచులూ అడిగి తెలుసుకు న్నాడు. భోజనం చేసి మరీ వెళ్ళాలని అభ్య ర్థించాడు.

సహవిద్యార్థినులు రమా, విమలా కూడా రావటంతో విజయ్‌కి కాస్త బెరుకు తగ్గింది. అంతదాకా తను ఒక్కడూ అక్కడ ఒంట రిగా ఉండిపోయినట్లు అనిపించింది. అమూల్య అప్పుడప్పుడూ అటూ ఇటూ వెళ్ళి ఎవరెవర్నో పలకరించి, ఆహ్వానించివ స్తోంది. అక్కడ ఉన్నవాళ్ళల్లో ఎవరూ విజ య్‌కి పరిచయస్థులు కారు. రమా, విమలా రాగానే హమ్మయ్య అనిపించింది. విమల భర్త కూడా వచ్చాడు.

అప్పుడే తెలిసింది అతనికి. విమలది లవ్‌మారేజ్. ఆమె భర్తది వేరే కులం అని. అతను ఉద్యోగం చేస్తున్నాడు. విమ లకి చదువుమీద ఆసక్తి ఉండి చదువుకుం టోంది.

విమల భర్తని పరిచయం చేశాక, అందరూ ఏవేవో మాట్లాడుకుంటూ ఉండి పోయారు.

అమూల్య పిల్లవాడిని తీసుకొచ్చి రమకీ, విమలకీ చూపించి అంతలోనే ఎవరో పిలిస్తే మళ్ళీ వెళ్ళింది.

"వెధవ. లాటరీ కొట్టాడు. హాయిగా వీళ్ళు దత్తత చేసుకుని సర్వభోగాలూ జరిపిస్తు న్నారు" అన్నాడు విమల భర్త.

విజయ్‌కి అతను చెప్పింది నిజమే అయినా ఆ మాట అన్న విధానం నచ్చ లేదు. అంత చిన్నపిల్లాడిమీద అసూయ పడటం నవ్వు పుట్టించింది.

ఇంతలో భోజనాలకి పిలుపు వచ్చింది.

అందరికీ కొసరి కొసరి వడ్డించారు. టమాటా పప్పు, వంకాయ కారంపెట్టి చేసిన కూర, ఆలుగడ్డల కూర, పచ్చడి, ఆవకాయ, గోంగూర, సాంబారు, చారు, మంచిపెరుగు, లడ్డూ, కాజా, జిలేబీ... వంట అద్భుతంగా ఉంది.

"ఎవరు తింటారీ బీరకాయా, వంకాయా? ఏదో విమల రమ్మన్నది కాబట్టి రాకతప్ప లేదు" గొణుగుతూ తిన్నాడు విమల భర్త.

అంతమంచి భోజనానికి అతనెందుకు వంకలు పెడుతున్నాడో అర్థం కాలేదు విజ య్‌కి. బహుశా అంతా చూసే కళ్ళల్లోనే ఉంటుందేమో అనిపించింది. తినేతిండిలోని రుచి పదార్థంలో కాదు, మనసులో ఉంటుం దేమో. తను కూడా మాంసాహారే. కానీ శాఖాహారాన్ని ఈసడించటం తనకు నచ్చదు.

అమూల్య బంధువులు, మిత్రులు అను కుంటున్న మాటలు కూడా అతని చెవిని దాటిపోలేదు.

"పెంచుకోవాలంటే చుట్టాల్లో ఎంతమంది పిల్లలు లేరు. బీదవాళ్ళని పెంచుకుంటే వాళ్ళని ఉద్ధరించినట్లే అయ్యేదికదా. మరెం దుకు అట్లా చెయ్యలేదు? ఒకళ్లని అడగరూ పెట్టరూ. అహంభావం. ఎవర్నో తెచ్చుకుని పెంచుకుంటున్నారు" అని బంధువులూ...

"మనల్ని అడిగి ఉంటే బాగుండేది. ఏంటో ఇట్లా చేశారు. ఆ పిల్లవాడెవడో ఏమిటో? ఎట్లాంటి బుద్ధులు వస్తాయో" అని కొందరు మిత్రులూ...

ఈ మాటలు అన్నవాళ్ళల్లో అన్ని కులాల వాళ్ళూ ఉన్నారు.

మనుషులంతా ఒకేలా ఆలోచిస్తారేమోన నిపించింది విజయ్‌కి. ఇందులో అనుచి తంగా చేసింది ఏముందని వీళ్ళు ఇంత బాధపడిపోతున్నారు. వాళ్ళు తమకి నచ్చిన పిల్లాడిని తాము దత్తత తీసుకోవడం కూడా





తప్పేనా? దానికి కూడా అందర్నీ సంప్రదించి, సలహా తీసుకోవాలా?

భోజనాలయ్యాయి.

తర్వాత కాసేపు కబుర్లు చెప్పుకుని అంతా బయల్దేరారు.

ఆ వెన్నెల్లో, ఆ రాత్రి తృప్తిగా భోంచేసి, స్నేహంగా చూస్తున్న అమూల్య కళ్లల్లోకి చూస్తూ ఆమె దగ్గర్నుంచి వీడ్కోలు తీసుకోవటం విజయ్‌కి మరపురాని అనుభూతే అయింది.

"రేపు కాలేజీకి వస్తున్నారా?" అడిగాడు.

"కాస్త కష్టమే. ఇంట్లో పని చాలా ఉంది"

"మీకు ఇంటిపని ఏమిటీ? బోలెడుమంది ఉన్నట్లున్నారు. వస్తే బాగుంటుంది" మెల్లగా అన్నాడు.

"బాగుండేది ఎవరికి?" అమూల్య అనుకోకుండానే కొంటెగా అనేసింది.

"నాకు" అన్నాడు విజయ్ తడబడకుండా.

"అయితే నా చేతనైనంత ప్రయత్నిస్తాను" అంది అమూల్య.

"థాంక్యూ. థాంక్యూ" అన్నాడు విజయ్.



"అందరం వైజాగ్ వెళ్తున్నాం. పెళ్ళి ఉందిగా" రాజారావు అన్నాలు తింటుండగా అనౌన్స్ చేశాడు.

విజయ్‌కి ముద్ద గొంతులో అడ్డుపడింది. ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"నాకు కుదరదు. మీరంతా వెళ్ళిరండి" అన్నాడు.

"అదేంటి, ఒక్కడివే ఎట్లా ఉంటావు? భలేవాడివే. అందులో నీకు వంట కూడా సరిగా చేతకాదు. అన్ని పనులూ చేసుకుంటూ ఎట్లా ఉండగలవు? నువ్వూ రా" అంది రంగమ్మ.

"లేదమ్మా.... ఎట్లాగో ప్రయత్నిస్తాను. వంటదేముంది... నేను రాను" అన్నాడు.

"అన్నయ్య ఏమిటోగానీ, ఈ ఎమ్మెస్సీలో చేరాక ఒక్క క్లాసు కూడా మిస్ చేయటం లేదు" లలిత కొంటెగా నవ్వింది.

చెల్లెలు తన వ్యవహారమేమన్నా పసిగట్టిందా అని భయం వేసింది విజయ్‌కి. అనుమానంగా చూశాడు.

"మరేంలేదు. ఇదివరకు వైజాగ్ వెళ్ళాలంటే ఎంతో ఉత్సాహం చూపించేవాడివి కదా! బీచ్ చూడాలని బోలెడంత సరదా పడిపోయేవాడివి" అంది లలిత మళ్ళీ.

నిజమే. వైజాగ్ అంటేనే ఉత్సాహపడేవాడు. చిన్నప్పుడు పెళ్ళిళ్ళూ అవీ చూడటం, బంధువుల పిల్లలందరితో కలిసి అరుస్తూ, అల్లరిచేస్తూ ఆడుకోవటం ఎంతో బాగుండేది. ఆ రైలు ప్రయాణం, ఆ అల్లరీ మళ్ళీ ఎప్పుడెప్పుడా అని ఎదురుచూస్తుండేవాడు. తర్వాత కాస్త పెద్దయ్యాక రైలుప్రయాణంలాంటి సరదాలు పోయినా సముద్రం అంటే మాత్రం ఇష్టంగా ఉండేది. హైదరాబాద్ అన్నిటికీ బాగున్నా సముద్రం మాత్రం లేదు. పుట్టినప్పటినుంచీ హైదరాబాద్‌లోనే ఉండి, ఒక్కసారిగా సముద్రం చూస్తే బోలెడంత ఆశ్చర్యం వేస్తుంది. ఆ అనంత జలరాశి... అద్భుతంగా, ఆ అలలమీద నిల్చుంటే కాళ్ళకింద ఇసుక కదిలిపోతున్నట్లున్న ఆ అనుభవం... నీలిరంగు జలరాశి... తెల్లటి నురగ... గోధుమరంగు ఇసుక... అట్లా సముద్రాన్ని చూస్తూ

నిల్చున్నకొద్దీ ఏదేదో అనుభూతి, ఎటో సాగి పోతున్నట్లు, ఏవో తెలియని ద్వారాలు తెరుచుకుంటున్నట్లు, ఏదో తెలుసుకుంటున్నట్లు, ఒక అయోమయంతో కూడిన అనుభవాన్ని ఆ సముద్రం విజయ్‌కి ఇచ్చేది. ఆకాశంలో చుక్కలు, సముద్రం సృష్టి గొప్పదనాన్ని చాటిచెపుతాయి. ప్రకృతిలో మమేకం కావాలని మనిషికి తెలియకుండానే కోరిక ఉంటుంది. అందుకే సముద్రాన్నీ, నక్షత్రాలనీ చూసి ఆనందించని మనిషి ఉండడు.

సముద్రం చాలా గొప్పది. ఆకాశం ఇంకా గొప్పది. అట్లాగే ప్రేమ చాలాచాలా గొప్పదని విజయ్‌కి ప్రేమలోపడేదాకా అర్థంకాలేదు. ప్రేమ చాలా గొప్పది? దానికి వర్ణభేదాలు, వర్గభేదాలు లేవు. అది ఎప్పుడు ఎవరిమీద పుడుతుందో కూడా తెలియదు. అవతలి వ్యక్తి అందంగానో, అద్భుతంగానో ఉండాలన్నది కూడా లేదు. ప్రేమకి అహం తెలియదు. ప్రేమించే వ్యక్తికి అహం ఉండదు. ఈ విధమైన స్వచ్ఛత కేవలం పసిహృదయాల్లోనూ, ప్రేమించే హృదయాల్లోనూ మాత్రమే సాధ్యం. అందుకే మహోన్నతమైనది ప్రేమ.



"సమాధానం చెప్పకుండా ఏం ఆలోచిస్తున్నావు? " అన్నాడు రాజారావు.

"నాకు క్లాసులు పోతాయి..."

"ఏం ఫర్వాలేదు. టిక్కెట్లు కూడా బుక్ చేయించేశాను. మనం అక్కడ ఉండేదే నాలుగు రోజులు. అందులో రెండ్రోజులు నీకు సెలవులే. రెండ్రోజుల క్లాసులు మాత్రమే మిస్సవుతావు. అంతే. మనం వెళ్ళాలి. తప్పదు. మళ్ళీ నీ పెళ్ళికి వాళ్ళు రావాలా, వద్దా? " సరదాగా అన్నాడు రాజారావు.

తనమాట చెల్లకపోతే రాజారావుకి బాగా కోపంవస్తుంది. ఇంతవరకు విజయ్‌దగ్గర ఆయన భంగపడింది లేదు. ఇప్పుడు విజయ్ రానని మాట్లాడేసరికి ఆయనకి చచ్చేంత కోపం వచ్చింది. అతికష్టంమీద అణిచేసుకుని మామూలుగా మాట్లాడాడని విజయ్ గ్రహించాడు.

"బట్టలు సర్దుకో. ఇంకేం మాట్లాడకు" అన్నాడు రాజారావు.

విజయ్ దిగులు మొహం వేసుకుని కూర్చుంటే లలితకి చచ్చేంత నవ్వు వచ్చింది.

"ఎంత శ్రద్ధ. ఈసారి నీకే ఫస్ట్ రాంక్" అంది పకపకా నవ్వుతూ.

"నువ్వేం బాధ పడక్కర్లేదు. నాకు రాదు. నాకన్నా బాగా చదివేవాళ్ళు చచ్చినంత మందున్నారు" ఉక్రోషంగా అన్నాడు విజయ్.

లలిత మళ్ళీ నవ్వింది.

"అంత కోపం దేనికీ? " విరగబడి నవ్వుతూ అంది.

ఆ ఇద్దర్నీ చూసి మిగతావాళ్ళు కూడా నవ్వారు.

విజయ్ కూడా నవ్వేసి ఊరుకున్నాడు. గానీ ఆ క్షణంనుంచీ పెద్దదిగులు పట్టుకుంది.

ఎట్లా... ఎట్లా ఊరికి వెళ్ళి ఇన్నిరోజులు అమూల్యని చూడకుండా ఉండటం ఎట్లా?





ఇదివరకు ఎవరన్నా ఇలాగ ప్రేమలో పడ్డవాళ్ళు తమ గోడు వినిపిస్తే నవ్వొచ్చేది తప్ప వాళ్ళ బాధ అర్ధమయేది కాదు. కానీ ఇప్పుడు ప్రేమలో పడ్డాక వాళ్ళ బాధ తెలుస్తోంది. ఏదన్నా అనుభవిస్తేగానీ తెలీదేమో అని నవ్వుకున్నాడు.

అతనికి ముళ్ళమీద కూర్చున్నట్లుంది. గుండెనిండా దిగులు, దుఃఖం. అమూల్యని పిలిచి "నేను ఊరెళ్ళిపోతున్నాను. నాకోసం చూడకు" అని చెప్పాలనిపించింది.

ఎంత పిచ్చి ఆలోచన. అమూల్య తనకోసం ఎందుకు ఎదురుచూస్తుంది? తను ఎవరు, ఆమె ఎవరు? ఏముందని తమ మధ్య అనుబంధం. తన వెర్రితనం తప్ప ఏమిటి?

అయినా ఆమెకి ఎలాగైనా చెప్పాలనే ఉంది విజయ్‌కు. ఏదో మామూలుగా మాటలమధ్య చెప్పినట్లు చెప్పాలనుకున్నాడు.

మర్నాటి కోసం ఆతృతగా ఎదురుచూశాడు. క్లాస్ అయ్యాక బయటకు వస్తున్నప్పుడు నవ్వుతూ పలకరించాడు.

"మీరెప్పుడైనా వైజాగ్ వెళ్ళారా? " అడిగాడు.

"లేదు. ఏం, ఎందుకని? " నవ్వుతూ అంది అమూల్య.

"ఏం లేదు. మా బంధువుల పెళ్ళి ఉంది. మేం వచ్చే వారం వెళ్తున్నాం. నాన్నగారు వెళ్దామని బలవంతపెడుతున్నారు. నాకస్సలు వెళ్ళాలని లేదు" అన్నాడు.

"ఏం? ఎందుకు వెళ్ళాలని లేదు? " అమూల్య అడిగింది.

విజయ్ తడబడ్డాడు.

"ఏముంది. క్లాసులు మిస్సవుతామని" అన్నాడు.

"ఫర్వాలేదు. నా నోట్స్ ఇస్తాను. నాకొచ్చినంతలో మీకూ చెపుతాను" అంది అమూల్య.

"నిజంగా. ఎంత మంచివాళ్ళు"

"దానికేముంది. నాక్కావాలంటే మీరి

వ్వరా? "

"మీరడిగితే ఏమైనా ఇచ్చేస్తాను. నోట్సేం ఖర్మ" అమూల్య పగలబడి నవ్వింది.

విజయ్ ఆమె నవ్వుని ముగ్ధుడై చూస్తూ నిలబడ్డాడు. అమూల్య నవ్వుతుంటే ఒళ్ళు అందంగా కదులుతుంది. ఎర్రటి పెదిమలు విడివడి, తెల్లటి పలువరుస తళుక్కుమంటుంది. అందమైన మల్లెతీగె గాలికి కదిలి, ఆ గాలికి మల్లెపూలు రాలిపడినట్లు, ముత్యాల వాన కురిసినట్లూ అనిపిస్తుంది.

ఆ నవ్వుని చూస్తూ నిల్చుండిపోయాడు.

"ఏమిటి చూస్తున్నారు? " సర్దుకుని, సీరియస్‌గా ప్రశ్నించింది అమూల్య.

విజయ్ మళ్ళీ తడబడ్డాడు.

"ఏం లేదు. మీరేమనుకోకపోతే ఒక చిన్న కాంప్లిమెంట్. మీరు నవ్వుతుంటే చాలా బావుంటారు"

అమూల్య మళ్ళీ నవ్వింది.

"నేనేం అనుకోను. నాకిది అలవాటే. నా నవ్వు బాగుంటుందని నా క్లోజ్ ఫ్రెండ్స్, మా బంధువులూ అంతా అంటూనే ఉంటారు. నా స్కూల్ ఫ్రెండ్స్ కొందరు వేరే రాష్ట్రాలకీ, దేశాలకీ వెళ్ళిపోయిన వాళ్ళు కూడా ఫోన్‌చేసి ఫోన్‌లో ఆ నవ్వు విని ఆనందిస్తారు. మా అన్నయ్యా, డాడీ కూడా వాళ్ళ మూడ్ బాగాలేనప్పుడు, నన్ను పిలిచి నవ్వమంటారు. నేను నవ్వితే వాళ్ళు సంతోషిస్తారు. వాళ్ళ మూడ్ ఆటోమాటిక్‌గా బాగవుతుందట. నా నవ్వు ఆహ్లాదంగా అనిపిస్తుందంటారు"

అవును అనుకున్నాడు విజయ్ మనసులో. అమూల్య నవ్వితే మనోహరమైన ఆ నవ్వులో దీపాల కాంతులు, వజ్రాల తళతళలు... 'భగవాన్, ఆమె ఎప్పుడూ ఇట్లాగే నవ్వుతుండేట్లు, ఆ నవ్వు చూస్తూ నేను నిల్చిపోయేట్లూ వరం ప్రసాదించరాదూ' అనుకున్నాడు.

"మళ్ళీ వారంలో వచ్చేస్తారుగా" అన్న అమూల్య మాటలు అతన్ని ఈ లోకంలోకి తెచ్చాయి.

"ఆ! పెళ్ళి అయ్యాక వెంటనే వచ్చేద్దామన్నారు నాన్నగారు" అన్నాడు.

అమూల్య ఇంకేం మాట్లాడలేదు.

★ ★ ★

వైజాగ్‌లో ఉన్న నాలుగు రోజులూ దుర్భరంగా గడిపాడు విజయ్. ఎప్పుడెప్పుడు తిరిగి వెళ్ళి అమూల్యని చూస్తానా అనిపించింది. నిమిషాలు, క్షణాలు లెక్కపెట్టుకుంటూ గడిపాడు.

మళ్ళీ తిరుగుప్రయాణం. రైలెక్కారు. ఎక్స్‌ప్రెస్ రైలు ఎంతో నెమ్మదిగా వెళ్తున్నట్లనిపించి, చిరాకు కలిగింది. ఇంకా వేగంగా పోదేం? ఇంకా హైదరాబాద్ రాదేం? అనుకుంటూ, ఉగ్గబట్టుకుని గడిపాడు.

తెల్లవారింది.

హైదరాబాద్ వచ్చేసింది. గబగబా సామాన్లు దించేసి, ప్లాట్‌ఫామ్ మీదికి దూకినంత పని చేశాడు.

"ఏమిటా దూకుడు? మెల్లగా దిగు. వెళ్దాంలే. ఏమంత తొందర? " రాజారావు అన్నాడు.

"లేదు. తొందరగా వెళ్ళిపోవాలి. యూనివర్శిటీకి వెళ్ళాలి కదా? "

"ఇవాళ పోకపోతే ఏం? "

"లేదు లేదు వెళ్ళాలి"

ఇంటికి వెళ్ళాక ఆడవాళ్ళందరికీ నీరసం వచ్చేసింది. కాఫీ మాత్రం కలిపాక అన్నం ఇప్పుడే వండలేనని డిక్లేర్ చేసింది రాణీ రంగమ్మ.

"అలాగే" అన్నాడు రాజారావు.

"నేను వెళ్ళిపోతాను" అన్నాడు విజయ్.

"ఇంకా నయం. అన్నం తినకుండానా? "

"ఫర్వాలేదు. కాఫీ తాగానుగా"

"మధ్యాహ్నం ఎక్కడైనా లంచ్ చేస్తావా మరి? "

"చేస్తాను"

వెళ్ళీ, వెళ్ళగానే క్లాస్ మొదలైంది. అమూల్య కనిపించగానే అతనికి బోలెడంత

బలం వచ్చింది.

లంచ్ టైమ్‌లో అమూల్య పలకరించింది.

"ఇవాళ మా ఫ్రెండ్స్ రాలేదు. కాస్త కంపెనీ ఇస్తారా?" అంది నవ్వుతూ.

అతనికి ఆకలి వెయ్యలేదు. దప్పిక కూడా కలగలేదు. నిన్నరాత్రి కూడా ఏం తినలేదు. అతను పొద్దున్న ఎప్పుడో తాగిన కాఫీ తప్ప మరేం లేదు.

"తప్పకుండా" అన్నాడు.

"క్యాంటీన్‌కెళ్ళి ఏమన్నా తిందామా?"

"పదండి" అన్నాడు.

"క్యాంటీన్‌లో సమోసాలు, చిప్స్ తప్ప మరేం లేవు. అయినా అతనికి అదే పంచ భక్ష్య పరమాన్నాలుగా అనిపించింది.



"విజయ్ నిన్నొకటి అడగనా. ఏమీ అనుకోవుగా" బలరామ్ అడిగాడు.

"అడుగు" విజయ్ అన్నాడు.

"నువ్వీమధ్య అదోలా కనిపిస్తున్నావు. చేరినప్పుడు ఎంత ఉత్సాహంగా ఉండేవాడివో, ఇప్పుడు అంత డల్‌గా దిగులుగా కనిపిస్తున్నావు"

విజయ్ సమాధానం చెప్పలేదు.

"ఏంటి, మాట్లాడవేం, విజయ్! నేను నీ స్నేహితుడిని. శ్రేయోభిలాషిని. నువ్వు నన్ను నమ్మవచ్చు. నీ మనసులో ఉన్న బాధ ఏదైనా సరే... నాతో పంచుకో" అన్నాడు బలరామ్.

విజయ్ ఇంకా మౌనంగా ఉన్నాడు.

"నిజానికి అడగాల్సిన పని కూడా లేదు. నీ బాధ నాకు అర్థమైంది. నువ్వు అమూల్యని ప్రేమిస్తున్నావు. ఆమె కూడా నిన్ను ప్రేమిస్తోందో లేదో నీకు తెలీదు. నీ ప్రేమ పైకి వెల్లడించలేక లోలోపలే కుమిలి పోతున్నావు. అంతేనా?" అన్నాడు బలరామ్.

విజయ్ ఆశ్చర్యంగా చూశాడు.

"నీకెలా తెలుసు?" అడిగాడు.

"ఇంకా నయం. ఎలా తెలీదని అడుగు. ప్రేమలో పడ్డవాళ్ళని ఇట్టే పట్టెయ్యవచ్చు" అన్నాడు బలరామ్.

"బలరామ్..." విజయ్ బేలగా చూశాడు.

"ఊ... ఏంటి?"

"అమూల్య నన్ను ప్రేమిస్తున్నదంటావా?"

"అది చెప్పలేను. స్త్రీ హృదయం అగాథం. మనలా తొందరగా బయటపడరు. ప్రేమ సంగతి తెలీదుగానీ ఆమె నిన్ను బాగానే అభిమానిస్తుంది"

"బలరామ్. నీకేమనిపిస్తోంది. నా ప్రేమ ఫలిస్తుందంటావా?"

"విజయ్, సిన్సియర్‌గా చెప్పమంటావా"

"చెప్పు"

"అయితే విను. మీ ఇద్దరి మధ్యా కులాల తేడాయే కాక అంతస్థుల అంతరం కూడా ఉంది. నువ్వు నీ గురించి మర్చిపోయి మీ ఇద్దరి పరిస్థితులూ ఒక బయట వ్యక్తి ఆలోచించినట్లు ఆలోచించు. నీకేమనిపిస్తోంది"

"అసంభవం అనిపిస్తోంది"

"బహుశా సంభవం కూడా కావచ్చు. నిజమైన ప్రేమ ఈ అంతరాలని గమనించదు. కానీ నిన్ను చూస్తే నాకు భయంవేస్తోంది. ఆమె లేకుంటే నీ బతుకే దండగ అన్నట్లు ఉంది నీ ప్రవర్తన"

"నాకట్లాగే అనిపిస్తోంది మరి"

"అదే కూడదు. నువ్వు అట్లా భావిస్తుంటే ఆమె కాదంటే ఇంక జీవించలేని స్థితికి వస్తావు. ఏదీ అతిగా ఉండకూడదు" అన్నాడు బలరామ్.

విజయ్ సమాధానం చెప్పలేదు. కానీ తన పరిస్థితి తనకే తెలియనంత 'బలీయంగా ప్రేమ అతన్ని మత్తులో ముంచేసింది. అప్పుడప్పుడూ కలలోంచి మేల్కొని వాస్తవంలోకి వచ్చినట్లు, ఆ ప్రేమలోంచి బయటప్రపంచం గమనించే స్థితికి వస్తాడు.

ఆమె ప్రేమ పొందటం దుర్లభం అని తెలిశాక అతను బాధ్యతాయుతంగా ప్రవర్తించాలని ప్రయత్నించాడు. ఆమెని మర్చిపోవాలి. ఆమెని మర్చిపోవడానికి విజయ్ చెయ్యని ప్రయత్నంలేదు. సినిమాలు, ఆటలు, చదువు వీటిల్లో తన ధ్యానం నిమగ్నం చేద్దామని చూశాడు కుదరలేదు. వేటిమీదా ధ్యాస నిలవదు. అనుక్షణం అమూల్య తన కళ్ళముందే కదుల్తుంటే ఇంక ఆ ఊహలనుండి దూరంగా పారిపోవడం ఎట్లాగ? అది అసంభవమని అతనికి తేలిపోయింది.

కొన్నిరోజులు కాలేజీకి పోకుండా ఉంటే, ఆమెని చూడకపోతే మర్చిపోగలనేమో అనిపించింది. వారంరోజులు ఏకబిగిన కాలేజీ మానేశాడు. ఈ వారంరోజులూ దుర్లభంగా గడిచాయి. అశాంతి, ఆందోళన... కంటికి రోజూ వచ్చే ఆ కాస్త కలతనిద్ర కూడా రాలేదు. అన్నం సహించలేదు. బుగ్గలు పీక్కుపోయి, కళ్ళు లోతుకుపోయి మనిషి పేషెంట్‌లాగా తయారయ్యాడు. ఇంత చేసినా ఆమెని మర్చిపోలేకపోయాడు.

ఇంక అప్పుడు అతనికి అర్థమైంది ఆమె తన హృదయంలో తిష్ట వేసుకుని కూర్చుందని. ఆమె రూపాన్ని తన హృదయంలోంచి చెరపటం తనవల్లకాదు.

భరింపరాని నిరాశ... నిస్పృహ...

'ప్రేమికుడి ఆత్మహత్య' శీర్షికన పేపర్లో వార్తలు చదువుతుంటే తనూ చచ్చిపోతే ఎట్లా ఉంటుందన్న ఆలోచన కూడా కలిగింది. మరుక్షణం తననితాను మందలించుకుని కుటుంబంపట్ల తన బాధ్యతలు గుర్తు తెచ్చుకున్నాడు. 'జీవితంలో ప్రేమ ఒక భాగం. అంతేకానీ ప్రేమే జీవితంకాదు' అని తనకితాను పాఠం చెప్పుకున్నాడు.

కాలేజీకి వెళ్ళాక...

"మీరు ఈ వారం అంతా రాలేదు. ఏమైంది? ఏదన్నా ఊరు వెళ్ళారా? బలరామ్‌ని అడిగితే తనకూ ఏం తెలియదన్నాడు" అని అమూల్య ఆప్యాయంగా అడుగుతుంటే ఏం చెప్పాలో తెలియలేదు.

★ ★ ★

వాతావరణం చల్లగా ఉంది. ఉండుండి జల్లులు కురుస్తున్నాయి. బంగాళాఖాతంలో అల్పపీడనం అని టి.వి. చెబుతోంది.

స్కూలుపిల్లలు స్వెట్టర్లు, ఫుల్‌కోట్లు ధరించి ముద్దుముద్దుగా ఆటోల్లో, రిక్షాల్లో స్కూళ్ళకి పోతున్నారు. దగ్గర్లోనే స్కూలు ఉన్న పిల్లలు రెయిన్‌కోట్లు, గొడుగులతో ఆ బురదనీళ్ళలో నడుచుకుంటూ ఆనందంగా వెళ్తున్నారు.

విజయ్ ముదురు నీలిరంగు జీన్‌పాంట్ మీద ఎర్రగళ్ళ చొక్కా వేసుకుని తయారయ్యాడు. తలకి టోపీ పెట్టుకుంటూ బయటకు రాబోతుంటే తండ్రి ఎదురయ్యాడు.

"ఏంటి? కౌబాయ్‌లాగా బాగానే డ్రెస్ చేసుకున్నావు గానీ, ఎక్కడికి? " అన్నాడు.

"ఇంకెక్కడికి? కాలేజీకి"

"నీ మొహం. ఇంత వర్షంలో ఎలా వెళ్తావు. భారీగాగాని, అతి భారీగాగాని వర్షం పడుతుందని రేడియోలో చెప్పారు. వినలేదూ? " అడిగాడు రాజారావు.

విజయ్ గుండె గుభేల్‌మంది. వెళ్ళకపోతే ఎట్లా? అమూల్యని చూసి అప్పుడే పదహారు గంటలవుతోంది.

"లేదు నాన్నగారూ. వెళ్ళాలి" అన్నాడు.

"నీకేమన్నా మతిపోయిందా? బయటకు చూడు" అన్నాడు రాజారావు.



నిజమే... ఇందాకటి జల్లులు పోయి భారీవర్షం పడుతోంది.

"కుంభవృష్టి కురుస్తోంది. ఎట్లా వెళతావు? "

"ఫర్వాలేదు. వెళ్ళగలను"

"ఈ వర్షం ఇవాళ ఆగదు. ఇట్లాగే పడుతుంటుంది. ఇంకాస్త పెద్దదవుతుంది. పూర్తిగా తడుస్తావు. ఆ తర్వాత జలుబు, తలనొప్పి, జ్వరం. ఎందుకురా హాయిగా ఈ రోజుకి ఇంట్లో ఉండిపో" అంది తల్లి మెల్లగా.

"స్కూలు పిల్లలు కూడా వెళ్తున్నారు" అన్నాడు విజయ్.

"వెళ్ళకపోతే వాళ్ళని టీచర్లు కొడతారు. నువ్వు వెళ్ళకపోతే ఎవరూ ఏమీ అనరు. అసలు ఇంత వర్షంలో మీ క్లాసులు జరుగుతాయా? క్యాన్సిల్ చేస్తారుగానీ" అన్నాడు తండ్రి.

"వర్షం పడుతున్నా అంతా వస్తారు" అన్నాడు విజయ్. ఎట్లాగైనా వెళ్ళాలి, వెళ్ళి తీరాలన్న పట్టుదలలో ఉన్నాడు. అతనికి మూసీనది మీద నిర్మించిన పురానాపూల్ కథ గుర్తుకొచ్చింది. తన ప్రేయసి భాగమతికోసం వరదతో ఉప్పొంగుతున్న మూసీ నది దాటిన కులీకుతుబ్‌షా గుర్తుకొచ్చాడు.

ప్రేమ ఎంత గొప్పది. చిరస్థాయిగా నిలిపే శక్తి ప్రేమకి మాత్రమే ఉందేమో. లేకపోతే ఎంతమంది రాజులో గోల్కొండను పాలించారు గదా. వాళ్ళలో ప్రజలకు ఎవరు జ్ఞాపకం ఉన్నారు? ప్రేమమూర్తి కాబట్టి కులీకుతుబ్‌షా ప్రజల మనసులో నిల్చిపోయాడు.

విజయ్ పెదవులపై నవ్వు విరిసింది.

ప్రేమ... అంతటి బంధనాలు తెంచుకుని ఉరుములు, మెరుపుల వానలో మూసీనది వైపు పరుగెత్తేట్లు చేసిన ప్రేమ... వరదనెదిర్చే శక్తి ఇచ్చిన ప్రేమ... తనకి ఈ మామూలు వర్షంలో తడుస్తూ యూనివర్సిటీకి వెళ్ళే బలం ఇవ్వదా ఏమిటి?

జలుబూ, జ్వరం ఎందుకొస్తాయి. వస్తే రానీ... ఏమన్నా కానీ తనుమాత్రం రోజూ అమూల్యని చూడాల్సిందే.

అతను ముందుకి కదిలాడు.

రోడ్లంతా జలమయం. పైనుంచి వాన చినుకులు టప్పుటప్పున వచ్చి మొహాన గుచ్చుకుంటున్నట్లు కొట్టుకుంటున్నాయి. కళ్ళమీదికి నీళ్ళు జారి మసకలు కమ్ముతున్నాయి.

విజయ్ ఇవేం గమనించలేదు. తదేక దీక్షతో నడుస్తూ, బస్‌స్టాప్‌చేరి, నిరీక్షించి బస్ ఎక్కాడు.

కుండపోతవర్షం ఇంకా కురుస్తూనే ఉండగా విజయ్ యూనివర్శిటీకి చేరాడు. క్లాస్‌రూమ్‌వైపు నడిచాడు. ఓ ముగ్గురు తప్ప ఎవరూ రాలేదు. వాళ్ళలో ఇద్దరు లవర్స్.

తన ఇంత శ్రమా వృథాయేనా అని భయంవేసిందతనికి. అమూల్య రాలేదు. అతని గుండె నీరుకారిపోయింది. నీరసంగా కూలబడ్డాడు. భరించరాని నిరాశ. నిర్జీవంగా కళ్ళుమూసుకుని ఉండిపోయాడు.

అతనిలో జీవాన్ని తిరిగిపోస్తూ... ఆమె నవ్వు. అతను ఒక్కసారిగా కళ్ళు తెరిచాడు.

ఎదురుగా అమూల్య సౌందర్యదేవతలా, జడలో జాజులమాల, లేత నీలిరంగుచీర, జాకెట్టు. ఎందుకోగానీ నవ్వుతోంది.

"వచ్చారా. రారనుకున్నాను" అన్నాడు.

అమూల్య నవ్వేసింది.

"నేనూ అట్లాగే అనుకున్నాను. మనమిద్దరం... వాళ్ళు ముగ్గురూ తప్ప ఇంకెవరూ రాలేదు చూశారా" అన్నది.

"అవును, క్లాస్ కాన్సిల్ చేస్తారేమో" అన్నాడు అట్లా జరిగితే బాగుండునని మనసులో కోరుకుంటూ.

ఆ క్లాసు కాన్సిల్ అయితే ఆ సమయంలో ఆమెతో మాట్లాడవచ్చని అతని ఆశ.

ఇంతలో ప్రొఫెసర్ హడావిడిగా క్లాస్‌లోకి ప్రవేశించాడు.





# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: **3000/–** పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

జూన్ చతుర నవల ధైర్యం

..............................................................

సమీక్షకుని పేరు : ..............................................................

చిరునామా : ..............................................................

..............................................................

..............................................................

..............................................................

"వెరీగుడ్" అని వాళ్ళ ఆసక్తిని మెచ్చుకుని క్లాసు తీసుకున్నాడు.

★ ★ ★

కాలేజీలో క్లాస్‌రూమ్ ముందు నిల్చుని అమూల్యకోసం ఒళ్ళంతా కళ్ళుచేసుకుని ఎదురు చూస్తున్నాడు విజయ్.

అతను ఆమెతో ఎంత అనుబంధం ఏర్ప రచుకున్నాడంటే ఆమె రాకని సుదూరం నుంచే గమనించగలిగేంత... కళ్ళు మూసు కుని కూడా ఆమెని చూడగలిగేంత... నోరు విప్పకుండా, ఒక్కమాట మాట్లాడకుండా గంటల తరబడి సంభాషణ జరపగలి గేంత...

కళ్ళన్నీ విప్పార్చుకుని అతను ఆమెకోసం ఎదురు చూస్తున్నాడనేది నిజమేగానీ, చూడ కపోయినా కూడా ఆమె రాకని గుర్తించగ లడు.

ఆమె వచ్చిందని అతనికి తెలిసిపోతుంది.

తను, ఆమె వేరు కాదని అతనికి అనిపి స్తోంది.

తన ఉనికిని తను గుర్తుంచుకోని మనిషి ఉండడు. ఆ విధంగానే తన ప్రేయసి రాకనే గుర్తించలేని ప్రేమికుడూ ఉండ డేమో.

తనూ... ఆమె వేరుకాదు, ఒకటి. ఒకటి.

"కానీ మీ కులాలు వేరు" అని అతని అంతరాత్మ మూలిగింది.

అతను ఒక్కక్షణం చిన్నబోయాడు.

మరుక్షణం అంతరాత్మకి బుద్ధిచెప్పాడు.

"అయితేనేం, ప్రేమకి కులం, మతం లేదు. ప్రేమికులందరిదీ ఒకేకులం. ఒకే మతం"

క్లాస్‌కు టైమ్ అవుతోంది.

అమూల్య జాడలేదు.

అతని అవస్థ వర్ణనాతీతం... కేవలం ప్రేమించే హృదయాలకే అది అవగతం.

ఆమె ఏ డ్రెస్సు వేసుకుని వస్తుంది...? ఏరంగు? అని ఆలోచిస్తాడు. ఆమెని చూస్తుంటే ఎప్పటికప్పుడు కొత్తగా ఉంటుంది.

ఆమె వస్తుందా రాదా అని ఊపిరి బిగ పట్టి చూస్తుంటే దూరంగా ఆమె కారు దిగి రావటం కనపడింది.

అతని గుండె దడదడా కొట్టుకుంది. ఆమెతో మాట్లాడే ప్రతిసారీ టెన్షన్. ఊపిరి ఆడనంత టెన్షన్...

తన క్రాఫ్, బట్టలు అన్నీ ఒకసారి సవరిం చుకుని అ టెన్షన్‌లో నిలబడ్డాడు.

ఇంతలో లెక్చరర్ రావడం... స్టూడెంట్స్ అంతా పొలోమని లోపలకు వెళ్ళడం, అమూల్య రాక గమనించి విమలా, రమా మాత్రం ఉండిపోయి ఆమె రాగానే అంతా కలిసి నవ్వుకుంటూ లోపలకు వెళ్ళడం జరి గిపోయాయి.

అతనికి వాళ్ళని చూస్తే చచ్చేంత కోపం వచ్చింది. తనకూ, అమూల్యకూ మధ్య ఇను ప తెరలా వాళ్ళు ఎవరు? అసలు వాళ్ళెం దుకు ఆగి ఆమెతోపాటు వెళ్ళాలి.

అంతలోనే అతనికి నవ్వు వచ్చింది.

తను ఇలా ఆలోచిస్తున్నాడేంటి? ఎవరి ఫ్రెండ్సు వాళ్ళతో వెళ్ళక ఏం చేస్తారు. తను ఆమెని ప్రేమిస్తున్నాడనీ, ఆమెతో మాట్లాడా లని తపించిపోతున్నాడనీ వాళ్ళకేం తెలు స్తుంది పాపం.

★ ★ ★

అమూల్య సంగతి విజయ్‌కి అంతుబట్ట డంలేదు. తనని చూడగానే ఆమె కళ్ళల్లో వెలిగే కాంతీ, పెదవులమీద విరిసే నవ్వులూ అతను గమనిస్తూనే వున్నాడు. కానీ ఆమె తనని ప్రేమిస్తోందా? లేదా?

ఎన్నాళ్ళు ఈ మాటలు?

ఎప్పుడు తన మనసులోని మాట ఆమెకి చెప్పాలి?

ఎలా చెప్పాలి?

ఎన్నాళ్ళీ సస్పెన్స్?

కానీ ఏం చెయ్యాలి? ఏం తోచలేదు.

ఈ నిరీక్షణ, ఈ సస్పెన్స్ అతనికి దుర్భ రంగా వుంది.



ఏదో ఒకటి చెయ్యాలి. తన మనసులో ప్రేమ అమూల్యకి వెల్లడించెయ్యాలి అని గట్టిగా నిర్ణయించుకున్నాడు.

అప్పట్నుంచీ విజయ్‌కి పట్టుకున్న బాధని వర్ణించడం ఎవరివల్లాకాదు.

భయం, ఆదుర్దా, ఆందోళన, ఒత్తిడి... ఎలా తెలియచెప్పాలి? తన ప్రేమని ఎలా వెల్లడించాలి?

వెల్లడిస్తే ఏం జరుగుతుంది? వ్యతిరేకంగా జవాబు వస్తే తట్టుకునేశక్తి తనకి ఉందా?

అది అప్పుడు అతని జీవితంలోకెల్లా పెద్ద సమస్య, అతి క్లిష్టమైన సమస్య.

రేపే అడిగేయాలి, అని నిశ్చయించుకున్నాడు. ఏమేం చెయ్యాలి, ఎలా అడగాలి, రిహార్సల్ వేసుకున్నాడు.

మర్నాడు చక్కగా తయారయ్యాడు.

తెల్లకాగితం తీసి దానిమీద అందమైన అక్షరాలతో 'ఐ లవ్ యూ' అని రాశాడు.

దాన్ని జాగ్రత్తగా మడిచి, జేబులో పెట్టుకున్నాడు. లైబ్రరీ దగ్గర కాస్త ఎడంగా నిలబడ్డాడు.

కాసేపయాక అతని నిరీక్షణ ఫలించింది.

అమూల్య బయటకు వచ్చింది. వెంట ఎవరూలేరు.

వెంటనే అతను అమూల్యా దగ్గరకు వెళ్ళాడు.

"హలో" అమూల్యా నవ్వుతూ పలకరించింది.

"హలో" అని జేబులోంచి కాగితాన్ని బాంబు తీసినంత భయంగా తీశాడు.

"ఏమిటది?" అమూల్యా ఆశ్చర్యంగా చూసింది.

"మీకో విషయం చెప్పాలి"

"చెప్పండి"

"ఇదుగో ఇందులో రాశాను. ప్లీజ్... మరోలా అనుకుని అపార్థం చేసుకోవద్దు. నా మనసులో భావం ఈ కాగితంలో ఉంది. మీకు ఇష్టమైతే సరే... లేకపోతే ప్లీజ్... నాతో మాట్లాడడం మాత్రం మానేయకండి. మీరు నాతో మాట్లాడడం మానేస్తే నేను భరించలేను. ప్లీజ్..." ఎలాగో గడగడా చెప్పేశాడు.

అమూల్యా ఆశ్చర్యపోతూ చూసింది.

"అసలు ఏముంది ఇందులో?" తెరవబోయింది.

"ప్లీజ్... నా ముందు తెరవకండి. మీ రిప్లైకోసం ఎదురుచూస్తుంటాను"

మీకిష్టమైతే అదుగో అక్కడ గుల్‌మొహర్ చెట్టుకింద నిల్చోండి. పావుగంట అయ్యాక నేనక్కడికి వస్తాను" అన్నాడు.

అమూల్యా తల ఊపింది.

విజయ్ వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

పావుగంట సమయం నరకంలా గడిపాడు. పావుగంట గడిచి...

అతను గుల్‌మొహర్ చెట్టుదగ్గరకు వెళ్ళే సరికి... అమూల్యా అక్కడ నిలబడి ఉంది.

విజయ్‌కి ఆనందంతో ఊపిరాడలేదు.

ఎగిరి గంతు వెయ్యాలనిపించింది.

పరుగులు తియ్యాలనిపించింది. అమూల్యా చెయ్యి పట్టుకుని ఎక్కడో దూరతీరాలకి పారిపోవాలనిపించింది.

అతను అన్నీ మరిచిపోయి, అది యూనివర్శిటీ అని కూడా మరిచిపోయి ఆమె దగ్గరకు వెళ్ళాడు.

ఎన్నెన్నో అనుకున్నాడు... ఏమేమో మాట్లాడాలనుకున్నాడుగానీ, ఆమె ఎదురుగా నిల్చోగానే ఆ గుండెలోని కబుర్లన్నీ ఎటు పలాయనం చిత్తగించాయో కానీ విజయ్ మూగవాడై నిల్చున్నాడు.

మౌనంగా ఆమెముందు నిలబడ్డాడు. అతనికి సిగ్గుగా ఉంది. ఏదన్నా చెప్పాలని ఎంతో ప్రయత్నించాడు. ఊహూ. కుదరలేదు.

గొంతు పెగలక... నోరు తిరగక... భాష అందక... భావం వ్యక్తపరచే మార్గం దొరకక తబ్బిబ్బయ్యాడు.

అతని అవస్థ చూసి ఆమె నవ్వుతోంది.




ఆమె చెక్కిళ్ళు కూడా కంది ఎర్రబడ్డాయి. ఏం మాట్లాడాలా అని ఆమె తటపటాయిస్తుంటే, ఇంతలో అతను వచ్చి ఆడపిల్లలా సిగ్గుపడటం చూసి, ఆమెకి నవ్వు వచ్చేసింది.

లాభంలేదు ఏదో మాట్లాడాలి, అని గొంతు సవరించుకున్నాడు.

"అమూల్యా..." అన్నాడు.

"ఊ..."

"నువ్వు నన్ను ప్రేమిస్తావని ఊహించలేదు" అన్నాడు.

"ఎందుకు ఊహించలేదు విజయ్. నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను... నా ప్రేమని గుర్తించలేకపోయావా? "

"నిజంగానా. నాకు తెలీదు. నేను ఇన్నాళ్ళూ నీ మనసు తెలియక, నా మనసు తెలియబరచలేక క్షణమొక యుగంలా, ఎంతో టెన్షన్‌తో దుర్భరంగా గడిపాను. చివరికి ఎలాగో సాహసంచేసి నా ప్రేమని వ్యక్తంచేశాను"

ఆ తర్వాత మౌనం... ఇద్దరూ ఒకళ్ళ కళ్ళలోకి ఒకళ్ళు చూసుకుంటూ ఉండిపోయారు. ఏమీ మాట్లాడుకోలేదు.

మౌనమే వాళ్ళ సంభాషణ.

ఆ మౌనంతోనే భావాలు వ్యక్తమయి, ఒకరి మనసులో మాటలు మరొకరు గ్రహించుకున్నారు.

★ ★ ★

తన ప్రేమ సంగతి ఇంట్లో చెప్పింది అమూల్య.

వాళ్ళు సంతోషంగా ఒప్పుకున్నారు.

"మా నాన్నగారు నాకోసం చాలా త్యాగం చేశారు. నేను పుట్టగానే మా అమ్మ చనిపోతే, చాలామంది ఆయన్ని మళ్ళీ పెళ్ళిచేసుకోమని బలవంతపెట్టారు. ఆయన వినలేదు. నాకోసం అంత చిన్న వయసునుంచీ తోడులేని జీవితం గడుపుతున్నారు. నాకు అన్నింటిలో సలహాలిస్తారు. మేమిద్దరం హరికథలు, పౌరాణిక ప్రసంగాలకూ కలిసి వెళ్ళొస్తుంటాం. ఒకవేళ గనక ఆయన మన పెళ్ళికి ఇష్టపడకపోయి ఉంటే, ఎదిరించి చేసుకోవటం నేను ఊహించలేను. ఆయన మన పెళ్ళికి ఒప్పుకోవటం నాకు సంతోషంగా ఉంది" చెప్పింది అమూల్య.

అమూల్యా, విజయ్ ఆదివారాలు, శలవు దినాల్లో పార్కుకో ఇంకెక్కడికైనానో కలిసి వెళ్ళి కాసేపు గడపటం మామూలైపోయింది. రోజులు ఎలా గడిచిపోతున్నాయో కూడా తెలియనంత హాయిగా, తొందరగా దొర్లిపోతున్నాయి.



"నువ్వెవరో అమ్మాయితో కన్పిస్తున్నావట ఈమధ్య? " రాజారావు సాధ్యమైనంత మృదువుగా అడగటానికి ప్రయత్నం చేస్తూ అన్నాడు.

ఈ ప్రసక్తి ఎప్పుడో రాక తప్పదని విజయ్‌కి తెలుసు. ఈ విషయం దాచాలని అతనికి లేదు. ఎలా చెప్పాలో తెలియక ఇన్నాళ్ళూ ఊరుకున్నాడు, అంతే.

"నాన్నగారూ... ఆ అమ్మాయి నా క్లాస్‌మెట్. నేను ఆమెని ప్రేమిస్తున్నాను. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను" గబగబా చెప్పేశాడు.

రాజారావు మౌనంగా ఉండిపోయాడు. విజయ్ ఇలా చేస్తాడని గానీ అసలు అమ్మాయిలతో మాట్లాడే ధైర్యం విజయ్‌కి ఉందని గానీ రాజారావు ఊహించనేలేదు.

"ఆ అమ్మాయి ఎవరు? ఎవరిపిల్ల? వివరాలేంటి? " మెల్లగా అడిగాడు.

"ఆ అమ్మాయి పేరు అమూల్య. నాతో పాటే ఎమ్మెస్సీ చదువుతోంది. వాళ్ళకి బిజినెస్ ఉంది. బ్రహ్మణులు" అని వివరాలన్నీ చెప్పాడు.

అమూల్యది వేరే కులం అని తెలిస్తే తండ్రి ఎక్కడ విరుచుకుపడతాడోనని విజయ్ భయపడ్డాడుగానీ అతని ఊహ తప్పయింది. వివరాలన్నీ విని రాజారావు సంతోషించినట్లే అనిపించాడు.

అది చూసి విజయ్ మనసు తేలికపడింది.

"మరి మాకెప్పుడు చూపిస్తావు ఆ అమ్మాయిని? " అడిగాడు రాజారావు.

"ఒకరోజు మనింటికి తీసుకువచ్చి అందర్నీ పరిచయం చేయాలనుకుంటున్నాను"

"ఏ రోజు? ఈ ఆదివారం వీలవుతుందా? "

"బహుశా వీలవుతుంది. అడిగి సాయంత్రానికి చెప్తాను"

"అలాగే" అన్నాడు రాజారావు.

విజయ్ పుస్తకం తెరిచి చదువుకుంటుంటే, రాజారావు వంటగదిలోకి వెళ్ళాడు. రంగమ్మకి అంతా చెప్పాడు.

"మన విజయ్ తన భార్యని సెలక్ట్‌చేసుకుని మనకి పిల్లని వెతికే శ్రమ తప్పించాడు. అమ్మాయి చాలా బాగుంటుందిట" అన్నాడు.

"చూడకుండా ఎలా చెప్పగలిగారు? "

"చూడక్ఖర్లేదు. మనవాడు ఆ అమ్మాయితో షికార్లు కొడ్తున్నాడని నా చెవిన వేసినవాళ్ళే ఆ అమ్మాయి అద్భుతంగా ఉంటుందని కూడా చెప్పారు. అందరూ ఒకేలా చెప్పారు కాబట్టి నిజమే అయుండాలి"

రంగమ్మ మొహంలోకి చూశాడు రాజారావు. సంతోషఛాయలేవీ కనిపించలేదు.

"నీకు సంతోషంగా లేదా? " రాజారావు అడిగాడు.

"లేదు. నిజానికి భయంగా ఉంది. పూర్తిగా విభిన్నమైన వాతావరణంలోని పిల్ల. తిండి దగ్గర్నుంచి అన్నీ తేడాలే. మనతో కలసిపోతుందా? ఏమో బాబూ. నాకైతే భయంగానే ఉంది" అంది రంగమ్మ.

"అనవసరంగా భయపడకు. మనతో కలసిపోకపోతే విడిగా ఉంటారు. అంతేగా. వాళ్ళిద్దరూ సుఖంగా ఉంటే చాలదూ? " అన్నాడు రాజారావు.

"అదీ నిజమే" అంది రంగమ్మ.

అమూల్య ఆదివారం పదకొండు గంటలకి వస్తుందని చెప్పాడు విజయ్.

ఇల్లంతా శుభ్రంగా దులిపి, సామానంతా నీట్‌గా సర్దారు. ఫ్లవర్‌వేజ్‌లో పువ్వులు... అలమారులో బొమ్మలు అన్నీ సర్దారు. దిండు గలీబులు, దుప్పట్లు, సోఫా కవర్లు మార్చారు. శిరీషా, లలితా వంటలో రంగమ్మకి సాయంచేశారు. అమూల్యని భోజనానికి పిలిచాడు విజయ్.

పదకొండు గంటలకల్లా అంతా ఎదురు చూస్తుండగా అమూల్య కారు వచ్చి ఆగింది.

కారు తలుపు తెరుస్తుండగా అంతా అటే చూశారు. విజయ్ సెలెక్షన్ చూడాలని అందరికీ ఆతృతగా ఉంది.

అమూల్య కారు దిగింది.

ఆకుపచ్చ సిల్కు చీరె, అదేరంగు జాకెట్టు, జరీ పనితో మెరుస్తున్నాయి. వజ్రాలు పొదిగిన లోలాకులు దానికి మాచింగ్ లాకెట్ గొలుసు, చేతులకి నిండుగా బంగారు గాజులు... సూర్యకాంతిపడి కళ్ళు మిరుమిట్లు గొలిపినట్లయింది.

అమూల్య అంత అందంగా ఉంటుందని వాళ్ళు ఊహించలేదు. కాసేపు మౌనంగా చూస్తూ ఉండిపోయారు.





అమూల్య చేతులు జోడించి రాజారావుకీ, రంగమ్మకీ నమస్కరించింది.

"రామ్మా...రా" రంగమ్మ అప్పుడు షాక్ లోంచి తేరుకుని, లోపలకు ఆహ్వానించింది.

శిరీషా, లలితా విజయ్‌ని కళ్ళతోనే అభినందించారు. రంగమ్మ అమూల్యని సోఫాలో కూర్చోబెట్టింది.

"మంచినీళ్ళు కావాలామ్మా... పోనీ మజ్జిగగానీ... ఫ్రూట్ జ్యూస్‌గానీ తేనా? " అడిగింది.

"వద్దండీ. ఇంట్లోంచి ఇప్పుడే వచ్చాను" అంది అమూల్య.

రంగమ్మ అమూల్యని కళ్ళప్పగించి చూడకుండా ఉండలేకపోతోంది.

లలిత తన సహజధోరణిలో మాట్లాడుతోంది.

"ఈ జూకాలూ, లాకెట్ గొలుసూ చాలా బాగున్నాయి. ఎక్కడ కొన్నావు? "

"బజ్‌రంగ్ జూయలర్స్‌లో"

"చాలా బాగున్నాయి. ఎంత ఖరీదు"

"గుర్తులేదు"

"ఈ చీరె ఎంతయింది"

"మా వదిన కొంది "

రంగమ్మకి లలిత ఎంతసేపూ నగల గురించీ చీరెలగురించీ అడిగితే తాము అమూల్యకి చులకనైపోతామేమోననిపించింది. కళ్ళతోనే లలితకి సైగచేసింది. లలిత అది ఏమాత్రం పట్టించుకోకుండా తను వేసే ప్రశ్నలు వేస్తూనే ఉంది.

శిరీషా, లలితా, అమూల్యా అంతా స్నేహితులైపోయి ఏదో మాట్లాడేసుకుంటున్నారు.

"మీ నాన్నగారేం చేస్తుంటారు? " తెలిసినా, ఏదో ఒకటి అడగాలని అడిగింది రంగమ్మ.

అమూల్య చెప్పింది.

రంగమ్మ మిగతా ప్రశ్నలు కూడా అడిగింది. ఎందరు అక్కచెల్లెళ్ళు... అన్నదమ్ములు... వాళ్ళేం చేస్తున్నారు... అలా మాట్లాడుతూ అమూల్య స్వభావాన్ని అంచనా వెయ్యగలిగింది రంగమ్మ.

'ఫర్వాలేదు మంచి పిల్లే. విధేయంగానే ఉండేట్లు ఉంది. కళ్ళు చెదిరిపోయే అందం... చదువూ, సంస్కారం, అన్నీ ఉన్న పిల్ల లభిస్తోంది. విజయ్ అదృష్టం' అనుకుంది మనసులో.

అమూల్యని వదలబుద్ధికాలేదు ఆవిడకి. ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉంది.

"మరి మేము మాంసాహారులం. నీకు కష్టంగా ఉండదూ? " అంది మాటల్లో.

"మా ఫ్రెండ్స్ తింటూనే ఉంటారు"

"అయితే మేం తింటే నీకేం ఫర్వాలేదుగా? "

"అంతే మరి. నాకోసం మీ అలవాట్లను ఎందుకు మార్చుకోవటం? "

"అయితే సగం బాధ వదిలినట్లే. మా అక్క కోడలు బ్రాహ్మణులు కాదుగానీ ఆవిడా శాకాహారే. శాకాహారం తప్ప తినరుట. అబ్బో ఒకటే పీడిస్తుంది. ఆఖరికి వెజిటేరియన్ వంటకి కూడా బోలెడు వంకలు పెడుతుంది. మసాలాలూ వెల్లుల్లీ తినదు. దాని బాధ పడలేక వేరే కాపరం పెట్టించారు. అయినా కానీ అత్తగారింటికి వచ్చిన ఒక్క రోజయినా సరిగ్గా ఉండదు. ఏదేదో అంటూనే ఉంటుంది" అంది రంగమ్మ.

"నేను కూడా మసాలాలూ అవీ తినలేను. కానీ అలవాటు చేసుకుంటాను ఇకమీద" అంది అమూల్య.

"తిండి దగ్గరే సమస్య. రోజూ ఉండేదీ, ప్రతివాడికీ కావల్సిందీ, అది లేనిదే జరగనిదీ తిండే. అక్కడ అడ్జస్టు అయితే అన్నిటా అయినట్లే" అంది రంగమ్మ.

ఇంతలో విజయ్ కలిగించుకున్నాడు.

"అమ్మా. అమూల్య చాలా సర్దుకుపోయే మనిషి. అసలు మనకి తనే నాన్‌వెజ్ వండటం నేర్చుకుని చేసి పెడతానన్నది కూడా"

"ఓహో. అయితే ఇకనేం. అమ్మా, నువ్వు

కోడలి చేతి వంట తింటూ హాయిగా గడిపే యోచ్చు" లలిత హాస్యంగా అంది.

అంతా నవ్వారు.

మధ్యాహ్నం భోజనం సమయమయింది.

టేబుల్ మీద వడ్డించారు. బిర్యానీ, పెరు గుపచ్చడి, ఆలుగడ్డ కుర్మా, అన్నం, బెండ కాయ కూర, సాంబారు.

"అమ్మో... చాలా చేశారు?" అంది అమూల్య.

"మరి ముగ్గురు ఆడవాళ్ళం ఉండి ఆమాత్రం చేయకపోతే ఎలా?" శిరీష నవ్వింది.

"నీకు బిర్యానీ వండటం వచ్చా?" లలిత అడిగింది అమూల్యని.

"వచ్చు" అంది అమూల్య.

"మటన్ బిర్యానీ కూడా అంతే. ఎటొచ్చీ బంగాళాదుంపలకి బదులు మటన్ ముక్కలు అంతే. చికెన్ కూరలు కూడా కష్టమేంకాదు. ఒక వంట వస్తే మరోటి నేర్చుకోవటం తేలికే" అంది రంగమ్మ, కావాలని మాంసాహార ప్రసక్తి తెస్తూ. కొందరు మాంసాహార ప్రసక్తి శాకాహారులవద్ద తెస్తే, అదోలా మొహం పెట్టుకుంటారు. ఆ ప్రసక్తే గిట్టదు వాళ్ళకి. అమూల్య కూడా అట్లాంటి కోవకి చెందుతుందేమో అని పరీక్షించటానికి రంగమ్మ అలా చేసింది.

అమూల్య చలించినట్లు కనిపించలేదు. ముక్కు చిట్లించటం లాంటి హావభావాలేవీ ప్రదర్శించలేదు.

"అలాగా" అంది.

అప్పటికి రంగమ్మకి అమూల్య కాస్త లిబరల్‌గా ఉండే మనిషేననీ, అబ్బాయికి కావల్సినవి వండిపెడ్తుందనీ రూఢి అయింది.

తమని ముసలికాలంలో చూసుకోవలసింది ఈ కోడలు పిల్లేనని గుర్తుతెచ్చుకోవడంతో అమూల్యమీద ఎక్కడలేని ప్రేమా పొంగిపొర్లింది.

"అది వేసుకో. ఇది తిను. అది మంచిది. చూడు ఎంత సన్నగా ఉన్నావో. బలంగా ఉండేందుకు మంచి తిండి తినాలి. తిను, తిను" అని రకరకాలూ కొసరికొసరి తినిపించింది.

ఆమె ఆప్యాయతకి అమూల్య కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. 'తల్లిలేని పిల్ల కదూ. పాపం ఆప్యాయంగా తినిపించే దిక్కే ఉండి ఉండదు' అనుకుని రంగమ్మ కూడా బాధపడింది.

భోజనం ముగిశాక సోఫాలో తన పక్కన కూర్చోబెట్టుకుంది.

"మీ అమ్మ నీకు ఎంత వయసులో పోయింది"

"పుట్టిన కొద్దిరోజులకే" అమూల్య జవాబు చెప్పింది.

"పాపం..."

అమూల్య సమాధానం చెప్పలేదు కానీ, బాధపడ్తోందని మాత్రం తెలిసిపోతోంది.

"బాధ పడకు. నేను నీకు అత్తను కాను, అమ్మనే అనుకో" అంది రంగమ్మ ఆప్యాయంగా.

"వద్దులే అమ్మా. నువ్వు అత్తగానే ఉండు. అమూల్యా నీకు తెలీదు అమ్మ నన్ను ఎంత సతాయిస్తుందో? ఆ డ్రెస్సు మరీ మోడర్న్‌గా ఉందంటుంది. ఈ చీరె చాలా పల్చగా ఉందంటుంది. ఈ మేకప్ గాడీగా ఉందంటుంది. నాకు నచ్చిన సినిమాలకు వెళ్ళనివ్వదు. అన్నిటికీ వంకలే. అదే అత్త అయితేనా, కోడలంటే కాస్త భయమన్నా ఉంటుంది" అంది లలిత విరగబడి నవ్వుతూ.

"చాల్లే. అమూల్య చూడు ఎంత పొందిగ్గా ఉందో. కట్టూబొట్టూ ఎంత హుందాగా ఉందో చూడు. నువ్వు చక్కగా తయారవుతే నేనెందుకు వంకలు పెడతాను? అల్లరిచిల్లరిగా వేషాలు వేస్తే తిడతానుగానీ, నా పిల్లలు అందంగా తయారవ్వాలని నాకు ఉండదా?" అంది రంగమ్మ.

మాటల్లో పడి సమయం తెలియలేదు. అమూల్య వాచీ చూసుకుంది.





"అమ్మో. నాలుగయింది. ఇంక వెళ్ళాలి" అంది.

"ఇంటికి వెళ్ళి ఏం చేస్తావు? కూర్చో" అంది రంగమ్మ. ఆమెకి అమూల్యని వదిలి పెట్టాలని లేదు. వీలైనంత తొందరలో పెళ్ళి జరిపించి అమూల్యని ఇంట్లోనే ఉంచేసుకుం దామనిపించింది.

"నాన్నగారు ఎక్కడికో వెళ్ళాలన్నారు" అంది అమూల్య.

"అవునూ విజయ్! అమూల్య నాన్నగారిని ఒకసారి ఇంటికి ఆహ్వానించరాదూ? అమూల్యా! మీ ఫామిలీ అంతా రావాలి మా ఇంటికి"

"తప్పకుండా ఆంటీ. మీరు కూడా అందరూ మా ఇంటికి రావాలి. మానాన్న గారు తను వచ్చి అందర్నీ పరిచయం చేసు కుని ఆహ్వానిస్తానన్నారు" అమూల్య లేచి నిలబడుతూ చెప్పింది.

కారు గుమ్మంముందుకు వచ్చింది.

రంగమ్మ లోపలకు వెళ్ళి ఒక ట్రేలో చీర, జాకెట్టు, పూలు, పళ్ళు తీసుకుని వచ్చింది.

"ఎందుకు ఆంటీ ఇవన్నీ..." అమూల్య మొహమాటపడింది.

"మొదటిసారి మా ఇంటికి వచ్చావు. ఈ మాత్రం కానుక ఇవ్వాల్సిందే" అంది రంగమ్మ ప్రేమగా.

అమూల్యకి బొట్టుపెట్టి అన్నీ అందిం చింది.

అందరూ అమూల్యకి వీడ్కోలు చెప్పటా నికి బయటకు వచ్చారు.

అమూల్య కారుదాకా వెళ్ళింది. అందరి దగ్గరా శలవు తీసుకుని కారు ఎక్కింది.

కారు కదిలింది. అంతా లోపలకు వెళ్ళారు. రంగమ్మ మాత్రం కాంపౌండ్‌లో చెట్లని పరీక్షిస్తూ, అక్కడే నిలబడింది.

ఇంతలో పొరుగింటావిడ గోడ దగ్గరకు వచ్చింది. ఆవిడ మహా గర్విష్టి. ఎప్పుడూ తనంతటతాను పలకరించదు.

"ఏంటి రంగమ్మగారూ? ఎవరూ వచ్చింది? " అడిగింది.

"మా విజయ్ క్లాస్‌మేట్"

"ఎందుకొచ్చింది"

"భోజనానికి పిలిచాం"

"అదే. ఏం సందర్భం" ఆసక్తిగా చూస్తూ అడిగిందావిడ.

"సందర్భం ఏంలేదు. ఊరికే పరిచయం చేసుకుందామని పిలిచాం"

"ఎందుకూ పరిచయం చేసుకోవటం"

రంగమ్మకి ఆవిడ ఆసక్తిచూస్తే సరదాగా ఉంది. అందుకే సస్పెన్స్‌లో పెడ్తూ మౌనంగా ఉంది కాస్సేపు.

"విజయ్‌కి సిగ్గూ, బిడియం జాస్తి కదా. ఆడపిల్లలతో మాట్లాడడు... మరి ఈ అమ్మాయిని ఏకంగా భోజనానికే పిలిచా డంటే ఏదో ప్రత్యేకత ఉండిఉండాలే? " ఆవిడ అదోలా చూస్తూ అడిగింది.

రంగమ్మ సస్పెన్స్‌ని పొడిగించింది తన మౌనంతో.

"ఏమన్నా ప్రేమ వ్యవహారమా? " ఆవిడ సస్పెన్స్‌ని భరించలేక మళ్ళీ ప్రశ్నించింది పొరుగింటామె.

"అలాంటిదే! విజయ్ ఆమెని పెళ్ళి చేసు కుంటున్నాడు. మాకు పరిచయం చేయటా నికనే ఈరోజు ఆమెని ఆహ్వానించాడు" అంది రంగమ్మ.

పక్కింటావిడ నిర్ఘాంతపోయింది. ఆ షాక్‌లోంచి బయటపడటానికి ఆవిడకి అయిదు నిమిషాలు పట్టింది.

"అలాగా... కులాలూ అవీ సరిపో యాయా? వాళ్ళ నాన్నేం చేస్తుంటాడు? "

రంగమ్మ అమూల్య వివరాలన్నీ ఆవిడకి చెప్పింది. వింటున్నంతసేపూ పక్కింటావిడ మొహంలో కత్తివాటుకి నెత్తురు చుక్కలేదు. పూర్తిగా విన్నాక ఆవిడ మొహంలో అసూయ, ద్వేషం, కోపం, అసహనం ప్రతిఫ లించాయి.

"రంగమ్మా. నువ్వేమన్నా అనుకో. కానీ నేను చెప్పకుండా ఉండలేను. విజయ్‌కి ఇది

తగ్గ సంబంధం అని అనిపించటం లేదు"

"ఎందుకనీ?" రంగమ్మ తన కోపాన్ని దాచుకునే ప్రయత్నం చెయ్యకుండా, కరుగ్గా అడిగింది.

"రంగమ్మా చూశావుగా. ఆ పిల్ల బోలె డంత అందంగా సినిమాస్టార్లా ఉంది. అంతస్థా మీకంటే చాలా ఎక్కువ. కులమా ఒకటి కాదు. మిమ్మల్ని లెఖ్కచెయ్యకుండా ప్రవర్తిస్తుందేమో? జాగ్రత్తగా ఆలోచించు" పక్కింటావిడ సలహా ఇస్తున్నట్లుగా మాట్లా డినా, స్వరంలో అసూయ స్పష్టంగా వ్యక్తమై పోతూనే ఉంది.

"ఆ అమ్మాయి మాతో బాగా కలిసిపో యింది. మాకు బాగా నచ్చింది" అంది రంగమ్మ స్థిరంగా చూస్తూ.

"వస్తాను" పొరుగింటావిడ ఈ విషయం ఎవరో ఒకరికి చెప్పి తీరాలన్నట్లు ఎదురిం ట్లోకి నడిచింది.

★ ★ ★

విజయ్ అమూల్య ఇంటికి వెళ్ళి వాళ్ళతో మాట్లాడటం, అమూల్య విజయ్ ఇంటికి రావటం, వీలైనప్పుడల్లా జరుగుతూనే ఉండేది. ఇద్దరికీ రెండుకుటుంబాల వ్యక్తు లతో అనుబంధం ఏర్పడింది. అమూల్యా అన్న ఆనంద్, వదిన శారద ఆప్యాయంగా మాట్లాడుతుండే వారు. అమూల్య తండ్రి విజయ్‌తో ఆపేక్షగా ఉండేవాడు.

లలిత, శిరీష అమూల్యకి మంచి స్నేహి తులయ్యారు.

"శిరీష ఇక్కడ ఎందుకు ఉంటున్నది?" అమూల్య అడిగింది విజయ్‌ని.

విజయ్ అర్థంకానట్లు చూశాడు.

"అంటే... పెళ్ళి అయింది కదా... భర్త ఈ దేశంలోనే ఉన్నాడు... మరి కాపరానికి ఎందుకు వెళ్ళలేదా అని" అంది అమూల్యా. తను ఇలా అడిగినందుకు విజయ్ ఏమన్నా అనుకున్నాడా అని కొంచెం బాధకలిగింది కూడా.




"ఓహ్... అదా? ఆ సంగతి నీకు చెప్పా లనే అనుకుంటూ వచ్చాను. ఇంతలో నువ్వే అడిగావు. మా కుటుంబంలో ఒకరివి కాబో తున్నావు కాబట్టి, మా కుటుంబ సభ్యుల సంగతి నీకు తెలియాలి. శిరీషది డిప్రెషన్ కేసు" అన్నాడు విజయ్.

ఆ తర్వాత అతను శిరీష గురించి చెప్పాడు.

శిరీష చాలా సుకుమారంగా పెరిగింది. ఎవరికేం జరిగినా బాధ పడిపోయేది. మనిషి కూడా నాజూగ్గా సుకుమారంగా ఉంటుంది. అలాంటి మనిషి ఏ గొప్ప వాళ్ళ ఇంట్లోనో పుట్టి ఉంటే ఎలా ఉండేదో గానీ, మధ్యతరగతికి ఏమాత్రం తగని మనిషి అని అంతా అనుకుంటూ ఉండే వాళ్ళు.

పద్ధెనిమిదేళ్ళు రాగానే పెళ్ళి సంబంధాలు చూడటం మొదలుపెట్టారు. శిరీష ఇంటర్ పూర్తిచేసి, టైప్ నేర్చుకుంది. ఇంట్లో పరిస్థి తులు చూసి బాధపడేది. తన తర్వాత తమ్ముడు, చెల్లెలు, వీళ్ళందరి భారంకి తోడు తనకి పెళ్ళి చేయాల్సిన భారం కూడా తల్లి తండ్రుల నెత్తిన వేయటం శిరీషకి నచ్చ లేదు.

"నేను ఏదన్నా ఉద్యోగంలో చేరుతా నమ్మా" అంది.

"ఎందుకూ?" అంది రంగమ్మ.

"నా పెళ్ళికోసం అప్పుచెయ్యాలి మీరు. అదెలా తీరుస్తారు? వెనకాలే ఇంకో ఇద్దరు పిల్లల భారం కూడా ఉంది. నేనేదన్నా ఉద్యోగం చేసి, ఆ జీతం పొదుపుచేస్తే, నా పెళ్ళి ఖర్చు అంతా కాకపోయినా, కొంత యినా తగ్గుతుంది" అంది శిరీష మెల్లగా.

"చాల్లే ఊరుకో. ఆడపిల్లకి పెళ్ళి చెయ్యలే నంత దరిద్రంలో తేలి ఆడటంలేదులే. నీ డబ్బుతో నీ పెళ్ళి చెయ్యాలా? అంత ఖర్మ పట్టిందనుకున్నావా?" గయ్యిమంది తల్లి.

అసలు సమస్యని ఆమె అర్థంచేసుకోలేదు.

"ఎందుకమ్మా అలా అరుస్తావు? జలజా వాళ్ళ అక్క ఉద్యోగంలో చేరి డబ్బు కూడ

బెట్టుకోవటంలేదూ? మీకు బరువు కాకూడదని నా బాధ. ఇందులో ఏం తప్పుందని అంతలా అరుస్తావు?" అంది శిరీష.

"నీకు మేమంత గతిలేని వాళ్ళలా కనబడుతున్నామా? అయినా ఉద్యోగం చేస్తే, రేపు వచ్చే పెళ్ళికొడుకులు నీ జీతం డబ్బుకి లెఖ్ఖ అడగరా? జలజ అక్కసంగతి నాకు తెలీదా? మొన్న మన హనుమాయమ్మ చుట్టాన్నేగా పెళ్ళిచూపులకి పిలిచారు. వాడు నువ్వు ఇంతవరకూ సంపాదించింది ఏం చేశావని అడిగాడా, లేదా?" అంది రంగమ్మ.

అలా అడిగిన పెళ్ళికొడుకుని, నువ్వళ్ళర్లేదని మొహానే కొట్టినట్లు చెప్పారు జలజా వాళ్ళు. ఆ తర్వాత ఇంకో సంబంధం కుదిరింది. ఇట్లాంటి ప్రశ్నలేవీ వెయ్యని సంబంధం. తల్లికి ఇవన్నీ తెలుసని తెలిసినా, శిరీష మారుమాట్లాడలేదు. ఎవరితోనూ, ఆఖరికి తల్లితో కూడా గట్టిగా మాట్లాడే కెపాసిటీ శిరీషకి లేదు.

"ఉద్యోగంలో చేరితే మొహంలో నేవళం తగ్గిపోతుంది. నాజూగ్గా, అందంగా ఉంటేనే పెళ్ళికొడుకులు ఇష్టపడతారు" అంది రంగమ్మ చివరగా.

'నాన్నని అడగాలి' అనుకుంది శిరీష.

"నేను ఉద్యోగంలో చేరుతా నాన్నా" అంది.

రాజారావు అంతకుముందే రంగమ్మ ద్వారా సంగతంతా విని ఉన్నాడు. ఆయనకి కూడా శిరీష ఉద్యోగంలో చేరటం ఇష్టంలేక పోయింది. కానీ ఆయన అనుకుంటున్న కారణాలు వేరు.

శిరీష సుకుమారి. సున్నితమైన మనస్సు. ఆమె ఉద్యోగానికి పనికిరాదని ఆయనకి అనిపించింది.

"నా తల్లి శ్రమకి ఓర్చుకోలేదు. నా తల్లికి ఏదన్నా గొప్ప సంబంధం చూడాలి. హాయిగా కాలిమీద కాలేసుకుని తినేట్లు ఉండాలి. వాళ్ళు పిల్లని పువ్వుల్లో పెట్టి చూసుకోవాలి. మామూలు సంబంధాలు శిరీష మనస్తత్వానికి పనికి రావు. బాగా కట్నం ఇచ్చి అయినా సరే, శిరీషకి మంచి సంబంధం చూడాలి" అనుకున్నాడు ఆయన.

లలిత బండ మనిషి. ఏమన్నా సిగ్గుపడదు, బాధపడదు. కానీ శిరీష ఏమీ అనకపోయినా, తనే ఏదో ఊహించుకుని బాధపడిపోతూ ఉండేది చిన్నప్పట్నుంచీ. అందుకే ఆయనకి శిరీషమీద ఎప్పుడూ ఎంతో ఆప్యాయత.

★ ★ ★

శిరీషకు పెళ్ళి కుదిరింది. అతను బ్యాంక్ ఆఫీసరు. మనిషి అందంగా, హుందాగా ఉన్నాడు. తనకు ట్రాన్స్‌ఫర్లు తరచుగా ఉంటాయనీ, కాబట్టి ఉద్యోగం చేసే అమ్మాయి వద్దనీ, కట్నం ఆశ కూడా లేదనీ చెప్పాడు. మనిషి మంచి వాడనీ, ఏ దురలవాట్లూ లేవనీ మధ్యవర్తి చెప్పాడు.

ఈ సంబంధం పోనివ్వకూడదనిపించింది అందరికీ. రాజారావు ఊళ్ళో ఉన్న ఇల్లు తాకట్టుపెట్టి అప్పుతెచ్చాడు. పెళ్ళి జరిగిపోయింది.

అదృష్టవశాత్తూ శిరీష భర్త మంచివాడు. శిరీషను ప్రేమగా చూసుకునేవాడు. శిరీష భర్తమీద రెట్టింపు ప్రేమ చూపించేది. ఇద్దరూ కలిసి, హాయిగా గడిపేవాళ్ళు.

పెళ్ళయ్యాక శిరీష హృదయం ఇంకాస్త సున్నితంగా మారింది. అనుక్షణం భర్తని సుఖపెట్టాలన్న కోరిక మరీమరీ హెచ్చింది. ఆయన తనని కట్నంలేకుండా చేసుకున్నాడు కాబట్టి ఏదో తనని ఉద్ధరించేశాడనుకునేది. ప్రతిక్షణం ఆయనకి ఇంకా ఏదో, ఏదో చెయ్యాలన్న తపన.

రెండేళ్ళు గడిచాయి.

ఈలోపల భర్త శిరీష మనస్తత్వాన్ని అర్థంచేసుకున్నాడు. చిన్నపిల్లాడికి అమర్చినట్లు అన్నీ అమర్చటం అతనికి విసుగు కలిగించేది. ప్రతి చిన్నదానికీ శిరీష బాధపడు

తుంటే ఒక్కోసారి పైకే విసుక్కునేవాడు.

రెండేళ్ళు గడిచేసరికి శిరీషకి భయం పట్టుకుంది.

ఆమెతోపాటు పెళ్ళయిన వాళ్ళందరికీ పిల్లలు పుట్టేశారు. ఒకళ్ళో ఇద్దరో ఇంకా పుట్టని వాళ్ళు ఇప్పుడు ఆ మార్గంలో ఉన్నారు. ఏ కుటుంబనియంత్రణ పథకమో అమలుచేస్తూ ఉండిఉంటే అది వేరు. ఏదీ లేదు. మరెందుకు పిల్లలు పుట్టటంలేదు?

భర్త పిల్లలు లేరని బాధపడుతున్నాడేమో నని భయం... భర్తకి పండంటి బిడ్డని అందివ్వలేకపోతున్నానని బాధ. శిరీషకి పిల్లలులేరనే బాధ తీవ్రమైపోయింది.

భర్త వద్దన్నా వినకుండా అన్ని పరీక్షలూ చేయించుకుంది. అతను కూడా చేయించుకు న్నాడు.

ఇద్దరిలో ఏ లోపమూ లేదు.

రెండేళ్ళకే ఎందుకంత భయమని డాక్టరు ఇద్దరినీ మందలించింది.

"అన్నిటికీ తొందరే. పుట్టకేంచేస్తారు" అని విసుక్కున్నాడు భర్త.

అందరు దేవుళ్ళకూ మొక్కుకుంది.

చెట్లచుట్టూ, పుట్టలచుట్టూ తిరిగింది.

ఫలితంలేదు.

రోజులు గడుస్తున్నకొద్దీ భయమూ, దిగులూ పెరిగాయి. శిరీష లోలోన కుమిలి పోతూ ఉండేది. గిల్టీగా ఫీలవటం మొదలు పెట్టింది. దిగులుగా, నిరుత్సాహంగా ఉండేది. ఇవన్నీ చూసి భర్త ఇంకాస్త విసు క్కునేవాడు.

అప్పుడు కూడా ఆయన్ని ఏమీ అనేది కాదు.

"ఏమిటో. నావల్ల ఆయనకి సుఖంలే కుండా పోతోంది" అని బాధపడేది. చచ్చి పోతే బాగుంటుందనుకునేది.

ఎప్పుడూ ఆలోచిస్తూ కూర్చుండిపోయేది. నిరుత్సాహం, దిగులు కలిపి డిప్రెషన్‌లోకి నెట్టాయి.

ఇంత చిన్నదానికే ఇలా అవుతారా అని వేరేవాళ్ళు ఆశ్చర్యపోతూ ఉండేవాళ్ళు. కానీ అనుభవించేవాళ్ళకి తెలుస్తుంది.

ఇంతలో పొరుగున ఉన్న శ్యామల భర్త ఉన్నట్లుండి గుండె ఆగి చచ్చిపోయాడు. అతనూ శిరీష భర్త ఒకే వయసువాళ్ళు. అప్పట్నుంచీ శిరీషకి తన భర్తకేం జరుగు తుందోనని భయం పట్టుకుంది. ఆయన్ని ఇంకా, ఇంకా అపురూపంగా, జారిపోతున్న రత్నాన్ని చూసుకుంటున్నంత భద్రంగా చూసుకునేది. దేవుళ్ళకి పూజలు, నోములు హెచ్చాయి. తన మాంగల్యం నిలబడాలనీ, సంతాన భాగ్యం కలగాలనీ మొక్కులు, పూజలు.

రానురానూ అతిగా ప్రవర్తించటం మొద లుపెట్టింది. ఉండుండి ఏడవటం... రోజుల తరబడి దిగులుగా ఉండిపోవటం చూసి భర్తకి బోర్‌కొట్టేసింది.

ఒక లెవెల్ వరకూ భరించవచ్చుగానీ మరీ ఇంత అతిగా ఉంటే కష్టం అనుకునే వాడు.

"బాబోయ్ ఎలా సహిస్తున్నావయ్యా?" అని అతని మిత్రులూ, బంధువులూ నేరుగా మొహాన్నే అడిగి సానుభూతి కురిపించటం మొదలయింది.

శిరీష భర్త భరించినంతకాలం భరించి, చివరకు ఒకసారి రాజారావు దంపతులను పిలిపించి సంగతంతా చెప్పాడు.

"ఏం చెయ్యాలో అర్థంకావటంలేదు. ఇంట్లో నేను ఒక్కడినే ఉంటాను. పగలు నేను కూడా ఉండను. ఈ స్థితిలో ఆమె ఇక్కడ ఉండటం మంచిది కాదేమో అనిపి స్తోంది. మీకు చెప్పకుండా ఉండటం మంచి దికాదు. శిరీష రెండుసార్లు ఆత్మహత్యాప్ర యత్నం కూడా చేసింది. ఒకసారి బావిలో దూకబోతుంటే పట్టుకున్నాను. ఇంకోసారి ఇంట్లోంచి వెళ్ళిపోయి రైలుకింద పడబో యింది. అదీ ఎలాగో కనిపెట్టి రక్షించుకు న్నాను. ఆమె మనసు చెదిరిపోయింది. కాస్త కుదుటపడేదాకా మీ ఇంట్లోనే ఉంచు





కోండి. నలుగురిలో ఉంటే కాస్త మారుతుంది. పిల్లలులేరని నేనేం బాధపడటం లేదు. నేనేం దుర్మార్గుడిని కూడా కాను. ఆమెకి కాస్త అర్థమయేట్లు చెప్పండి" అన్నాడు.

శిరీషని ఇంటికి తీసుకెళ్ళటం రంగమ్మకి ఇష్టంలేదు.

"ఇక్కడే ఉండనీ బాబూ. నువ్వు మంచి వాడివి. నీమీద నాకు నమ్మకం ఉంది. అదేదో పనికిమాలిన భయాలు, అనవసర ఆందోళనలతో చక్కటి జీవితం చేజేతులా పాడుచేసుకుంటోంది" అంది రంగమ్మ.

"నిజమే అత్తయ్యగారూ. కానీ ఉన్న విషయం చెప్పాను. మీ అమ్మాయి నేను లేనప్పుడు ఏ అఘాయిత్యం అయినా చేస్తే ఎవరు రక్షిస్తారు? మీ ఇంట్లో అయితే ఎప్పుడూ ఎవరో ఒకరు ఉంటారు. అయినా పిల్లల్ని మరీ ఇంత సున్నితంగా పెంచకూడదండీ. ఇప్పటికైనా జీవితంలో మంచీ చెడూ కాస్త వివరించి, జీవితమంటే ఏమిటో, హాయిగా ఎలా జీవించాలో నేర్పండి. ఎవరన్నా డాక్టరుకి చూపించి సలహా తీసుకోండి" అన్నాడు మెల్లగా.

కానీ ఆ స్వరంలో చురుకు రంగమ్మని ఛెళ్ళున కొట్టినట్లయింది. నీకు పిల్లల్ని పెంచటం రాలేదని సున్నితంగా చెప్పాడు అని లోలోపల ఉడుక్కుని, ఏమీ అనలేక ఊరుకుంది.

శిరీషని హైదరాబాద్ తీసుకుని వచ్చారు. ఆ తర్వాత ఏం చెయ్యాలో తల్లితండ్రులకి అర్థంకాలేదు.

"మంచి సైకియాట్రిస్ట్‌కి చూపిద్దాం" అన్నాడు విజయ్.

"చాల్లే ఊరుకో. అలా చేస్తే ఏదో పిచ్చి ఉందనుకుంటారు. ఇది పిచ్చిదని ప్రచారమైతే, లల్లీకి కూడా పెళ్ళి సంబంధాలు రావు" అంది రంగమ్మ.

"సైకియాట్రిస్ట్ దగ్గరకు వెళ్ళినంతమాత్రాన పిచ్చిదనుకుంటారా ఏంటి? చాలా మంది వెళ్ళి సలహా తీసుకుంటారుట. వాళ్ళు శిరీష మానసిక ధైర్యాన్ని పెంచి బాగుచేస్తారు" అన్నాడు విజయ్.

"సరేలే. గొప్పవాళ్ళల్లో అయితే ఏం చేసినా చెల్లుతుంది. నాకు మనసు బాగా లేదు. అది సరిచేసుకోవటానికి డాక్టర్ దగ్గరకు వెళ్ళానని ఏ ఐశ్వర్యవంతురాలో చెపితే, ఆహా అని సానుభూతి చూపిస్తాం. అదే మనలాంటి మధ్య తరగతి వాళ్ళకు అవన్నీ కుదరవు. మనం అలా చెపితే బాబోయ్ పెద్ద మెంటల్ కేస్‌లా ఉందని వెక్కిరిస్తారు. ఆ పిచ్చి డాక్టర్లూ అదంతా మనకి కుదరని వ్యవహారం" అని తేల్చి చెప్పింది రంగమ్మ.

శిరీష ఆమె కళ్ళకి పెద్ద గుదిబండలా కనిపిస్తోంది. శిరీష భర్త చూస్తే, ఆమె పూర్తిగా బాగుపడితేగానీ రానిచ్చేట్లు లేడు. బాగుచేద్దామంటే మామూలు డాక్టర్ దగ్గరకి వెళితే ఒకసారి సైకియాట్రిస్ట్‌కి చూపించమంటాడు. చూపించటం ఇష్టంలేదు. పెళ్ళికి చేసిన అప్పులే తీర్చలేక చస్తుంటే, ఇప్పుడు ఇంటికి తిరిగి తీసుకురావాల్సివచ్చింది. ఇంకో మనిషి ఖర్చు. అన్నం సరిగ్గా తినదు. ఏమీ అడగదు. అయినా మరోమనిషి. ఇప్పటికే ఎందుకొచ్చింది, ఎన్నాళ్ళుంటుందని అంతా అడుగుతున్నారు. సంగతి తెలిసిపోకుండా ఉండదు. ఎలా? ఏం చేయాలి? దీనివల్ల, దీని తర్వాత పిల్లలకి కూడా చెడు జరుగుతుందేమో?

ఇలాంటి ఆలోచనలు రంగమ్మని నిలవనిచ్చేవి కావు. అవి ఆమెని పీడించి, ఆమె శిరీషని తిరిగి పీడించేట్లు చేసేవి.

"చక్కటి మొగుడు, లక్షణమైన సంసారం, హాయైన జీవితం ఉన్నా, అనుభవించే రాత లేకపోతే ఎవరేం చెయ్యగలరు? తల తాకట్టుపెట్టి, నీ పెళ్ళి చేశాం. కుదురుగా కాపరం చేసుకోక ఏమిటీ అనవసరం ఏడుపులు. పిచ్చివేషాలు మాని, హాయిగా కాపరం చేసుకోలేవూ? " అని తిట్టేది.



ఆవేదన, ఆందోళనతో ఆవిడ నోట్లోంచి వచ్చిన మాటలు మొరటుగా ఉండేవి. వాటినే కాస్త మృదువుగా, శిరీష మనసుకి వంటపట్టేట్లు చెపితే శిరీష బాగయ్యేదేమో. కానీ సగటు బతుకుల్లో చాలీ చాలని ఆదాయాల జీవితాల్లో అనేక సమస్యల్తో, ఆందోళనలతో సతమతమవుతూ, మృదువుగా, అందంగా, మెత్తగా మాట్లాడటం ఎలా సాధ్యం?

"అక్కని ఏదన్నా ఉద్యోగంలో పెడితే కాస్త కాలక్షేపం ఉంటుంది. ఖాళీగా ఉంటే అనవసరపు ఆలోచనలు ఇంకా వస్తాయి. బయటకెళ్ళి నలుగుర్నీ చూసివస్తుంటే జీవితం అంటే ఏమిటో తెలుస్తుంది. మనస్సు కాస్త గట్టిపడుతుంది" అన్నాడు విజయ్.

రంగమ్మకి అదీ ఇష్టంలేదు. నాలుగు రోజులు ఉంచుకొమ్మని పుట్టింటికి పంపితే, పిల్లచేత ఉద్యోగం చేయించారని అంటారేమోనని భయం.

విజయ్ మరీమరీ చెప్పటంతో రాజారావు వెతికి వెతికి ఒక ప్రైవేటు ఆఫీసులో ఆఫీసు అసిస్టెంట్ ఉద్యోగం వేయించాడు. శిరీష ఉద్యోగానికి ఇష్టపడే వెళ్ళింది. ఆవిధంగానన్నా ఇంటికి కాస్త బరువు తగ్గుతుందని అనుకుంది. కానీ, అక్కడ పనిలో తప్పులు దొర్లేసరికి ఆఫీసరు మందలించాడు. శిరీష ఏడుస్తూ కూర్చుండిపోయింది. ఆ తర్వాత పనిచెయ్యలేదు. మర్నాడు కూడా వెళ్ళి, ఊరికే కూర్చుండిపోయింది. ఆఫీసరుకి కోపం వచ్చి, నువ్వు మా కొద్దుతల్లీ అన్నాడు. శిరీష వెంటనే ఏడుస్తూ వెళ్ళిపోయింది. ఆఫీసువాళ్ళకి భయంవేసి ఇంటికి కబురుపంపారు. శిరీష ఇంటికి రాలేదు. అంతా కంగారుగా వెతికారు. చివరకు హుస్సేన్‌సాగర్ గట్టుమీద సోఫాలో కూర్చుని కనిపించింది. జనం సద్దుమణిగాక అందులో దూకి చచ్చిపోదామని కూర్చుందిట. అంతా బతిమాలి ఇంటికి తీసుకువచ్చారు.

"నువ్వు ఎందుకూ పనికిరావే. నీకేదీ చేతకాదు. కాపరం చేసుకోవటం చేతకాదు, ఉద్యోగం చెయ్యటం రాదు, బతకటం చేతకాదు. ఏదీ చేతకాదు. పనికిమాలిన దానా" అని తిట్టేసింది రంగమ్మ.

"అవునమ్మా. నేను ఎందుకూ పనికిరాను. నేను బతకటం దేనికీ? చస్తాను. నన్ను చావనివ్వండి" అని కరెంట్ ప్లగ్గులో వేళ్ళుపెట్టి చావటానికి ప్రయత్నించింది శిరీష. అంతా హడలిపోయి, వెనక్కులాగి, అట్లాంటి పని చేయొద్దని బతిమాలారు.

ఇంక ఇప్పుడు ఏం చేయాలో అసలు అర్థంకాలేదు ఎవరికీ. కాలక్రమేణా అదే బాగుపడుతుందని తేల్చేసి, గుండె రాయి చేసుకుంది రంగమ్మ. శిరీష భర్త అప్పుడప్పుడూ చూసి వెళ్తూనే ఉన్నాడు. అతను రాకపోతే, శిరీష పరిస్థితి మరింత ఘోరంగా తయారై ఉండేది.

అమూల్యకి అంతా చెప్పి నిట్టూర్చాడు విజయ్.

అమూల్య శ్రద్ధగా వింది. ఏం చేస్తే బాగుంటుందని ఆలోచిస్తూ ఉండిపోయింది.

"మాకు తెలిసిన సైకియాట్రిస్ట్ ఉన్నాడు. ఆయనకి చూపించుదాం" అంది.

"ఉహూ... లాభం లేదు. అమ్మ ఒప్పుకోదు"

"అలా కుదరదు. ఆవిడ కాదనకూడదు. అయినా ఇది శిరీష సమస్య. ఆమె వస్తుందా రాదా అని అడుగు. ఆమె సహకరించకపోతే మాత్రం మనమేం చెయ్యలేం" అంది అమూల్య.

"నువ్వే వచ్చి అడుగు" అన్నాడు విజయ్.

"రేపు సాయంత్రం ఆరుగంటలకి వస్తాను" అంది అమూల్య.

మర్నాటికల్లా అన్నీ సిద్ధంచేసింది అమూల్య. సైకియాట్రిస్ట్ డాక్టర్ ఇంద్ర అపాయింట్‌మెంట్ తీసుకుంది. సాయంత్రం




అయిదు గంటలకి విజయ్ ఇంటికి వచ్చింది.

"రామ్మా రా" అంటూ ఆప్యాయంగా లోపలకు ఆహ్వానించింది రంగమ్మ.

అమూల్య కారు ఆగిన వెంటనే లలితా, శిరీషా కూడా ముందు గదిలోకి వచ్చేశారు. మామూలు పలకరింపులు ముగిసి సరదా కబుర్లు జరుగుతుండగా రంగమ్మ లోపలకు వెళ్ళింది.

"శిరీషా కాస్త బయటకు వెళదాం వస్తావా" అడిగింది అమూల్య.

"దేనికీ, షాపింగ్‌కా? నేనూ రానా? " లలిత ఉత్సాహంగా అడిగింది.

"షాపింగ్‌కి కాదు. కాస్త పని ఉంది"

"సీక్రెట్టా? "

"అవును" అమూల్యా నవ్వేసింది.

"పార్కులో కూర్చుని కాసేపు మాట్లాడుకుందాం. నీకు మనసు కాస్త తేలికపడుతుంది" అంది అమూల్య.

"అలాగే" అంది శిరీష.

శిరీష మొహం కడుక్కుని, తలదువ్వుకుని, చీర మార్చుకుని తయారయి వచ్చేలోపల పావుగంటయింది. రంగమ్మ టీ చేసి తెచ్చింది.

టీ తాగి బయల్దేరారు.

"కాసేపు అలా తిరిగి వస్తాం" అని తల్లికి చెప్పి బయల్దేరింది శిరీష.

ముగ్గురూ కారెక్కారు. కారు ఒక పార్కు ముందు ఆపింది అమూల్య.

ముగ్గురూ పచ్చికలో కూర్చున్నారు.

"శిరీషా. నిన్నోమాట అడగనా? ఏమనుకోనంటేనే"

"ఏమీ అనుకోను అమూల్యా. అడుగు"

"ఏం లేదు. నీకు కూడా అందరిలా హాయిగా ఉండాలని లేదూ? "

"ఎందుకు లేదు. కానీ ఏం లాభం? ఉన్నట్లుండి డిప్రెషన్ వచ్చేస్తుంది. భరించరాని నిరాశలో మునిగిపోతాను. ఏ పనీ చెయ్యలేను. చచ్చిపోదామనిపిస్తుంది"

"మాకు తెలిసిన డాక్టర్ ఉన్నారు. సైకియాట్రిస్ట్. ఆయన దగ్గరకు వెళ్ళి చూద్దామా? " అమూల్య మృదువుగా అడిగింది.

శిరీష అర్థంకానట్లు చూసింది.

"ఆయన ఇలాంటి కేసులెన్నో బాగుచేశారు. మందులు కూడా లేకుండా, కేవలం మాటలతోనే కొన్ని బాగుచేశారు. నీ బాధేంటో చెపితే సలహా ఇస్తారు. ప్లీజ్, రారాదూ. నువ్విలా అయిపోవటం చూసి విజయ్ చాలా బాధపడుతున్నాడు. మా సంతోషం కోసం..." అమూల్య మెల్లగా అంది.

"నా మూలంగా ఒకళ్లకి సంతోషం కలుగుతుందంటే ఆ పని చెయ్యటానికి నాకేం అభ్యంతరం లేదు. పైగా ఇది నా కోసమేగా" అంది శిరీష.

శిరీష అంత తొందరగా ఒప్పేసుకుంటుందని విజయ్ ఊహించలేదు. అమూల్యవైపు ప్రశంసగా చూశాడు.

"శిరీషా ఇప్పుడే వెళ్దాం" అంది అమూల్య. శిరీష లేచి నిలబడింది. ముగ్గురూ బయల్దేరారు.

డాక్టర్ ఇంద్రకి శిరీష సంగతంతా ముందే చెప్పి ఉంచింది అమూల్య.

"ఆయన ఏం అడిగినా చెప్పాలి. ఏదీ దాచకు. నీ మనసులో ఏమేం ఉందో అంతా వివరించు. ఏమీ భయంలేదు. ఆయన చాలా గొప్ప డాక్టరు" చెప్పింది అమూల్య.

శిరీష తల ఊపింది.

ఒక గంటదాకా లోపలే ఉంది. ఆయన ఓపిగ్గా మళ్లీ అన్నీ శిరీషని అడిగి తెలుసుకున్నాడు.

"ఈ టెస్టులు చేయించుకురామ్మా" అని ఒక నర్సుని తోడిచ్చి లోపలకు పంపాడు.

శిరీష నర్సుతో వెళ్ళగానే అమూల్యనీ, విజయ్‌నీ లోపలకు పిలిచాడు.

"ఆమెకి ఏ లోపమూ లేదు. ఓవర్ సెన్సి





టివ్. కాస్త వీక్‌గా ఉంది. ఖాళీగా ఉండటం వల్ల అనవసరపు ఆలోచనలు మరికాస్త వచ్చి చేరినట్లున్నాయి. అంతే. ఆమెకి ధైర్యం చెప్పాను. జీవితంలో అన్నీ ఉన్నప్పుడు లేని పోనివి ఊహించుకుని బాధపడటం అనవసరం అని చెప్పాను. దేనికి ఎంత ప్రాముఖ్యత ఇవ్వాలో అంతే ఇవ్వాలని వివరించాను. తను బాగానే వింది. తప్పకుండా కోలుకుంటుంది. అసలు చాలా సింపుల్ కేస్. బాల్యంలోనే కాస్త దృఢమనస్కురాలిగా చేస్తే పోయేది. మన నవలా నాయికలను ఎంత సున్నితంగా, సుకుమారంగా ఉంటే అంత గొప్ప అన్నట్లు చిత్రీకరించేవాళ్ళు. జీవితంలో అలా ఉంటే కుదరదు"

"ట్రీట్‌మెంట్ ఏం అక్కర్లేదా డాక్టర్" అన్నాడు విజయ్.

"ఇదే. ఇలా ధైర్యం చెప్పటమూ, జీవితం పట్ల అవగాహన ఏర్పడేట్లు చేయటమూ, ఇదే ట్రీట్‌మెంట్. ఆమెకి ఏదన్నా వ్యాపకం ఉంటే బాగుంటుంది. చదువుకోమనండి. ప్రైవేటుగా బి.ఏ. చదవమనండి"

"ఏకాగ్రత కుదరదేమో డాక్టర్. చదవగలదా?" విజయ్ సందేహంగా చూశాడు.

"ఏం పర్వాలేదు. చదవగలదు. కోచింగ్‌కి ఒకవేళ ఏ ట్యుటోరియల్‌లోనైనా చేరుతానంటే చేర్పించండి. మీరు కొన్ని మంచి పుస్తకాలు నేను సజెస్ట్ చేస్తానులెండి, మనిషిలో ఆత్మవిశ్వాసం పెంచేవి... అవి తెచ్చి చదివించండి" అన్నాడాయన.

"డాక్టర్‌గారూ... పూర్తిగా రికవర్ కావటానికి ఎన్నాళ్ళు పడుతుంది?"

డాక్టర్ ఇంద్ర నవ్వాడు.

"అట్లా తేల్చిచెప్పే జబ్బులు కావు ఇవి. అది పేషెంట్‌ని బట్టి ఉంటుంది. ఆమెని చూస్తే మాత్రం చాలా తొందర్లోనే రికవర్ అయ్యేట్లుంది. అప్పుడు వెంటనే మళ్ళీ డిప్రెషన్‌లోకి వెళ్ళిపోకుండా చూసుకోవాలి. ఆమె తనకి భర్త విడాకులిస్తాడేమోనని భయపడ్తోంది. ఆ భయం పోగొట్టాలి" అన్నాడు.

"ఇక మీదే భారం" అంది అమూల్య.

"ష్యూర్... ష్యూర్" అన్నాడాయన.

శిరీష తిరిగివచ్చింది.

"ఈ మందులు వాడమ్మా. వారానికోసారి ట్రీట్‌మెంట్‌కి రావాలి" అన్నాడాయన.

శిరీష తల ఊపింది. ఆ కొద్దిసేపట్లోనే శిరీష మొహంలో కాస్త తేటదనం కనిపించినట్లయింది విజయ్‌కి.

డాక్టర్ దగ్గర సెలవు తీసుకుని బయల్దేరారు.

"డాక్టర్‌గారు నువ్వు చదువుకుంటే బాగుంటుందంటున్నారు" దారిలో చెప్పింది అమూల్య.

"నేనా? ఏం చదవనూ?" తెల్లమొహం వేసింది శిరీష.

"బి.ఏ. చదువు"

"నా వల్ల కాదు"

"తల్చుకుంటే అవుతుందన్నారు ఆయన"

"అయితే ప్రయత్నిస్తాను" అంది శిరీష.

ఇంటికి వెళ్ళేముందు ఒక పుస్తకాల షాపులో, కొన్ని పుస్తకాలు కొంది అమూల్య.

"బి.ఏ.లో చేరేందుకు వివరాలు కనుక్కునే లోపల ఇవన్నీ చదువు" అంది.

డాక్టర్‌గారు రాసిచ్చిన మందులు కొంది.

"చాలా ఖర్చు పెడుతున్నావు. నీ ఋణం ఎలా తీర్చుకోను?" అడిగింది శిరీష.

"నువ్వు హాయిగా ఉండి..." నవ్వుతూ జవాబిచ్చింది అమూల్య.

ఇంట్లో అంతా ఎదురుచూస్తున్నారు.

"ఎక్కడికెళ్లారు?" రంగమ్మ కుతూహలంగా అడిగింది.

"శిరీషని డాక్టర్‌కి చూపించి వస్తున్నాం" అంది అమూల్య.

"ఏ డాక్టర్? ఎక్కడుంటాడు? ఏమన్నాడు?" ప్రశ్నలవర్షం కురిపించింది రంగమ్మ.

"డాక్టర్ ఇంద్ర. సైకియాట్రిస్ట్. శిరీష శుభ్రంగా ఉంది. ఏ ప్రాబ్లమూ లేదన్నాడు.

కాకపోతే ఏదన్నా వ్యాపకం ఉంటే మంచిద న్నారు. బి.ఏ.లో చేర్పించమన్నారు"

"డబ్బు ఆయనిస్తాడా? " అనాలోచితంగా పైకే అనేసింది రంగమ్మ.

"ఆయనెందుకిస్తాడు. శిరీష వాళ్ళాయనకి రాసి డబ్బు తెప్పించుకుంటుంది" అంది అమూల్య.

"ఆ..." రంగమ్మతోపాటు శిరీష కూడా ఆశ్చర్యపోయింది.

"అవును శిరీషా. నీ చదువుకి ఆయన కాకపోతే మరెవరిస్తారు? ముందు నీ హక్కులు తెలుసుకో" నవ్వేసింది అమూల్య.



శిరీష ట్యుటోరియల్ కాలేజీలో చేరింది. కాస్త మనుషుల్లో పడ్డట్లు కనిపిస్తోంది.

"పిల్లలు పుట్టరనుకోవటానికి ఇది వయసు కాదు. పిల్లలు పుట్టకపోయినా నష్టమేం లేదు. దానివల్ల మీ ఆయన నీకు గానీ, నువ్వు ఆయనకుగానీ చేసిన అన్యా యమేం లేదు. అంతగా అయితే ఎవర్నన్నా పెంచుకోవచ్చు"

"ఎప్పుడూ ఏదో జరిగిపోతుందేమోనని భయపడ్తూ కూర్చోవటం అవివేకం. నాకేం జరగదు అనుకుని హాయిగా గడపాలి. అన వసరపు దిగుళ్ళవల్ల ఆరోగ్యం పాడయి, దాంతో ఆందోళన ఇంకాస్త పెరిగి, చివరికి అదొక చక్రంలా తయారవుతుంది. దాన్లోంచి బయటపడలేవు.

"నాకేం కాదు అనుకుని ఆనందంగా గడుపు. ఎందుకవుతుంది? ఎవరికో ఏదో జరిగిందని మనకూ అదే జరుగుతుందనుకో వటం వెర్రితనం.

"నా ఫ్రెండు రంగనాథం, నేనూ కలిసి మెడిసిన్ చదివాం. ఒకేసారి ప్రాక్టీసు పెట్టాం. ఒకే సంవత్సరంలో ఇద్దరికీ పెళ్ళ యింది. మా జీవితంలో అన్ని సంఘట నలూ కలిసే జరిగాయి. వాడు పోయి ఏడా దవుతోంది. హార్ట్ఎటాక్. అందుకని నాకూ హార్ట్ఎటాక్ వస్తుందేమోనని భయపడ్తూ కూర్చుంటే? ఆలోచించు.

"ఎక్కడో భూకంపం వస్తుంది. అందుకని మనకూ భూకంపం వస్తుందని భయప డితే?

అదంతా పిచ్చితనమమ్మా"

"నువ్వు చాలా తెలివిగలదానివి. ఆలో చించు. నీ టైమ్ వృథా చేసుకోకు. బాగా చదువు.

"అతను వేరు, నువ్వు వేరని ఆలోచిం చకు. భార్యాభర్తలన్నాక ఇద్దరూ ఒక్కటే. నీకేమన్నా అవుతుందేమో. అప్పుడతను ఎట్లా ప్రవర్తిస్తాడోనని అనవసరంగా భయ పడకు. ఏదో ఒక వ్యాపకం పెట్టుకో"

"నీకు చచ్చిపోవాలని కోరిక ఎందుకు పుడుతోంది? అసలు ఆలోచించు. ఒక్క సారి ప్రపంచంవైపు చూడు. ఎన్ని బాధ లలో జనం తల్లడిల్లిపోతున్నారో అర్థం అవు తుంది. మనస్సు కాస్త గట్టిపడుతుంది"

ఇట్లా ఎన్నో అనునయంగా చెప్పి శిరీషకి జీవితంపట్ల అవగాహన కలిగించాలని ప్రయత్నించాడు డాక్టర్.

శిరీష కాస్త మారింది.

శ్రద్ధగా చదువుతోంది. గడ్డంకింద చేయి ఆనించి శూన్యంలోకి చూస్తూ ఉండిపోవటం




తగ్గింది. కాలేజీకి పోయివస్తోంది. వాళ్ళిచ్చిన హోమ్‌వర్క్ ఏదన్నా ఉంటే చూసుకుంటుంది. సాయంత్రంపూట ఖాళీగా ఉన్న సమయంలో మాత్రం కాస్త మూడీగా ఉంటుంది. మిగతా అంతా దాదాపు కోలుకున్నట్లే.

శిరీష మామూలుగా అవుతుండటం చూసి రంగమ్మ చాలా సంతోషించింది.

"ఎంతైనా గొప్పవాళ్ళపిల్ల. మనకన్నా చాలా సంగతులు తెలుసు" అని అమూల్యని అభినందించింది.

"మేమేం చేసినా అర్థం కానట్లు చూసేది అక్క. ఇట్లా అవగలదనీ, చదువుకుంటుందనీ, నేనెప్పుడూ అనుకోలేదు" అంటూ లలిత కూడా ఆశ్చర్యపోయింది.

శిరీషని ఒక్కదాన్నీ ట్యుటోరియల్ కాలేజీకి పంపాలంటే భయంగా అనిపించినా, అమూల్య పర్వాలేదు పంపించమని ప్రోత్సహించింది.

అమాయకురాలు, ఒంటరిగా చేసుకోలేదు అని మొదట్నుంచీ ఎవరో ఒకరు శిరీషకి తోడు ఉంటూవచ్చారు. స్కూలుకీ, కాలేజీకి కూడా ఎప్పుడూ ఎవరో ఒకరు తోడు ఉండేవాళ్లు. శిరీష ఫ్రెండ్స్ ఇంటికి వచ్చి ఆమెని తీసుకెళ్ళేవాళ్ళు.

ఆ విధంగా శిరీష ఏపని చేయాలన్నా ఒకరు తోడులేనిదే చేసుకోలేని స్థితిలో ఉంటూ వచ్చింది.

సున్నిత హృదయం అంటూ ఆమెని ఆ స్థితిలోనే ఉంచారు తప్ప, ఏమవుతుంది వెళ్ళిరా అన్నవాళ్ళులేరు. బహుశా అందువల్లనేనేమో, పెళ్ళయ్యాక భర్త ఇంట్లో ఒంటరిగా ఉండి, ఆమె ఆలోచనలు రకరకాల మార్గాలు పట్టినట్లున్నాయి. శిరీష అని పేరు పెట్టినందుకు పేరుకు తగ్గట్లు శిరీష కుసుమ కోమలంగా ఉందని సంతోషించారే తప్ప, ఆమెని అట్లా పూర్తిగా ఇంకొకళ్ళమీద ఆధారపడకుండా కాస్త స్వతంత్రంగా ప్రవర్తించేందుకు ఎవరూ దోహదం చెయ్యలేదు. ఆ తర్వాత ఆమె ఆత్మహత్యా ప్రయత్నాలకి హడలిపోయి, ఒంటరిగా ఎంత మాత్రం ఉండనిచ్చేవాళ్ళు కాదు.

డాక్టరు ఇంద్ర ఇవన్నీ వివరించి, శిరీషకి ఆత్మవిశ్వాసం పెరగాలంటే ఒక్కత్తే పనులు చేసుకోవటం కూడా నేర్వాలన్నారు.

శిరీష కాలేజీకి వెళ్ళివస్తోంది. పాఠాలు శ్రద్ధగా చదువుకుంటోంది. బేలగా ఆలోచించటం మాని, బుర్రకి కాస్త పదును పెట్టటం మొదలుపెట్టింది.

భర్తకి రాసి డబ్బులు తెప్పించుకుంది. ఫీజుకీ, పుస్తకాలకీ పెట్టిన ఖర్చు తల్లిదండ్రులకి తిరిగి ఇచ్చేసింది.

"నువ్వు చదువుకుంటున్నందుకు సంతోషం. చదువు నిన్ను మానసికంగా ఎదిగేట్లు చేస్తుంది. డబ్బు కావాలంటే సంకోచించకుండా అడుగు. నువ్వు రాసిన ఉత్తరంబట్టే నీలో మార్పు వస్తోందని అర్థమైంది. తొందర్లోనే మానసిక స్థైర్యం ఏర్పరచుకుని హాయిగా మన ఇంట్లో అడుగుపెడతావని ఆశిస్తూ, నీ రాకకై ఎదురుచూస్తున్నాను" అంటూ ఉత్తరం రాశాడు భర్త.

శిరీష అప్పుడే తను ఏదో సాధించేసినట్లు పొంగిపోయింది. దీక్షగా చదువుతోంది.

విజయ్‌తో కలిసి అమూల్య ఇంటికి వెళ్ళింది. "ఎంత పెద్ద ఇల్లు" ఆశ్చర్యపోయింది. గార్డెన్‌లో తిరిగింది. ఆర్చీలమీద పాకించిన పూలతీగెలూ, తోటలో విరబూసిన పూలూ అన్నీ చాలా బాగున్నాయని మెచ్చుకుంది.

"ఈ కుక్కబొమ్మలు నిజంగా కుక్కల్లాగే ఉన్నాయి" ఆశ్చర్యపోతూ అంది, గార్డెన్‌లో ఓచోట ఉన్న కుక్కబొమ్మల్ని చూసి.

"నేనూ మొదట్లో నిజం కుక్కలే అనుకున్నాను" నవ్వేశాడు విజయ్.

షోకేసుల్లో ఉన్న పింగాణీ, వెండిసామగ్రీ, అమూల్య గదీ, చీరెలూ, నగలూ ప్రతీదీ శిరీషకి ఆశ్చర్యం కలిగించాయి.

"అమూల్యా" ఏదో అనబోయి ఆగింది.

"ఏంటి శిరీషా"

"మీకు బోలెడంత డబ్బుంది. నీకు చదువు, అందం అన్నీ ఉన్నాయి. మరీ మా విజయ్‌ని ఎట్లా ప్రేమించావు? " శిరీష అడిగింది.

విజయ్ ఉలిక్కిపడ్డాడు. శిరీష అట్లా అడుగుతుందనుకోలేదు. లలిత అయితే ఎప్పుడూ డబ్బూ, అందంలాంటి పైపై మెరుగుల గురించే ఆలోచిస్తుంది. చాలా సార్లు శిరీష అడిగిన ఈ మాటలు అంటూ ఉంటుంది కూడా. బాహ్యాడంబరాలు మాత్రమే పట్టించుకునే లలితలాంటివాళ్ళు అంతకన్నా ఆలోచించలేరు. కానీ శిరీష అట్లా అడుగుతుందని ఊహించనందువల్ల, ఒక్కక్షణం ఏం మాట్లాడాలో కూడా తెలియక ఆగిపోయాడు.

కాని అమూల్యా నవ్వేసింది.

"మీ అన్నయ్యకేం తక్కువయిందంటావు? " తిరిగి ప్రశ్నించింది.

"అవును. మా అన్నయ్యకేం తక్కువ? " శిరీష కూడా నవ్వింది.

అమూల్యా వాళ్ళు ఐశ్వర్యవంతులని తెలుసుగానీ, ప్రత్యక్షంగా చూడటంవల్ల శిరీషకి అదోలా ఉంది. అమూల్యతో ఇదివరకులా మాట్లాడలేకపోయింది. ఏదో జంకుగా అనిపించింది.

"రా శిరీషా... నా లైబ్రరీ చూద్దువుగానీ" అమూల్యా శిరీష చెయ్యి పట్టుకుని పుస్తకాల బీరువాలున్న గదిలోకి తీసుకెళ్ళింది. చక్కగా బైండ్ చేసిన పుస్తకాలమీద రచయిత పేరూ, పుస్తకం పేరూ మిలమిల మెరుస్తున్నాయి. తనకి నచ్చిన పుస్తకాలు కొన్ని అడిగి తీసుకుంది శిరీష.

అప్పుడప్పుడూ అమూల్యా ఇంటికి వెళ్ళటం, అమూల్యా వాళ్ళు ఇంటికి రావటంతో వాళ్ళ మధ్య బంధాలు పెరిగాయి.

శిరీషకి తనలో కలిగిన చిన్నచిన్న మార్పులు... కొంచెం మనుషులతో ధైర్యంగా మాట్లాడగలగటం, చిన్నచిన్న విషయాలకు పెద్దగా బాధపడకపోవటం... ఇట్లాంటివి ఆత్మవిశ్వాసాన్ని పెంచాయి. ఒక్కత్తే పనులు చేసుకోవటంలో ఉత్సాహాన్ని చూపించేది. చిన్నపిల్లలు తప్పటడుగులు వేస్తూ తమ నడకని పెద్దవాళ్ళు గుర్తించాలని కోరుకున్నట్లు తన సమర్ధత నలుగురూ గుర్తించాలన్న తపన శిరీషలో మొదలైంది. తనలో ఈ మార్పుని భర్త తెలుసుకోవాలని కోరుకోవటం మొదలుపెట్టింది.

"అమ్మా. నేనింక మా ఇంటికి వెళ్ళిపోతాను" అంది.

"మరి డాక్టరుగారిని అడిగావా? "

"అఖ్ఖర్లేదమ్మా. సొంతంగా నిర్ణయం తీసుకున్నందుకు ఆయన సంతోషిస్తారు"

"సరే మరి, నీకు వెళ్ళి ఉండగలనని ధైర్యం ఉందా? "

"ఉందమ్మా. నువ్వేం భయపడకు. వెళ్తాను"

"నేను తోడుగా రానా? మనం వస్తున్నామని ఆయనకి ఫోన్‌చేసి చెప్పమంటావా? "

"వద్దమ్మా. ఒక్కదాన్నే వెళ్తాను. హఠాత్తుగా వెళ్ళి సర్‌ప్రైజ్ చేస్తాను. రేపే నా ప్రయాణం"

రంగమ్మకి శిరీష తిరిగి వెళ్ళిపోతున్నందుకు సంతోషంగా ఉంది. గబగబా లేచి చలిమిడికీ, జంతికలకీ ఏర్పాట్లు చేసింది. భర్తతో శిరీష ప్రయాణం గురించి చెప్పింది.

"ఉండగలదంటావా? ఇంకొన్నాళ్ళాగితే మంచిదేమో? " అన్నాడు రాజారావు.

"ఉండకేం చేస్తుంది. కాస్త నలుగురినీ చూసేసరికి తన పరిస్థితేంటో అర్థమై ఉంటుంది" తేలిగ్గా అంది రంగమ్మ.





"మరి చదువు?"

"చదువుకేం పర్వాలేదు నాన్నగారూ. ఈ ట్యుటోరియల్ వాళ్ళకి ఆ ఊళ్ళో కూడా కాలేజి ఉంది. నా ఫీజు అడ్జస్టు చేస్తామన్నారు" అంది శిరీష.

"నీ ఇష్టం తల్లీ" అన్నాడాయన వాత్సల్యంగా.

ఆరోజు విజయ్ కాలేజీనుంచి రాగానే శిరీష ప్రయాణం గురించి చెప్పారు.

విజయ్‌కి ఏం చెప్పాలో తెలీలేదు. భర్త దగ్గరకు వెళ్ళటానికి సంబరపడుతున్న శిరీషని ఉండమని అనలేకపోయాడు.

శిరీషకి చీర, జాకెట్టు తెచ్చారు.

పొద్దున్నే లేచి స్నానం చేసి పుట్టింటి వాళ్ళు పెట్టిన కొత్తచీర కట్టుకుని ముత్యంలా తయారయింది శిరీష.

"నీ మనసు బాగాలేకపోయినా, ఏ సమస్య వచ్చినా సంకోచించకుండా మాకు చెప్పు" అన్నాడు రాజారావు.

"ఏమీ ఉండదు. అంతా బాగుంటుంది. అనవసరంగా అపశకునం మాటలు మాట్లాడకండి" అంది రంగమ్మ.

రాజారావు ఇంకేం మాట్లాడలేదు.

శిరీష నవ్వుతూ రైలెక్కింది.

ఎలా వెళ్తుందో, ఏం చేస్తుందోనని అందరికీ బెంగగానే ఉంది. దిగులుని మనసులోనే అణుచుకుంటూ, నవ్వుతూ చెయ్యి ఊపారు.

రైలు కనుమరుగైంది.

"శిరీష వాళ్ళింటికి వెళ్ళిపోయింది" అమూల్యకి చెప్పాడు విజయ్.

అమూల్య హడలిపోయింది.

"నిజంగానా? ఎందుకు వెళ్ళనిచ్చారు?" గాభరాగా అడిగింది.

"బాగుంది. వాళ్ళాయన దగ్గరకు వెళ్తానంటే ఎలా ఆపగలం? అయినా శిరీష పూర్తిగా బాగుపడినట్లే కనిపిస్తోంది"

"నిజమే. కానీ సమస్యల్ని ఎదుర్కొనే ధైర్యం ఆమెకి ఇంకా రాలేదు. ఇంకొన్నాళ్ళు ఆగితే బాగుండేది"

విజయ్ మౌనంగా ఊరుకున్నాడు.



శిరీష రైలు దిగింది.

అప్పటికి రాత్రి పదిగంటలయింది.

స్టేషన్‌కి దగ్గరే ఇల్లు. రిక్షా మాట్లాడుకుని ఎక్కింది. రిక్షా ఇంటిముందు ఆగింది.

ఇంట్లో లైట్లు ఆర్పేసి ఉన్నాయి. భర్త అప్పటికే నిద్రలో మునిగిపోయినట్లున్నాడు.

శిరీష రిక్షా దిగి సామాను దింపి, ఇంటి తలుపు కొట్టింది. జవాబు లేదు.

పక్కింటి సీతమ్మగారింట్లో ఇంకా మెలకువగానే ఉన్నారు. అలికిడికి ఆవిడ బయటకు వచ్చింది.

శిరీషను చూసి నిర్ఘాంతపోయింది.

"ఇలారా..." అంటూ మెల్లగా పిలిచింది.

ఏమిటోనని వెళ్ళింది శిరీష. సీతమ్మగారికి శిరీష అంటే చాలా అభిమానం. ఇక్కడున్నప్పుడు చాలా ఆప్యాయంగా చూసుకునేది.

శిరీషను ఇంట్లోకి తీసుకెళ్ళింది సీతమ్మ

గారు.

"శిరీషా. నువ్వు వస్తున్నట్లు రాయలేదా?" అడిగింది.

"రాయలేదు పిన్నిగారూ. ఏం ఆయన ఊళ్ళోలేరా?"

"లేకేం, ఉన్నాడు. కానీ అది కూడా ఉంది"

అమాయకురాలైన సీతమ్మకి శిరీష మనసు సున్నితత్వం, గాజులాంటి ఆ హృదయాన్ని పగలకుండా జాగ్రత్తగా మాట్లాడటం ఇవేవీ తెలియవు. తనదైన భోళాధోరణిలో సంభాషణ సాగించింది. ఒక్కసారిగా నిజాల్ని తెలుసుకుని శిరీష షాక్ కాకూడదని ఆవిడ ఆలోచన.

"అదెవరు పిన్నిగారూ?" నిర్ఘాంతపోయి అడిగింది శిరీష.

"అదే... నువ్వు వెళ్ళాక కొన్నాళ్ళు బుద్ధిగానే ఉన్నాడు. మగాడు ఎన్నాళ్ళని మడిగట్టుకుని ఉంటాడు. అదెవరో పరిచయమైందిట. దాన్ని పెళ్ళాడతానని చెప్పి తెచ్చి ఇంట్లోనే పెట్టుకున్నాడు. ముందుగా చెప్పటం మంచిదని చెప్తున్నానమ్మా ఇవన్నీ మామూలే, మగాళ్ళకేం..." సీతమ్మగారు ఇంకా ఏదో చెపుతూనే ఉంది.

శిరీష గుండెలో అగ్నిపర్వతాలు బద్దలయ్యాయి.

మనిషి నిలబడలేక కూలిపోయింది.

నిజమా? భర్త ఇంత ద్రోహం చేస్తాడా?

అయినా లోపల ఏదో ఆశ. సీతమ్మ మాటలు అబద్ధమేమోనని.

వెంటనే ఒక్క దూకున లేచి తన ఇంటి వైపు పరుగెత్తింది.

పడగ్గది కిటికీలు భళ్ళున తెరిచింది.

కర్టెన్ లాగి చూసేసరికి...

లోపల...శిరీష భర్త.. మరొక స్త్రీ... ఒకరి కౌగిలిలో మరొకరు.

శిరీష కళ్ళు చింతనిప్పుల్లా ఎర్రబడ్డాయి.

మనిషి నిలువునా వణికిపోతోంది.

శాంతమూర్తి శిరీషకి అంత కోపం వస్తుందని సీతమ్మగారు కూడా ఊహించలేదు.

శిరీష అరచేత్తో కిటికీ అద్దం పగలగొట్టింది.

శిరీష భర్త... ఆ స్త్రీ ఉలిక్కిపడి లేచారు. శిరీషను చూసి వణుకుతున్నారు.

శిరీష ఒక్కక్షణం అలాగే నిలబడిపోయింది.

ఆమె మనసులో ఏ ఆలోచనల సుడిగుండాలు సుళ్ళు తిరిగాయో గానీ...

వెంటనే వెనుతిరిగింది.

మెల్లగా కానీ నడవని శిరీష... ఒక్క పరుగు తీసింది రైల్వేలైన్ వెంట.

ఎక్స్‌ప్రెస్ రైలు వస్తోంది.

ఒక్క దూకున పట్టాలమీదికి పరుగెత్తింది ఊపుగా.

నడుస్తున్న శిలలా... మృత్యువుని అతి దారుణంగా ఆహ్వానిస్తూ, రైలుకి ఎదురుగా పరుగెత్తింది శిరీష.

ఏం జరిగిందో తెలుసుకునే లోపలే... శిరీష శరీరం ముక్కలైపోయింది.

★ ★ ★

అరిచేతుల్లో మొహం దాచుకుని కూర్చున్న విజయ్ భుజాన్ని సానుభూతిగా తట్టింది అమూల్య.

"అమూల్యా... నాకు ముందే అనిపించింది. అయినా శిరీషని ఎందుకో వెళ్ళొద్దని ఆపలేకపోయాను. నేను వెళ్ళొద్దంటే శిరీష ఆగిపోయి ఉండేది. శిరీష చావుకి మేమే కారణం అనిపిస్తోంది" బాధగా అన్నాడు.

"విజయ్... ఒక్కొక్కసారి మనం ఎంత ఊహించినా, కొన్ని సంఘటనలు జరగకుండా ఆపలేం. ఎంత దుఃఖించినా ఇప్పుడు చేసేదేం లేదు. బాధపడకు" అంది అమూల్య.

ఊహించి కూడా శిరీష చావుని ఆపలేకపోవటం విజయ్ జీర్ణించుకోలేకపోతున్నాడు. అమాయకంగా, మృదువుగా ఉండే శిరీష రూపం అతని కళ్ళముందు ఇంకా కదులుతూనే ఉంది. అయ్యో... ఎంతపని




జరిగింది. కాస్త ధైర్యం రాగానే పూర్తి ఆత్మ విశ్వాసమని భావించి, మోసపోయారు తామంతా. అన్నప్రాసననాడే బిడ్డ ఆవకా యకు పరుగుతీసినట్లు అయింది. ఆత్మహ త్యకు ప్రయత్నించిన వ్యక్తిని కొన్నాళ్ళు కని పెట్టి ఉండటం మంచిదని డాక్టరు చెప్పింది కూడా ఎందుకు గుర్తురాలేదు. అయ్యో అని మనసు మూలిగింది.

★ ★ ★

కాలం ఎప్పుడూ ఒకేలా నడవదు. మిట్ట పల్లాలు లేని జీవితం ఉండదు. ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవరికీ తెలీదు. ఏ నిమిషంలో ఏది జరిగినా ఆశ్చర్యంలేదు.

అమూల్య కుటుంబానికి అలాగే జరి గింది. హఠాత్తుగా వాళ్ళకి సమస్యలమీద సమస్యలు ఎదురయ్యాయి. అమూల్య తండ్రీ, అన్నయ్యా కలిసి వ్యాపారం చేస్తూ ఉండేవాళ్లు. ఉన్నట్లుండి నష్టాలు రావటం మొదలయ్యింది.

అమూల్య అన్నయ్య ఆనంద్ తన మిత్రుడు ఒకతడ్ని భాగస్వామిగా చేర్చుకు న్నాడు. ఆ మిత్రుడు ద్రోహంచేసి, లెక్కలు తప్పుచూపించి నష్టాన్ని చూపించి సొమ్ము స్వాహా చేశాడు. అతను ఆనంద్‌ని అప్పులు తీసుకోమని ప్రోత్సహించి బాగా అప్పులు చేయించాడు. నష్టాలవల్ల అప్పులు తీర్చలేని స్థితి ఏర్పడింది. ఆ భాగస్వామి మిత్రుడు ఇంక ఏమీ దొరకని స్థితిలో వాళ్ళతో తెగ తెంపులు చేసుకున్నాడు. అతను ఆనంద్‌ని కలవటం కూడా పూర్తిగా మానేశాడు.

అప్పులవాళ్ళు ఆనంద్‌మీదా, తండ్రిమీదా ఒత్తిడి తెచ్చారు.

ఒకదాని తర్వాత ఒకటి అన్నీ ప్రతికూ లంగా మారటం మొదలయింది. అప్పులు తీర్చటం కోసం ఆస్తులు తెగనమ్మారు. నిజా నికి ఆస్తి అమ్ముకోవలసిన అగత్యంలేదు. ఒక ఐ.పి. పెట్టి దివాలా తీశామని చెపితే సరిపోయేది. కానీ అమూల్య తండ్రీ, అన్నయ్యా నిజాయితీపరులు. అట్లా చెయ్య కూడదనుకున్నారు. నైతిక విలువలు ముఖ్య మని భావించారు. అప్పులు తిరిగి తీర్చ టమే సరిఅయిన మార్గం అని భావించారు. ఏదో ఒక ఎత్తువేసి అప్పులవాళ్ళను ఒదిలిం చుకోవటం వాళ్ళకు ఇష్టంలేదు.

“మనల్ని నమ్మి అప్పులిచ్చారు. ధర్మమా ర్గాన పోవాలి. న్యాయం వేరు, ధర్మంవేరు. లీగల్‌గా ఆలోచిస్తే మనం ఐ.పి. ఫైల్ చేసి వాళ్ళను వేచి ఉండేట్లు చెయ్యాలి. కానీ ధర్మంగా ఆలోచిస్తే మాటమీద నిలబడి డబ్బు తిరిగి ఇవ్వాలి. అప్పు తీర్చాల్సిన బాధ్యత మనమీద ఉంది. మన భాగ స్వామి మనల్ని మోసంచేసి డబ్బు కాజే శాడు. కానీ అందుకని మనం మనల్ని నమ్మి డబ్బు ఇచ్చిన వాళ్ళని మోసగించకూ డదు కదా” అన్నాడు అమూల్య తండ్రి.

ఐ.పి. ఫైల్ చేస్తే అమూల్య పేరున ఉన్న ఆస్తినీ, ఆమె వదినపేరున ఉన్న ఆస్తినీ తాకాల్సిన అవసరం ఉండేది కాదు. కానీ అప్పులు ఎలాగైనా తీర్చాలన్న తప నతో అన్నీ అమ్మేసి అప్పులు తీర్చారు.

ఇప్పుడిక ఏ ఆస్తీ లేదు. ఒక్క ఇల్లు మాత్రం మిగిలింది. అదీ తాకట్టులో ఉంది. దానిమీద తెచ్చిన అప్పుతోనే బతుకుతు న్నారు.

ఆనంద్ ఏమన్నా కొత్త బిజినెస్ చెయ్యా లని ప్రయత్నిస్తున్నాడు. ఏం చెయ్యాలన్నా డబ్బు కావాలి. అది లేకే బాధలన్నీ.

వాళ్ల పరిస్థితి మారగానే చాలామంది వాళ్ళని తప్పించుకుని తిరగటం మొదలుపె ట్టారు.

అమూల్య విజయ్‌తో తన దుఃఖాన్నీ, భావాలనీ పంచుకునేది.

“విజయ్... లోకులు ఎంత క్రూరులో అనిపిస్తుంది. ఈ జరిగిన నష్టానికంతటికీ మా అన్నయ్య కొడుకుని బాధ్యుడిని చేస్తు న్నారు. వాడు నష్టజాతకుడట. అందుకే మాకీ నష్టాలొచ్చి బికారులమయ్యాముట.




ఎలా మాట్లాడుతున్నారో చూడు" అంది.

విజయ్ మౌనంగా విన్నాడు.

"మా అన్నయ్య నిజాయితీపరుడు. అతను అమాయకుడు కాబట్టి అంతా తన లాంటి వాళ్ళేనని నమ్మి, గుడ్డిగా ఆ భాగస్వామిని నమ్మాడు. అది మా అన్నయ్య తెలివితక్కువ తనం. దానికి ఆ చిన్నపిల్లాడు, వాడేం చేస్తాడు? " అంది అమూల్య.

"అమూల్యా... ఆ విషయం మర్చిపో. లోకం ఏదో ఒకటి అంటూనే ఉంటుంది. మీరు అప్పులు తీర్చి మంచి పని చేశారు. ఆస్తిపోతే పోయింది"

"అవును. ఆ సంతృప్తి ఉంది" అంది అమూల్య. మేనల్లుడిని ఎత్తుకుని వచ్చింది. వాడు ఆమె మెడపట్టుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. అమూల్య పకపక నవ్వుతూ ముక్కుతో ఆ చేతిని రుద్దింది. వాడు కిలకిలమన్నాడు.

"వాడి మొహంలోకి చూస్తే ఎంత ఆనందంగా ఉంటుందో" అంది అమూల్య.

"అవును"

పిల్లలనీ, పువ్వులనీ చూస్తే సంతోషంగా ఉంటుంది" అన్నాడు విజయ్.

కొంతమంది ఆలోచనా విధానం చూస్తే ఆశ్చర్యంగా ఉంటుంది, కోపం వస్తుంది.

"ఇంకా ఆమెనే చేసుకుందామనుకుంటున్నావా? " మొహాన్నే అడిగారు కొందరు.

"ఇంకా అంటే" అతను తిరిగి ప్రశ్నించాడు.

"అంటే... ఇప్పుడు వాళ్ళకేం ఆస్తి లేదుట. దివాలా తీశారుటగా? "

"ఆమె ఆస్తి చూసి ప్రేమించలేదుగా నేను" అన్నాడు విజయ్.

విజయ్ తల్లితండ్రులు కూడా ఇదివరకటిలా అమూల్య గురించి ఉత్సాహంగా మాట్లాడడంలేదు.

"ఇంకా మంచి సంబంధం వస్తుంది నీకు" అంది తల్లి రంగమ్మ.

"నాకు అమూల్య తప్ప మరొకరిని చేసుకునే ఆలోచనేలేదు. ఆ ప్రసక్తేవద్దు"

"మాకు ఇష్టంలేదు. కానీ నీ ఇష్టం ఏదైతే అదే జరిపించడానికి సిద్ధంగా ఉన్నాం" అన్నాడు తండ్రి.

"ఎందుకు ఇష్టంలేదు? " అడిగాడు విజయ్.

రాజారావు డబ్బు మనిషికాదు. అందులోనూ శిరీష మరణం తర్వాత కుంగిపోయి ఉన్నాడు. ఒక అమ్మాయిని చేసుకోవడానికి నిర్ణయించుకుని, ఆ పైన కేవలం డబ్బులేదన్న వంకతో వదులుకునే దుర్మార్గం ఆయనకులేదు. అందుకే ఎందుకు తటపటాయిస్తున్నారో తెలియక అడిగాడు విజయ్.

"ఎందుకంటే... వాళ్ళు దివాలా తీశారు అందరూ అనేదేమిటంటే వాళ్ళకి చాలా చాలా అప్పులున్నాయని. ఈ వ్యాపారస్తులింతే, పైపై మెరుగులు జాస్తి. మనం డబ్బు లేకపోతే లేదంటాం. వాళ్ళు మనలా బయటపడరు. పరపతి పోతుందని భయం వాళ్ళకి. కేవలం పేరువల్ల నడుస్తాయి వాళ్ళ వ్యాపారాలు. సరే ఇంతకీ అందరూ అనేదేంటంటే వాళ్ళు అప్పుల్లో కూరుకుపోయి ఉన్నారని..."

"ఉంటే? "

"ఆ అప్పులవాళ్ళు నీక్కూడా శాంతి లేకుండా చేస్తారేమోనని"

"అలా ఎలా చేస్తారు? "

"అలా అనకు. డబ్బుకోసం ఏమైనా చేస్తారు"

"అలా జరగదు. కానీ ఒక్కటి నాన్నగారూ. ఏదీ నా నిర్ణయాన్ని మార్చలేదు" అన్నాడు విజయ్.

"నీ సంతోషమేగా మాకు కావాల్సింది. నీ ఇష్టం" అన్నాడు రాజారావు.

★ ★ ★

ఆనంద్‌నీ, అతని భార్యనీ చూస్తుంటే విజయ్‌కి ఏదో భయం కలుగుతోంది. ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్లు కనిపిస్తారు. ఇంకెలా కనిపిస్తారు మరి అని

మనసుని సరిపెట్టుకోవాలని చూశాడు. కానీ వాళ్ళ ప్రవర్తనలో ఏదో మార్పు కనిపించడం మొదలుపెట్టింది. ఇద్దరూ మౌనగంభీర ముద్రలోకి జారుకున్నట్లు కనిపించేవాళ్ళు.

ఆనంద్‌కి రోజురోజుకీ తనమీద తనకు నమ్మకం తగ్గి జాలి పెరుగుతోంది. గుడ్డిగా నమ్మి మోసపోయినందుకు బాధపడేవాడు. ఇంక వ్యాపారం చేసే సమర్థత తనలో లేదనే భయం... సమర్థత సంగతి తర్వాత. అసలు మూలధనం ఎలా కూడగట్టుకోవాలన్న బాధా మొదలయ్యాయి. ఉద్యోగ ప్రయత్నాలు కూడా చేశాడు. ఏదీ దొరకలేదు. అంతా తనను చూసి నవ్వుకుంటున్నారేమోననే భావం పట్టి పీడిస్తోంది. పిరికితనం ఆవరించి మనసు బలహీనపడుతోంది.

"ఆనంద్‌గారూ... బాధపడకండి. జీవితంలో మిట్టపల్లాలు ఎవరికీ తప్పవు. మీరు మళ్ళీ నిలదొక్కుకోగలరు. మళ్ళీ పూర్వస్థితికి వచ్చేస్తారు" ఓదార్పుగా అన్నాడు విజయ్.

ఆనంద్ నిట్టూర్చాడు.

"ఇంకేం వస్తాం విజయ్. మేం సర్వనాశనమైపోయాం" అన్నాడు.

"లేదు. కాలం ఎప్పుడూ ఒక్కలా ఉండదు"

"నిజమే. మా పరిస్థితి ఇంకా ఘోరంగా మారబోతోంది విజయ్. ఇంకొన్ని రోజుల్లో ఈ ఇల్లు కూడా అప్పులవాళ్ళ పరమైపోతుంది. మాకేం మిగలదు. నా గురించి నాకేం బాధలేదు. కానీ అమూల్యని చూస్తే మాత్రం గిల్టీగా ఉంటుంది. ఆఖరికి అమూల్య నగలు కూడా అమ్ముకోవలసి వచ్చింది" అన్నాడు.

"దాందేముంది. అసలు నగలనేవి ఇలాంటి పరిస్థితిలో ఉపయోగపడడానికే అని పెద్దలు అంటూ ఉంటారుకదా"

"అవును. కానీ నాకు వాటిమీద హక్కులేదుగా"

"ఎందుకులేదు. ఆమె మీ ఇంట్లో ఒక మనిషి. ఆమె నగలూ, మీ నగలూ అని భేదం ఎందుకు చూపిస్తారు? బాధపడకండి. అంతా మర్చిపోండి. కొత్తజీవితం ప్రారంభించండి"

ఆనంద్ చెమ్మగిల్లిన కళ్ళతో విజయ్‌వైపు చూశాడు. "నువ్వు ఎంత మంచివాడివి విజయ్. నీలాంటి భర్త దొరుకుతున్నందుకు మా అమూల్య చాలా అదృష్టవంతురాలు. నాకిక ఆమె గురించి ఏ చింతాలేదు. మా బాబు సంగతి చూసుకుంటే చాలు" అన్నాడు.

ఆనంద్ ఏ భావంతో అన్నాడో విజయ్‌కి అర్థంకాలేదు. కానీ కొద్దిరోజుల్లోనే బాబుని తిరిగి ఆశ్రమంలో అప్పగించేశారని అమూల్య చెపితే అతను విస్తుపోయాడు.

"నిజంగానా...? " నమ్మలేనట్లు అడిగాడు.

"అవును" అమూల్య కళ్ళల్లోంచి నీళ్ళు కారాయి.

"అదేంటి అమూల్యా? ఎందుకలా చేశారు? "

"ఏమో మరి. ఆ విషయమై ఇంకేం మాట్లాడొద్దని అన్నాడు"

"ఆశ్రమంవాళ్ళు ఒప్పుకున్నారా? "

"ఒప్పుకున్నారు. సెక్యూరిటీగా ముందే కొంత డబ్బు డిపాజిట్ చేశారు. ఆ డబ్బుతో సహా తిరిగి ఒప్పచెప్పారు. ఇంకెవరన్నా వస్తే దత్తత ఇచ్చెయ్యమనీ, లేకపోతే ఆశ్రమంలోనే పెంచి పెద్దచెయ్యమనీ చెప్పారు"

"వాణ్ని విడిచిపెట్టి ఎలా ఉండగలుగుతున్నారసలు? వాడు బాగా అలవాటయిపోలేదూ? "

అమూల్య గట్టిగా ఏడ్చేసింది.

"విజయ్. వాళ్ళు వాడిని విడిచిపెట్టి ఉండలేరు. అన్నయ్య రాత్రంతా నిద్రపోకుండా కూర్చునే ఉంటాడు. వదిన ఏడుస్తూ ఉంటుంది. వాళ్ళకి వాడు ప్రతీక్షణం గుర్తు





వస్తూనే ఉన్నాడు. కానీ మరి ఎందుకలా చేశారో ఏమో? వాడికి మంచి భవిష్యత్తు ఉంది, మనతో ఉంచుకుని వాడి భవిష్యత్తు చెడగొట్టకూడదని అన్నాడు అన్నయ్య. అన్నిటికన్నా వాడిని దూరం చేసుకున్న బాధే వాళ్ళని పీడిస్తోంది. అయినా మరి ఎందుకిలా చేశారో అర్థంకావడంలేదు"

విజయ్ జాలిగా చూడడంతప్ప మరేం చేయలేకపోయాడు.



పొద్దున్నే బలరాం వచ్చాడు.

"విజయ్... ఎంతపని జరిగిందో తెలుసా?" అన్నాడు. అతని మొహంలో ఆందోళన, విషాదం చూసి విజయ్‌కి భయం వేసింది.

"ఏమైంది? ఏం జరిగింది?" భయంగా చూస్తూ అడిగాడు.

"అమూల్యా అన్నావదినా..."

"ఊ... ఏమైంది?" కంగారుగా ప్రశ్నించాడు విజయ్.

"ఇద్దరూ కూల్‌డ్రింక్‌లో విషం కలిపి తాగారుట..."

బలరాం ఇంకా పూర్తిచెయ్యనేలేదు. విజయ్ ఒక్కసారిగా స్తంభించిపోయాడు. ఏదో తెలియని భయం చుట్టుముట్టేసింది. ఇంకేమన్నా జరిగిందేమోనని వణికిపోయాడు.

"ఇప్పుడెక్కడున్నారు? హాస్పిటల్‌లోనా? పద చూద్దాం" అన్నాడు బయల్దేరుతూ.

"విజయ్ వాళ్ళిద్దరూ... నీకెలా చెప్పాలో అర్థంకావడంలేదు... విజయ్... వాళ్ళు చచ్చిపోయారు" బలరాం ఎటో చూస్తూ చెప్పాడు.

"ఆ..." ఊపిరి పీల్చుకోవడం కూడా మర్చిపోయి, షాక్‌లో అట్లాగే నిలబడిపోయాడు విజయ్.

"అవును విజయ్. ఉస్మానియా హాస్పిటల్‌లో శవాలున్నాయిట. పద వెళ్దాం" బలరాం విజయ్ భుజంమీద చెయ్యివేసి ధైర్యం చెబుతూ అన్నాడు.

విజయ్‌కి ఒళ్ళంతా చెమటలు పట్టాయి. ఆనంద్, శారదా అతని కళ్ళముందు కదులుతున్నారు. ఏం చెయ్యాలో ఏమీ పాలుపోని అయోమయం. మనసు మొద్దుబారిపోయింది.

ఇద్దరూ ఆటోలో హాస్పిటల్‌కి వెళ్ళారు.

అమూల్య కుమిలికుమిలి ఏడుస్తోంది.

పులిమీద పుట్రలా ఈ శోకం చాలదన్నట్లు... అమూల్య నాన్నగారికి పెరాలిసిస్ స్ట్రోక్ వచ్చింది. ఆయన్నీ ఇదే హాస్పిటల్‌లో చేర్చారుట.

అమూల్య చుట్టూ కొందరు బంధువులు ఉన్నారు. వీళ్ళని చూడగానే అమూల్య బావురుమంది.

విజయ్‌కి అమూల్యని గుండెకి హత్తుకుని ఓదార్చాలనిపించింది. కానీ లోకం? తను ఆమెకి పరాయివాడు. ఏమీకాడు. ఆమె చుట్టూ చేరిన బంధువులు ఓదారుస్తున్నారు. అమూల్య వెక్కివెక్కి ఏడుస్తోంది.

విజయ్ ఎట్లాగో మనుషుల్ని దాటుకుంటూ ఆమె పక్కకు చేరి నిలబడ్డాడు. దానికే ఆమె బంధువులు ఎవరితను అన్నట్లు చూస్తున్నారు.

"అమూల్య క్లాస్‌మేట్స్. వాళ్ళ పక్కింటి

వాళ్ళు ఆ అబ్బాయికి బంధువులు. వాళ్ళు ఫోన్ చేసినట్లున్నారు" బలరాంని చూసి ఒక బంధువు అన్నాడు.

"అట్లాగా"

"అమూల్యా... ప్లీజ్. బాధపడకు. ఏడవకు" విజయ్ ఓదార్చాడు. తన ప్రయత్నం తనకే అర్థంలేనిదిగా కనిపించింది. అమూల్యకి అన్నయ్యన్నా, తండ్రన్నా ఉన్న అనుబంధం అతనికి తెలియందికాదు.

"విజయ్ అన్నయ్య ఇట్లా చేస్తాడని నేనెంతమాత్రం ఊహించలేదు. అయ్యో" అమూల్య మళ్ళీ వెక్కివెక్కి ఏడ్చింది. ఆమె శరీరం మొత్తం వణికిపోతోంది.

"అమూల్యా... ఊరుకో"

"డాడీ షాక్ అయిపోయారు. ఆయనన్నా దక్కుతారోలేదో, నాకు భయంగా ఉంది" అమూల్య వెక్కుతూ అంది.

"మంచిమందులు ఉన్నాయి. ఏం కాదు. భయపడకు. నువ్వు కూడా దిగులుపడి బేజారయితే ఇంక ఆయన ఏమవుతారు చెప్పు. నువ్వు ధైర్యంగా ఉండి ఆయన్ని ఓదార్చాలి. అంతకన్నా గత్యంతరంలేదు. గుండె రాయి చేసుకుని ఆయన సంగతి చూడు. ఇప్పుడు ధైర్యం తెచ్చుకోకుంటే ఎలా? నీ మనసు చిక్కబరచుకోవడం చాలా కష్టం. నిజమే... అయినాసరే, తప్పదు. కన్నీళ్ళు తుడుచుకో, ఏడవకు. ఈ సమయంలో నువ్వు అధైర్యపడితే తర్వాత ఎంత బాధపడినా ప్రయోజనంలేదు. జరిగిపోయినదానికి నువ్వేం చెయ్యలేవు. కానీ కనీసం జరగాల్సినదాని సంగతి చూడు. ధైర్యంగా ఉండు" అన్నాడు విజయ్. తనేనా ఇంత చెప్పింది అని అతనికే ఆశ్చర్యం కలిగింది.

అమూల్య తల ఊపింది.

శవాలను చూడడానికి వెళ్ళారు బలరాం, విజయ్.

తెల్లటి బట్ట కప్పిన శవాలు. జీవితం నీటిబుడగలాంటిది. ఎప్పుడు పేలిపోతుందో తెలీదు. ఏ క్షణాన ఏం జరుగుతుందో తెలీదు అని తెలియచెపుతున్నట్టు...

ఎన్నోసార్లు పేపర్లలో చదివాడు. దివాలా తీసి, సర్వస్వం కోల్పోయి, ఇంకేదారీ కనిపించక, నిరాశతో, నిస్పృహతో ఆత్మహత్య చేసుకున్న వార్తలు. కానీ కళ్ళెదురుగా ఆత్మీయులను ఆ స్థితిలో చూసి చలించిపోయాడు విజయ్.

ఎందుకు జరిగింది ఇలా? అసలు జీవితం అంటే ఏమిటి? ఏవో తాపత్రయాలు, ఏవో ఆశలు. చివరికి చావు. ఇంతేనా... జీవితం అంటే? చావేనా? చివరకు జరిగేదీ, చివరికి మిగిలేదీ అదే కాబట్టి చావు ఒక్కటే సత్యమూ, వాస్తవమూనా? మిగిలిన జీవితమంతా ఒక కలా? వేదాంతం ఆవరించింది మనసుని.

శవాల్ని చూస్తూ నిలబడిపోయాడు. కొద్దిసేపట్లో వాస్తవంలోకి వచ్చాడు. వాళ్ళు ఆత్మహత్య చేసుకుంటారేమోనని ఎందుకు ఊహించలేకపోయానని తనను తానే నిందించుకున్నాడు. ఒక్కసారిగా జీవితం తల్లకిందయితే మనిషి ఎంత తల్లడిల్లిపోతాడు. ఏదో ఒక ఆసరాకోసం వెర్రిగా చూస్తాడు. ఏ ఆసరా దొరకని స్థితిలో నిండా మునిగిపోయాక ఇంక తమని గట్టెక్కించే ఏకైకమార్గం మృత్యువేనని అనుకుంటారు. తనకివన్నీ తెలుసు. అయినా కూడా వాళ్ళు ఇట్లా చేస్తారని ఊహించలేకపోయాడు. వాళ్ళ మనసులో ఈ ఆలోచన ఉందని ఏమాత్రం కనిపెట్టినా, వాళ్ళని కాస్త కనిపెట్టి మసలుకోమని అమూల్యని హెచ్చరించి ఉండేవాడు. ఆఖరికి అమూల్యా కూడా తెలుసుకోలేనంత నిగూఢంగా ప్రవర్తించారు వాళ్ళు. మౌనముద్రలో ఉండిపోయారు, ఏదో షాక్‌లో ఉన్నారు, కొన్నాళ్ళయ్యాక తేరుకుంటారు అనుకున్నాడు కానీ, ఇంత ఘోరం చేస్తారని విజయ్ కలలో కూడా ఊహించలేదు.

ఇప్పుడు తల్చుకుంటే తనొక పెద్ద

మూర్ఖుడినని అనిపిస్తోంది. శిరీషకోసం డాక్టర్ని కలిసినప్పుడు, ఆత్మహత్యలకు ప్రేరే పించే సంఘటనల గురించి ఎన్నోసార్లు చర్చించటం జరిగింది. అదీగాక ఎన్ని పుస్త కాలు, ఎన్ని ఆర్టికల్స్ చదివాడు. అంతా వృధా అయింది. అటు శిరీషనూ కాపాడు కోలేకపోయారు. ఇటు ఆనంద్, శారదలనూ రక్షించుకోలేకపోయారు.

అయ్యో... ఎంత పని జరిగింది. కళ్ళ వెంట నీళ్ళు కారుస్తూ ఉండిపోయాడు విజయ్.

"విజయ్... వెళ్దామా" బలరామ్ అతని భుజంమీద చేయివేసి అన్నాడు.

మౌనంగా కదిలాడు విజయ్. ఇద్దరూ అమూల్యా దగ్గరకి తిరిగి వచ్చారు.

"నాన్నగారిని చూస్తారా" అమూల్యా అడి గింది.

"ఊ..."

అమూల్యా ఆయన ఉన్న వార్డ్‌లోకి తీసు కెళ్ళింది.

"దూరంనుంచి చూడనిస్తారు. లోపలకు పోనివ్వరు" అంది.

వార్డ్‌లో మంచంమీద కళ్ళు మూసుకుని దీనావస్థలో ఉన్న ఆయన్ని చూడగానే విజయ్ గుండె బద్దలైంది. అమూల్యకి కనీసం ఆయనన్నా దక్కుతాడా అని భయం వేసింది.

"డాడీ జాగ్రత్త. నేను చెప్పింది మర్చి పోకు" అన్నాడు, విజయ్.

అమూల్యా తల ఊపింది.

బంధువులంతా ఏదో చర్చించుకుంటు న్నారు. బలరామ్ అక్కడే ఉన్నాడు.

"ఏమిటి? దేని గురించి..." అడిగాడు విజయ్.

"ఏముంది. అంత్యక్రియలు ఎవరు చేయాలని" మెల్లగా చెవిలో చెప్పాడు బల రామ్.

"దానికేముంది. ఎవరన్నా చెయ్యవచ్చు"

"హుష్. నీకు తెలీదు. ఇక్కడ అంత్యక్రి యలంటే చాలా తతంగం ఉంటుంది. పాడె కట్టడం, మొయ్యటం, తల కొరివిపెట్టటం... కొరివి పెట్టటం కొడుకు ఉంటే కొడుకు చేస్తాడు. ఎవరూ లేని వీళ్ళు, ఎవర్నన్నా చూసుకోవాలి. వీళ్ళకి నమ్మకాలు ఎక్కువ. శ్మశానానికి వెళ్ళటానికీ, తలకొరివి పెట్టటా నికీ, అన్నిటికీ ఏవో అడ్డంకులూ, మూఢన మ్మకాలు. ఎవరికి వాళ్ళు తప్పించుకుందా మని చూస్తారు" బలరామ్ గుసగుసగా అన్నాడు.

"మరి ఎలా? " విజయ్ ఆందోళనగా అడి గాడు. తనే అవన్నీ చేసేద్దాం అనిపించింది అతనికి. కానీ తనని చెయ్యనివ్వరు. ఇంట్లో ఇంకో మొగాడు లేడు చెయ్యటానికి. ఎట్లాగ మరి?

అతని మొహం భయంగా మారింది. ఈ పరిస్థితులలో ఏం చేస్తే బావుంటుంది. తనకి వీళ్ళ ఆచారాలూ, వ్యవహారాలూ బొత్తిగా తెలియదు.

"పెళ్ళిలో అయినా ఫర్వాలేదుగానీ చావులో మాత్రం సంప్రదాయాలు పాటి స్తారు. ఒక కులమని కాదు, ఎవరైనా అంతే. చావు అంటేనే అదొక మాదిరి వాతావరణం. ప్రతివాళ్ళూ కాస్త పిరికిగా ఉంటారు. ఎన్ని అభ్యుదయ భావాలున్నా చావు దగ్గరికి రాగానే పాత ఆచారాలే పాటి స్తారు. అదీగాకుండా అది ఒక వ్యక్తికి చేసే ఆఖరి క్రియ. వాటిల్లో మన భావాలు ఎందుకు రుద్దటం, సంప్రదాయబద్ధంగా చేసేద్దాం అనిపిస్తుంది మనిషికి. అందుకనే పెళ్ళిలోనైనా కొన్ని ఆచారాలు మారుతున్నా యిగానీ, చావుమాత్రం ఇంకా సంప్రదాయ బద్ధంగానే జరుగుతోంది" బలరామ్ మెల్లగా అన్నాడు.

"మరిప్పుడెలా? " విజయ్ భయంగా చూశాడు.

"నువ్వేం భయపడకు. అన్ని ఆచారాలకీ మినహాయింపులు ఉండనే ఉంటాయి. డబ్బు ఇస్తే అన్నీ సర్దుబాటు అయిపో

తాయి. డబ్బు తీసుకుని ఇవన్నీ చేసేందుకు బోలెడుమంది సిద్ధంగా ఉంటారు" అన్నాడు బలరాం.

అమూల్య ఆరోజంతా ఏం తినలేదు. ఆమెతో పాటు విజయ్... అట్లాగే, ఎండే డొక్కతో దిగులుగా దుఃఖంగా.

చివరికి బలరామ్ చెప్పినట్లే జరిగింది. డబ్బు ఇచ్చి ఎవర్నో కుదిర్చారు. ఒక వ్యాన్‌లో శవాలు చేర్చారు.

ఊరికే నిలబడటం, ఏదన్నా సాయం కావాలా అని అడగటం తప్ప విజయ్ ఇంకేం చెయ్యలేకపోయాడు. అక్కడ అతను పూర్తిగా అపరిచితుడు, అన్నివిధాలా పరాయివాడు.

చితికి నిప్పుపెడుతుంటే ఆ చితి వెలిగిస్తున్న మనిషి విజయ్‌కి దేవుడిలాగే కనిపించాడు. అతనే లేకుంటే ఈ కార్యక్రమం ఎట్లా జరిగేదా అని భయం వేసింది.

★ ★ ★

అమూల్య విజయ్ చెప్పింది పాటించింది. తన దుఃఖాన్నంతా దిగమింగుకుంది.

తండ్రికి ఆసరాగా నిలబడింది.

కొడుకూ, కోడలూ చితిలో బూడిద అయినరోజు ఆయనకి ఇంకా స్పృహరాలేదు. కోమాలోనే ఉన్నాడు. ఆ మర్నాడు ఒక్కసారి కాస్త మనుషులవైపు చూశాడు. డాక్టర్లు బోలెడంత కష్టపడి చివరికి తెలివివచ్చేట్లు చెయ్యగలిగారు.

తెలివిరాగానే ఆయన పక్కనే నిలబడ్డ అమూల్యని గమనించాడు. జరిగింది తల్చుకుని ఆయన గుండె మళ్ళీ బద్దలైంది. భోరుమని విలపించాడు.

అమూల్యకి ఎంత ఆపుకున్నా ఏడుపు ఆగలేదు. తనూ భోరుమంది. అమూల్య ఏడుపు చూశాక ఆయనలో పితృహృదయం పెల్లుబికింది.

"అమూల్యా! ఏడవకు. ఇన్నాళ్లనుండీ ఇక్కడే ఉన్నావా? ఇంటికి వెళ్లలేదా?"

"లేదు"

"అన్నం కూడా తినలేదా? చిక్కి సగమయ్యావు."

"మీరు రెస్ట్ తీసుకోండి" డాక్టర్లు హెచ్చరించారు.

అమూల్య గది బయట వరండాలో కూర్చుంది.

ఆ తర్వాత ఆయనకు మెల్లగా అర్థమయింది.

జరిగినదానికి తను ఏమీ చెయ్యలేడు. తను ఇట్లా ఉంటే అమూల్య మరీ భయపడుతుంది. తను ధైర్యం తెచ్చుకోవాలి.

ఆ విధంగా ఆ తండ్రీ కూతుళ్లు ఒకరికోసం మరొకరు లేని ధైర్యం నటిస్తూ ఒకళ్లు బాధ పడతారని మరొకళ్లు బాధ పడకుండా ఉన్నట్లు ప్రవర్తిస్తూ.... ఆ దుఃఖంలోంచి ఒకళ్లనొకళ్లు బయటపడేయాలని ప్రయత్నిస్తూ....

కృతకృత్యులు కాలేకపోయినా కనీసం అయినట్లు కనిపించారు. చాటున ఎవరికి వారు భోరుమని ఏడ్చేవాళ్లు.

పరిస్థితులు మనిషినీ, మనిషి నమ్మకాలనీ మార్చేస్తాయి. విజయ్ తన జీవితంలో చాలామంది రకరకాలుగా మారిపోవటం చూశాడు. దైవభక్తులు నాస్తికులవటం, నాస్తికులు భక్తులవటం. మంచివాళ్ళు అవినీతి పరులుగా, అవినీతిపరులు మంచివాళ్ళుగా. కొన్ని సంఘటనలవల్ల మనిషి దృక్పథంలో మార్పు రావచ్చు

మనిషి ఏదన్నా భరింపరాని కష్టాన్ని ఎదుర్కొంటున్నప్పుడు అతనిలో ధైర్యం, బలం తగ్గిపోతాయి. దుర్బలుడైపోతాడు. అప్పటివరకూ దృఢంగా ఉన్న మనసు పట్టు సడలిపోతుంది. శారీరకంగా కూడా దుర్బలుడై ఇంకొకరిమీద ఆధారపడాల్సిన స్థితికి వచ్చిన అమూల్య తండ్రి ఎవరేం చెప్పినా నమ్మే స్థితికి వచ్చేశాడు. ఒక్కసారిగా సర్వస్వం కోల్పోయిన మనిషి ఆయన. ఆ పరిస్థితులలో కాస్త మంచివాళ్ళెవరన్నా ఉండి ధైర్యం చెపితే మనిషి శారీరక, మాన




# ఏరిన ముత్యాలు

★ ఏదైనా ఒక నిర్దిష్ట లక్ష్యానికి ఉపయోగపడని అపార విజ్ఞానం తో నిండిన బుర్ర నిరుపయోగమే.

–ఒకసూక్తి

★ నిషేధించిన ప్రతి పుస్తకంలోనూ ప్రపంచానికి కావలసిన విజ్ఞానం ఏదో ఉందన్నమాట.

– ఎమర్సన్

★ పుస్తకాలు ఆత్మకు టానిక్కులవంటివి.

– స్వామీ వివేకానంద

★ ప్రపంచంలో రెండే రెండు ఆయుధాలున్నాయి. ఒకటి కత్తి. మరొకటి కలం.

– నెపోలియన్

★ ప్రజలకు నేనూ ఏదైనా సేవ చేస్తే అది సహనంతో ఆలోచించడం వల్లనే.

– న్యూటన్

★ దుర్బలమైన శరీరం బుద్ధిని బలహీనపరుస్తుంది.

– రూసో

★ జూదమూ, వాదమూ వేదనను కలిగిస్తాయి.

– అవ్వయ్యార్

★ సరైన వ్యాయామం ఉంటే మనసు, శరీరం రెండూ అభివృద్ధి చెందుతాయి.

– ఇ.ఇ.గ్రీన్

★ క్రీడలకు టైం లేనివారు రోగాలకు టైం ఇవ్వవలసి వస్తుంది.

–జాన్ వనమకర్

★ అన్ని మతాలను సహించగలిగేదే సర్వోత్తమమైన మతం.

– మదాం–డి.గిరార్జిన్

★ ప్రేమ గలవాడే పెద్ద బోధకుడు.

– స్పానిష్ సామెత

★ చెడును ఉపేక్షించినవాడు మంచిని నిర్లక్ష్యం చేస్తున్నాడన్నమాట.

– టాల్‌స్టాయ్

★ ఒక పిచ్చివాని చేతిలోని తుపాకీ గుండుతో నాకు మరణమే సంభవిస్తే నేను నవ్వుతూ దానిని స్వీకరిస్తాను.

– గాంధీ

★ పొట్టకోసం కష్టపడి పని చేయాలి. అది మానవ కర్తవ్యం. అలా చేయనివారు దొంగలు.

– గాంధీ

★ ఒక్క 'రవ్వ' జ్వాలను రగిలిస్తుంది.

– లెనిన్

సేకరణ: టి.తిప్పారెడ్డి

సిక బలాల్ని తిరిగి పుంజుకోగలిగే వాడే.

కానీ ఆయనకి అట్లాంటివాళ్ళు బంధువ ర్గంలో లేరు.

బేలతనం, మానసిక దుర్బలత్వం ఆయ నకి లేవు. ఉక్కుమనిషి అని బంధువుల్లో పేరుండేది. అట్లాంటి మనిషి కూడా పరిస్థి తులకు తట్టుకోలేక ఒక్కసారిగా పిడుగుపడ్డ మనిషిలా అయిపోయాడు.

అట్లాంటి స్థితిలో హితులూ, సన్నిహి తులూ అని చెప్పుకునేవాళ్ళు ఆయనమీద పట్టు సాధించారు.

"చూడు... మేం చెపితే విన్నావు కాదు. ఎవడ్నో తెచ్చుకుని పెంచుకున్నావు. వాడిది ఏ నక్షత్రమో, ఏ నష్టజాతకుడో. వాడి ప్రభావంవల్ల మీ కుటుంబం మొత్తం నాశనం అయింది. మనవాళ్ళు ఈ ఆచారా లవీ ఊరికే పెట్టారా? అన్నిటికీ ఏదో అర్థం, కారణం ఉంటుంది. మూఢనమ్మకా లని తీసిపారెయ్యకూడదు. కాస్త జాతకా లవీ చూసి తెచ్చుకుంటే, ఆ ప్రభావంతో మీరందరూ కూడా సుఖంగా ఉండేవాళ్ళు. బిడ్డొచ్చిన వేళా, గొడ్డొచ్చినవేళా అంటారు తెలీదా"

"మనం లేవనుకున్నంత మాత్రాన లేకుండా పోతాయా? వాటి ప్రభావం అవి చూపిస్తూనే ఉంటాయి"

ఇవన్నీ చెప్పి, చెప్పి ఆయన్ని ఊదరగొట్టే శారు.

ఆయన్ని పూర్తిగా మార్చేశారు.

ఇప్పుడాయనలో హేతువాదం, తర్కం అన్నీ మాయమయ్యాయి. ఇప్పుడు ఆయన ఏ పని చెయ్యాలన్నా పదిసార్లు ఆలోచిస్తు న్నాడు. ఆరోజు తిథి, వారం, నక్షత్రం, రాహుకాలం, యమగండం అన్నీ చూసి పని మొదలుపెడుతున్నాడు.

గ్రహశాంతి అని బోలెడు తతంగం జరి పించాడు.

తాయెత్తులు, యంత్రాలు...

తను చూస్తున్నది ఆ మనిషినేనా అని విజయ్‌కి ఆశ్చర్యం కలుగుతోంది.

ఆయనకి ఇప్పుడు ఈ విషయాల్లో ఒక సలహాసంఘం ఏర్పడింది. అన్నిటికీ వాళ్ళ సలహా తీసుకుంటున్నాడు. సొంతంగా నిర్ణ యాలు చెయ్యలేనని భయం ఆయనలో గాఢంగా ఏర్పడిపోయింది.

"అమూల్య వాళ్ళ క్లాస్‌మేట్ ఆ అబ్బాయి ఎవరో ఊరికే వచ్చిపోతుంటాడు చూడు... అతనితో చాలా క్లోజ్‌గా ఉంటున్నట్లుంది" అందులో ఒకతను అడిగాడు ఒకసారి.

"విజయ్... అతన్ని పెళ్ళిచేసుకోవాలను కుంటున్నది" చెప్పాడు ఆయన.

అంతే... బాంబు పేలినట్లయింది. వెంటనే శ్మశాననిశ్శబ్దం.

"మన కులం కాదు కదూ"

"కాదు" ఆయన విజయ్ కులం చెప్పాడు.

"నీకేమన్నా బుద్ధుందా? ఆచారాలు మంటగలుపుతావా? ఒకసారి చేసిందానికి ఎంత శిక్షపడిందో చూశావుగా. మళ్ళీ మళ్ళీ అనాచారం చేస్తావా? " ఇంకొకాయన అరి చాడు.

"ఏం చెయ్యమంటావు మరి? " దీనంగా అడిగాడు అమూల్య తండ్రి.

"ఏం చెయ్యటమేమిటి? వెంటనే దానికి మన వాళ్ళల్లోనే ఎవర్నో ఒకర్ని చూసి పెళ్ళిచేసి పారెయ్యి" సలహా ఇచ్చారు.

"ఒప్పుకోకపోతే? "

"చచ్చిపోతానని బెదిరించు. ఎందుకు ఒప్పుకోదు. చచ్చినట్లు ఒప్పుకుంటుంది"

"కులం కానివాడ్ని చేసుకుంటానం టుందా? ఎంత అపచారం? మహాపాపం. దేవుడు దీన్ని సహిస్తాడా? "

"నువ్వు ఊరుకోకు. ఎట్లాగయినా దాన్ని ఒప్పించి పెళ్ళిచేసెయ్యి"

నచ్చచెప్పి వాళ్ళు నిష్క్రమించారు.

అమూల్య తండ్రి శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు. ఆయనకి ఏం చెయ్యాలో అర్థంకావటంలేదు. వాళ్ళ మాటలు అక్షరస త్యాలని ఆయన పూర్తిగా నమ్ముతున్నాడు.




కానీ ఆయనకి విజయ్ అంటే గౌరవం, ప్రేమా ఉన్నాయి. అమూల్య అంటే ప్రేమా, ఆపేక్షా ఉన్నాయి. వాళ్ళని బెదిరించలేదు, విడదియ్యలేదు. అట్లాగని వాళ్ళ పెళ్ళి జరిపించటానికీ ఇష్టంలేదు.

ఆయన చచ్చిపోతానని బెదిరించదల్చుకోలేదు. ఆ బెదిరింపు మాత్రం వదిలిపెట్టి, మిగతా అంతా ఇద్దర్నీ కూర్చోబెట్టి వివరించదల్చుకున్నాడు.

వాళ్ళు వింటే సరేసరి...

లేకపోతే...

ఆయన నిజంగానే చచ్చిపోదల్చుకున్నాడు.

శారీరకంగా, మానసికంగా పూర్తిగా బలహీనుడైపోయాడాయన.

అమూల్య విజయ్‌ని పెళ్ళి చేసుకుంటే ఏదో అనర్థం, అరిష్టం తప్పకుండా జరుగుతుంది, అసలు అట్లా చేసుకోవటం గొప్ప అపచారం అని పూర్తిగా నమ్మాడు.

ఇవన్నీ తన గుండె తట్టుకోలేదు. చావలేక బతకలేక చచ్చే చావు ఎందుకు?

కొడుకూ, కోడలూ ఎంతో భవిష్యత్తు ఉన్నవాళ్ళు, చిన్నవాళ్ళు, వాళ్ళే ప్రాణాల్ని తృణప్రాయంగా వదిలిపారేస్తే, ముసలివాడు తనకెందుకు భయం? ఏం చేసుకుని ఈ బతుకుమీద ఆశ?

హాయిగా పురుగులమందు తిని చచ్చిపోతే సరి. తన పనైపోతుంది.

ఇంక సాహసించి పెళ్ళి చేసుకున్న అమూల్య, విజయ్‌లు వాళ్ళ పాట్లు వాళ్ళు పడతారు. తనకి మాత్రం ఇంక ఏ కష్టాలూ చూసే ఓపికలేదు. హితుల్నీ, బంధువుల్నీ ఎదిరించి నిల్చే సాహసంలేదు.

అమూల్య తన మాట వినని పక్షంలో తను చచ్చిపోవాలి. అంతే... ఆయన గట్టి నిర్ణయం తీసుకుని, పురుగుల మందుకూడా కొని తెచ్చుకున్నాడు.

అమూల్య ఇదంతా గమనిస్తూనే ఉంది. ఆయన డైరీ చదివి అంతా అర్థమైపోయింది ఆమెకు. ఆయన చాటుగా కొనితెచ్చుకున్న పురుగులమందు చూసి ఆమె గుండె బద్దలైపోయింది.

★ ★ ★

"విజయ్... ఇప్పుడు చెప్పు నేనేం చెయ్యాలి?" అమూల్య అంతా చెప్పి ఏడుస్తూ ప్రశ్నించింది.

విజయ్ స్థాణువులా నిలబడ్డాడు.

అమూల్య తన భార్య అవుతుందని ఎన్నో కలలు కన్నాడు. తమ భవిష్యత్తు గురించి ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు.

అవన్నీ కల్లలై... వాస్తవం నిప్పులా కాలుస్తుంటే, ఆ నిప్పుల్లో నిలవలేక, బయటపడే మార్గంలేక, బాధతో విలవిల్లాడాడు.

అమూల్య ఏడుస్తోంది.

ఏడవను కూడా లేని విజయ్ గుండె మరీ భారమైపోతోంది. ఏ క్షణాన్నైనా బద్దలయేట్లు ఉంది.

"నేనేం చెయ్యాలి విజయ్" అమూల్య వెక్కుతూ అడుగుతోంది.

విజయ్ శూన్యంలోకి చూస్తున్నాడు. ఏం చెయ్యాలి?

ఒకపక్క తమ భవిష్యత్తు... బంగారు కలలు, సుందర స్వప్నాలు సాకారమై నిలవబోతుంటే...

తమ ఆనందం కోసం, తమ పెళ్ళికోసం, ఒక నిండుప్రాణాన్ని, ప్రాణానికి ప్రాణంగా పెంచి పెద్దచేసిన ఒక తండ్రి ప్రాణాన్ని, చిన్నప్పుడే తల్లిపోతే బిడ్డ సుఖంకోసం మళ్ళీ పెళ్ళి కూడా చేసుకోకుండా, సంసార సుఖాన్ని కూడా త్యజించి, కూతురి భవిష్యత్తే ప్రాణంగా నిలిచిన తండ్రి ప్రాణాన్ని బలి తీసుకోవాలా?

దేవుడా! నాకెందుకీ పరీక్ష? అతను మౌనంగా ఏడ్చాడు. కన్నీళ్లను గుండెలోనే దిగమింగి, కంఠం రుద్ధమైపోతుంటే కుమిలి కుమిలి ఏడ్చాడు.

ఒకవైపు ప్రాణానికి ప్రాణమైన అమూల్య.



మరోవైపు ఆమె తండ్రి ప్రాణం.

అతనికి మతిపోయినట్లు అనిపిస్తోంది. ఒకవైపు చిన్నప్పట్నుంచీ నేర్చుకున్న సూక్తులూ, నీతిపాఠాలూ అమూల్యని మర్చిపొమ్మని ప్రేరేపిస్తుంటే, మరోవైపు అతని లోని ప్రేమికుడు నువ్వు అమూల్యని ఎంత మాత్రం పోగొట్టుకోవద్దని రొద పెడుతుంటే...

అతను పిచ్చివాడే అయ్యాడు.

చాలాసేపు నిశ్శబ్దం... భయంకర నిశ్శబ్దం. చివరికి ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ విజయ్ స్వరం.

"అమూల్యా... నువ్వు మీ డాడీ చెప్పినట్లు చెయ్యి" ఆ మాటలు అనటానికి అతనెంత కష్టపడ్డాడో వణుకుతున్న అతని స్వరం, కంపిస్తున్న అతని శరీరం తెలిపాయి.

అమూల్య నిశ్చేష్టురాలైంది.

"విజయ్" అంది. ఒక్క పిలుపులో వంద ప్రశ్నలు.

"అవును అమూల్యా. అంతకన్నా గత్యంతరంలేదు. ఆత్మీయులని పోగొట్టుకున్న బాధేంటో మన ఇద్దరికీ తెలుసు. ఇంక ఆ బాధ తిరిగి అనుభవించేశక్తి మనకు లేదు. మన ఆనందంకోసం ఒక నిండుప్రాణం పోతుంటే చూసి ఊరుకునే కర్కశ హృదయం మనకి లేదు. ఈ పరిస్థితి చూస్తుంటే ఆయన మారి మనల్ని ఆశీర్వదించే ప్రసక్తి లేదు. పోనియ్యి అమూల్యా, మనకి అదృష్టంలేదు. అంతే"

"విజయ్" వణుకుతూ అంది అమూల్య. ఆమెకి కూడా అంతకన్నా గత్యంతరం కనబడటంలేదు. అట్లాగని ఆ పరిస్థితిని ఎదుర్కునే ధైర్యమూ లేదు.

"మన సుఖంకోసం ఆయన్ని బలి చెయ్యలేం"

"విజయ్... నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. నిన్ను తప్ప ఎవళ్ళనీ భర్తగా అంగీకరించే స్థితిలోలేను. పోనీ విజయ్. నాకింకో ఆలోచన తడుతోంది"

"ఏమిటది? "

"నిన్ను పెళ్ళి చేసుకుని మా డాడీని బాధ పెట్టకుండా, ఇంకొకరిని చేసుకుని నన్ను నేను బాధపెట్టుకోకుండా నేనే ఆత్మహత్య చేసుకుని చచ్చిపోతే..."

విజయ్ అదిరిపడ్డాడు.

"అమూల్యా... అంతపని చెయ్యకు. ప్లీజ్ ఆలోచించు. అసలే కృంగిపోయి ఉన్న మీ నాన్నగారు నువ్వు ఆ పనిచేస్తే ఏమైపోతాడో ఆలోచించు. నీ కోసం ఇంత చేసిన మీ డాడీకి నువ్వు ఇచ్చే మూల్యం ఇదేనా? ఈ ముసలి వయసులో ఆయనకి అంత శిక్ష వేస్తావా? "

అమూల్య భోరుమంది.

"విజయ్... మరేం చెయ్యను. నా మనసు మనసులో లేదు. ఇన్ని జరుగుతున్నా నా గుండె ఎందుకు ఆగిపోవటం లేదు? నాకెందుకు పిచ్చెక్కటంలేదు? ఇట్లా బతికేకన్నా చచ్చిపోవటమో, పిచ్చెక్కటమో మంచిది"

"అమూల్యా. ఆలోచించు. ప్లీజ్. నా కోసం, మీ నాన్నగారి కోసం నువ్వు బతకాలి. నవ్వుతూ, హాయిగా బతకాలి"

"ఎట్లా? నావల్ల కాదు"

"నీకు దృఢ సంకల్పం ఉండాలి. అప్పుడు అన్నీ సంభవమే. గతం మర్చిపోయి, కొత్త జీవితం ప్రారంభించు"

అమూల్య తల అడ్డంగా ఊపింది.

"అమూల్యా. మీ నాన్నగారి రుణం ఎట్లా తీర్చుకోవాలో తెలియటంలేదని ఎప్పుడూ చెపుతూండేదానివికదూ. మరిప్పుడు ఆయన చెప్పినట్లు చేసి ఆ రుణం తీర్చుకో. నన్ను మర్చిపో"

అమూల్య వెక్కివెక్కి ఏడుస్తోంది.

అతికష్టంతో తననితాను అదుపు చేసుకున్నాడు విజయ్. "నన్ను క్షమించు అమూల్యా"

అతని గుండె మౌనంగా క్షోభించింది.




తన మాటలన్నీ గుండెలోనే అణిచేసుకున్నాడు. నిశ్శబ్దంగా నిలబడ్డాడు. కన్నీళ్లు కూడా అతని కళ్ళల్లోకి రాకుండా మొరాయించాయి.

అమూల్యవైపు చూడలేక తలవంచుకు నిలబడ్డాడు.

"ఇంకోమార్గం లేదు. బాధ్యతగా ప్రవర్తించాలి" అతను గొణుగుతున్నట్లు అన్నాడు. అన్నాడో లేదో అతనికే తెలియకుండా అయింది.

అమూల్య వెనక్కి తిరిగింది.

వెళ్ళొస్తానని కూడా చెప్పకుండా, కన్నీళ్లు అదుముకుంటూ, అదురుతున్న గుండెనీ, గుండెని పిండేస్తున్న బాధనీ అణుచుకుంటూ...

చీకట్లో కలిసిపోయింది.

విజయ్ శిలలా చూస్తూ నిలబడ్డాడు. కదలలేదు. చీకట్లు ముసురుకున్నాయి. చల్లగాలి, చీకటి, ఏదీ అతన్ని కదిలించలేదు. అట్లాగే నిలబడిపోయాడు.

మనసూ, శరీరం అన్నీ మొద్దుబారిపోయాయి. ఎప్పటికో ఆ స్థితిలోంచి బయటకు వచ్చాడు.

"ఇంతకన్నా నేనేం చెయ్యగలను? ప్రేమికులంటే భాగమతీ, కులీకుతుబ్ షాలే కాదు... లైలామజ్నూ, పార్వతీ- దేవదాసూ కూడా ఉన్నారు" గొణుక్కున్నాడు.

మొద్దుబారిన శరీరం కాస్త స్వాధీనంలోకి వచ్చి, కన్నీళ్లు మేమున్నాం, నిన్ను మర్చిపోలేదంటూ చెక్కిళ్ళమీంచి చుక్కలుగా కారాయి.

"నా సర్వస్వం పోగొట్టుకున్నాను" మళ్ళీ గొణుక్కున్నాడు, ఆ కన్నీళ్ళకి తన సంగతి చెప్తున్నట్లు.

"అవును. మాకర్థమైంది" అని సానుభూతి చూపుతున్నట్లు అవి మళ్ళీ మళ్ళీ కారాయి.

నేలమీద కుప్ప కూలిపోయాడు.

అమూల్య తండ్రి ఇంకా కోలుకోలేదు కాబట్టి అమూల్య పెళ్ళి బాధ్యతను బంధువులకి అప్పగించాడు. అమూల్యకి పెళ్లిసంబంధం వెతికే బాధ్యత కొందరు స్వయంగా నెత్తిన వేసుకుని పెళ్లి సంబంధాలు వెతికారు.

ఒక సంబంధం కుదిరింది. పెళ్లికొడుకు కంట్రాక్టరు. అతను అమూల్యను చూడగానే పెళ్ళికి ఒప్పుకున్నాడు. పెళ్లి ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా జరిపించమన్నాడు.

అమూల్య ఫైనల్ ఇయర్ పరీక్షలు అతను చెప్పిన ముహూర్తం తేదీకి వెంటనే వస్తాయి. అందువల్ల చదువుకి అడ్డం అవుతుందేమోనని అమూల్య తండ్రి అభిప్రాయపడ్డాడు. పరీక్షలయ్యాక పెళ్లి జరిపిస్తే బాగుంటుందన్నాడు.

"అయితే ఏం? పెళ్ళి అయ్యాకకదా పరీక్షలు. ఒకవేళ సరిగ్గా చదవకపోతే మళ్ళీ రాస్తుంది. దానికేం ఉంది. ముందు పెళ్ళయి జీవితంలో సెటిల్ అవటం ముఖ్యం" అన్నారు బంధువులు.

"ఆలస్యం చేస్తే అతను ఇంకో సంబంధం చూసుకుంటాడు. ఈ సంబంధం పోనివ్వకు. మళ్ళీ ఇలాంటి పెళ్లికొడుకు దొరకడు. అదీగాక కట్నం కూడా లేకుండా పెళ్లికి ఒప్పుకున్నాడు" అన్నారు.

అదీ నిజమే అనిపించింది ఆయనకు.

"ఇంకేం మాట్లాడకు. మళ్ళీ ఇలాంటి సంబంధం తేలేవు" అని ఒప్పించారు.

★ ★ ★

విజయ్‌కి తిండీ, నిద్రా కరువయ్యాయి. ఏమీ తినబుద్ధి కాదు. అన్నిటిమీదా విరక్తి. తిండీ నిద్రా లేక పేషెంట్ అవతారం వచ్చేసింది. ఎప్పుడన్నా ఇంట్లోవాళ్ళు మరీ మరీ బలవంతం చేస్తే కాస్త ఎంగిలిపడి వచ్చేస్తున్నాడు. అతని పరిస్థితి చూస్తే రంగమ్మకీ, రాజారావుకీ దిగులు పట్టుకుంది. వాళ్ళు కూడా చింతతో చిక్కిపోయారు.

జనం విజయ్ వెనక నవ్వుతున్నారు. వాళ్ళల్లో చాలామందికి అసలేం జరిగిందో తెలీదు. ఆస్తీ అంతస్థూ పోయినా అమూల్యా అతనిది వేరేకులం కాబట్టి అతన్ని చేసుకోవటంలేదేమో అనుకున్నారు.

"రోమియో"

"దేవదాసు"

మజ్నూ"

"పాపం విరహవేదనలా ఉంది"

రకరకాల కామెంట్స్ చేస్తుండేవాళ్లు. విజయ్ గుండెనిండా అమూల్య గురించి ఆలోచనలే కాబట్టి అతను వాళ్ళ మాటలు కూడా పట్టించుకునే స్థితిలో ఉండేవాడు కాదు. ఎప్పుడూ అమూల్యతో గడిపిన కాలాన్ని గుర్తు చేసుకుంటూ జీవిస్తున్నాడు.

కొందరు మిత్రులు సానుభూతి చూపుదామని చూశారు. కానీ విజయ్ ఏమీ అర్థం కానట్లు వాళ్ళవంక వెర్రిచూపులు చూసేసరికి అక్కడ్నుంచి వెళ్ళిపోయేవాళ్లు.

అమూల్య పెళ్ళి గురించి తెలియగానే రంగమ్మకీ, రాజారావుకీ బోలెడంత ఆనందం, చెప్పలేనంత విషాదం కూడా కలిగాయి. విజయ్ అమూల్యని చేసుకోవటం వాళ్ళ వాళ్ళకి ఇష్టంలేదు కాబట్టి వేరే ఎవరితోనో ఆమె పెళ్ళయిపోతోందని సంతోషపడ్డారు. కానీ విజయ్ వాలకం చూస్తే పిచ్చివాడిలా కనిపిస్తోంది. నిద్రాహారాలు మాని ఏమైపోతాడోనని భయపడ్డారు.

"ఈ గండం గట్టెక్కడమెలా? ఎప్పటికి వీడు మనుషుల్లో పడతాడు? " నిరంతరం వాళ్ళకి ఇదే చింత. ఏమీ చెయ్యలేక, చూస్తూ ఊరుకోలేక వాళ్ళు నరకం అనుభవిస్తున్నారు.

★ ★ ★

పెళ్ళికి వెళ్ళాలో, వద్దో నిర్ణయించుకోలేకపోయాడు. వెళ్ళాలని లేదు. అమూల్యా... తనకు ప్రాణంకన్నా ఎక్కువైన అమూల్యా. తనను ప్రేమిస్తోందో లేదోనని అల్లాడిపోయి, ఆమె తనను ప్రేమిస్తోందని తెలిసి ఆకాశంలో విహరించిన తన మనసు. తనూ ఆమె పెళ్ళాడతారు, ఆనందంగా ఉంటారని మురిసిపోయిన తన మనసు... అమూల్య ఇంకొకరిని పెళ్ళాడటం, అంటే తనలో ఒక భాగం విడిపోయి వేరొకరితో చేరటం భరించగలదా? తన గుండెని ముక్కలుచేసి ఒక ముక్క మరెవరో తీసుకుపోతుంటే తట్టుకో గలడా? తను కుప్పకూలి చచ్చిపోతే తనకేమైనా పర్వాలేదు. కానీ అమూల్యకి తలవంపులుగా ఉండదూ? తను అక్కడ గుండెపగిలి మరణిస్తే అందరూ కారణాలు వెతుకుతారు. ఆమె పెళ్ళిలో వీడెందుకు చచ్చాడంటారు. తమ కథంతా తెలుసుకుంటారు. అమూల్యమీద నీలాపనిందలు వేస్తారు. వద్దు. అట్లా జరగకూడదు. తను పెళ్ళికి వెళ్ళకపోయినా అంతే. ఇద్దరికీ ఏదో ఉంది కాబట్టే క్లాసుమేటూ, అంత స్నేహితుడూ అయి కూడా పెళ్ళికి రాలేదంటారు.

ఇవన్నీ జరక్కూడదు.

తన కారణంగా అమూల్యకి ఏ బాధా కలగకూడదు. అట్లాకాకుండా ఉండాలంటే, తను మామూలుగా ఉండాలి. ఏం జరగనట్లు పెళ్ళికి వెళ్ళి అందరితోపాటు కూర్చుని వచ్చేస్తే బాగుంటుంది.

అమూల్యకి ఏం కానుక ఇవ్వాలి.

"మనం అంతా కలిసి ఏదన్నా ఇద్దాం" అన్నారు క్లాస్‌మేట్స్. వాళ్ళకి తనవంతు డబ్బు ఇచ్చాడు. అయినా విడిగా ఏమన్నా ఇవ్వాలనిపించింది. ఏమివ్వాలో అర్థం కాలేదు. తామిద్దరూ ప్రేమించుకున్నారు. పెళ్లి చేసుకోలేకపోయారు. అంతమాత్రాన కేవలం క్లాస్‌మేట్స్‌గా మిగిలిపోతారా? ఒకరి హృదయంలో ఇంకొకరిమీద గౌరవం, ప్రేమ, ఆప్యాయతలు మాసిపోలేదు. కాకపోతే ఆనాటి కోరికలు లేవు. ఆప్యాయత మాత్రం మిగిలిపోయింది. తన ఆప్యాయత, వాత్సల్యానికి గుర్తుగా ఏమివ్వాలి? ఏదీ తోచలేదు.

పెళ్లిరోజున ఎట్లాగో గుండె రాయి చేసు




కుని తయారయ్యాడు.

స్నానం చేస్తుంటే తన శవానికి తానే స్నానం చేయించుకుంటున్న భావం కలిగింది. శరీరంలో ఏ అవయవం సహకరించటంలేదు. అన్నీ చచ్చుబడ్డట్లున్నాయి. ముక్కలైన గుండె మాత్రం కొట్టుకుపోతూ, ఇంకా బతికే ఉన్నావు సుమా అని తెలుపుతోంది.

స్నానంచేసి వచ్చి బట్టలు వేసుకుని, తన శవాన్ని తానే మోసుకుపోతున్నట్లు నడిచాడు.

పెళ్లి జరుగుతున్నచోటుకి చేరుకున్నాడు. కళ్యాణమంటపం కళకళలాడుతోంది. కుర్చీలు అప్పటికే చాలావరకు నిండిపోయాయి. క్లాస్ మేట్సంతా వచ్చేసి ఉన్నారు. వాళ్ళతోపాటు కుర్చీలో కూర్చున్నాడు.

పెళ్లికొడుకు కూర్చుని ఉన్నాడు.

అతనివైపు చూశాడు విజయ్. మనిషి ఎట్లా ఉన్నాడో కూడా తెలీనంతగా క్రీమ్ ఏదో దట్టంగా రుద్ది, పౌడరు పూశాడు. నుదుట బొట్టు, బుగ్గన చుక్క, మెళ్ళో పూల దండ, జరీబట్టలు పెళ్లికొడుకు వేషం వెలిగిపోతోంది.

విజయ్ మనసు ఘోషించింది.

'విజయ్... విజయ్. చూడు విజయ్. అతను నీలాగా అమూల్యకోసం తపించిపోయి ఉండడు. రాత్రింపగళ్లు ఆమెకోసం అతని గుండె కొట్టుకుపోయి ఉండదు. ఆమెకోసం సర్వస్వం అర్పించటానికీ, తన గుండెనైనా కోసి ఇవ్వటానికీ అతను సిద్ధపడతాడా? ఆమే తన సర్వస్వం అనుకుని బతుకు గడుపుతాడా? ఒక భర్తగా అతనికున్న అర్హత ఏమిటి? ఏమిటి నీకు లేనిదీ, అతనికి ఉన్నదీ. పిచ్చి విజయ్. ఒక్క కులం తప్ప. ఆ కులం ఉన్నందుకు అతను ఆమెకి భర్త అయ్యే అర్హత పొందాడు. నువ్వెంత గాఢంగా, నిజాయితీగా ప్రేమించినా నీకు ఆ అర్హత లేదు. అందుకే ఆమెకు భర్త అయ్యే అవకాశం కోల్పోయావు"

జీవితంలో మొట్టమొదటిసారిగా తన కులాన్ని తలుచుకున్న విజయ్‌కి బాధ కలిగింది.

అంతలోనే అతన్ని ఎవరో ఛెళ్ళున చరిచినట్లయింది. నిటారుగా కూర్చున్నాడు.

ఎవరి కులం వారికి గొప్ప. ఏ కులానికి ఆ కులం గొప్ప. అంతే. తను చిన్నప్పటినుంచీ విన్న బోధలూ, చదివిన చదువూ తనకి బోధించింది అదేగా. మరి ఈనాడు అమూల్యని పోగొట్టుకున్నందువల్ల తన వ్యక్తిత్వాన్నంతా పోగొట్టుకొని ఎందుకలా ఆలోచించాడు. తనమీద తనకే కోపం వచ్చింది.

అమూల్యని తీసుకువచ్చారు.

పెళ్ళికూతురి అలంకరణలో అమూల్యని చూశాడు విజయ్. జరీ అంచు తెల్లచీర, జాకెట్టు, జడకి కుట్టిన మల్లెపూలు చేతులకి నిండుగా గాజులు, తీర్చిదిద్దిన కాటుకకళ్ళు, కాళ్ళకి పారాణి. అసలే అందమైన అమూల్య పెళ్ళికూతురి అలంకరణలో ఇంకాస్త మెరిసిపోతోంది. అతను ముగ్ధుడై సర్వం మరిచి చూస్తూ ఉండిపోయాడు.

ఎంత అందం... ఏమి సౌందర్యం... అంతఃసౌందర్యం ఆ అందాన్ని పదింతలు చేసింది. పందిరిలో అంతా ఆమెనే చూస్తుండిపోయారు.

పెళ్ళి తంతు మొదలైంది.

మాంగల్యధారణ జరిగిపోయింది.

అయిపోయింది. అమూల్య పూర్తిగా పరాయిదయిపోయింది. ఇలక ఆమె తనకొక స్నేహితురాలు మాత్రమే.

అతను కట్టెలా, మోడులా కూర్చున్నాడు. శవంలా బిగుసుకుపోయాడు. కళ్ళెదుటే అమూల్య పరాయిసొత్తు కావడం చూస్తూ నిస్సహాయంగా కూర్చుండిపోయాడు.

"విజయ్... విజయ్..."

అడుగో అమూల్య భర్త...

నూతన దంపతులు అతిధులతో మాట్లాడుతున్నారు. అంతా కానుకలు ఇస్తున్నారు.

శవంలా లేచాడు. శరీరం శవంలా మారినా, మనసు శవం కాదుగా. మనసు

రగిలి, బాధ మెగలి, గుండె పగిలి... గుండె లోని రక్తం కళ్ళల్లోంచి బయటకు వచ్చిందా అన్నట్లు కన్నీరు జలజలకారింది. గబగబా కర్చీఫ్‌తో అద్దేసుకున్నాడు.

అంతా వెళ్ళి అమూల్యని అభినందించి వస్తున్నారు. విజయ్ మాత్రం కదలలేదు. అమూల్యతో ఏం మాట్లాడాలి? ఎలా మాట్లాడాలి?

"భోంచేసి వెళ్ళండి" అన్నారు.

భోజనం చేశాడు ఏం చేశాడో, ఏం తిన్నాడో కూడా తెలియకుండా.

క్లాస్‌మేట్సంతా వెళ్ళొస్తామని చెప్పడానికి అమూల్యా దగ్గరకి బయలుదేరారు.

అప్పుడు మాత్రం ఇంక ఉండబట్టలేకపోయాడు. వెళ్ళాడు. చూసి తట్టుకోగలనా అని భయపడుతూ, కన్నీళ్ళు రాకుండా కష్టపడుతూ, గుండె చిక్కబట్టుకుని గుబులునంతా మనసులో దాచుకుని, దుఃఖాన్నంతా అణిచేసుకుని సెలవు తీసుకున్నాడు.



పెళ్ళినుంచి తిరిగివచ్చాక విజయ్‌కి ఇంట్లో ఉండబుద్ధి కావడంలేదు. బయటా ఉండలేకపోతున్నాడు. దుర్భరంగా కొద్దిసేపు గడిపి, చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు.

తను ఇదంతా భరించలేడు. ఈ ఊరు వదిలి, ఈ పరిసరాలకు దూరంగా చాలా దూరంగా కొన్నాళ్ళు ఎటన్నా వెళ్ళిపోతే? జ్ఞాపకాలు కాస్త మరుగున పడేందుకు ప్రయత్నించి, అప్పుడు తన గుండె కాస్త నెమ్మదించి చిక్కబడ్డాక, అప్పుడు తిరిగి వస్తే?

అవును, అంతే.

వెంటనే తండ్రి దగ్గరకు వెళ్ళాడు.

"నాన్నగారూ" అన్నాడు.

విజయ్ నోరు తెరిచి మాట్లాడడం ఇన్నాళ్ళకి ఇదే మొదటిసారి.

కొడుకు పరిస్థితికి గుండె పగిలిపోతున్నా ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో ఉండిపోయాడు రాజారావు ఇన్నాళ్ళూ.

లోతుకుపోయిన కళ్ళు, నీరసంగా, నిస్తేజంగా, నిర్జీవంగా ఉన్న కొడుకుని చూసి బావురుమంది కన్నతండ్రి హృదయం.

"ఏం నాన్నా. ఏం కావాలి? " ప్రేమగా అడిగాడు.

"నాన్నగారూ... నాక్కాస్త డబ్బు కావాలి"

"ఎంత? "

"ఎంతంటే... నేను ఈ ఊరు వదిలి వెళ్ళిపోవాలనుకుంటున్నాను"

రాజారావు అదిరిపడ్డాడు.

"ఎక్కడికి? " అన్నాడు.

"తెలియదు. కొన్నాళ్ళు ఎటన్నా తిరిగి రావాలని"

రాజారావు గుండె నెమ్మదించింది.

"అలాగే నాన్నా. అదే మంచిది. కాస్త నాలుగు ఊళ్ళు తిరిగిరా. నేనూ అదే చెప్పాలనుకుంటున్నాను" అన్నాడు.

పరీక్షల సంగతి? అది విజయ్‌కి చాలా ముఖ్యమైన సమయం అన్న సంగతి ఆయన పట్టించుకోలేదు. ఏదో ఒకటి, విజయ్ కాస్త మనుషుల్లో పడితే అంతే చాలనిపించింది.

ఫర్వాలేదు. పరీక్షలు పోతేపోనీ...




ఉద్యోగం రానీ, మాననీ, పిల్లాడు మామూలు మనిషయితే చాలనిపించింది.

"ఎటు వెళ్ళాలనుకుంటున్నావు? "

"తెలీదు"

"మరి? "

"చూస్తాను. ఎటు వెళ్ళాలనిపిస్తే అటు వెళ్తాను. ఢిల్లీకి వెళ్ళి ఉద్యోగప్రయత్నం చెయ్యనా? "

విజయ్‌కి తండ్రిని డబ్బు అడుగుతుంటే సిగ్గు అనిపించింది. ఢిల్లీలో ఉద్యోగం చూసుకుని స్థిరపడితే...

ప్లాట్‌ఫామ్‌మీదో, ఫుట్‌పాత్‌మీదో పడుకోవడానికైనా తను సిద్ధం.

ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోతుందా అనుకున్నాడు.

"ఉద్యోగ ప్రయత్నమా? వద్దు... వద్దు" అన్నాడు కంగారుగా రాజారావు. అక్కడెక్కడో ఉంటే మళ్ళీ ఎట్లా ఉంటాడో ఏమోనని భయం వేసింది ఆయనకి.

"డబ్బుకి కష్టమేంలేదు. కొన్నాళ్ళు ఎటన్నా తిరిగిరా. వచ్చాక ఇక్కడే ఉద్యోగమో, వ్యాపారమో చేసుకోవచ్చు" అన్నాడు.

"సరే" అన్నాడు విజయ్.

"విజయ్" రాజారావు భయంగా చూస్తూ తన మనసులో మాట బయటపెట్టాడు.

"విజయ్... మేమెవ్వరం లేమని అక్కడ ఏ అఘాయిత్యం చెయ్యవుగా"

"అట్లాంటి ఉద్దేశం ఉంటే మీరెంతమంది కాపలా ఉన్నా ఎప్పుడో చేసేవాడిని"

రాజారావు మనసు శాంతించింది.

"అట్లాగే విజయ్. నీకెంత కావాలో చెప్పు. ఏ ఊరువెళ్ళినా, నువ్వు డబ్బు కావాలని ఫోన్ చేసినా, ఉత్తరం రాసినా చాలు. వెంటనే పంపిస్తాను. నువ్వు ఎక్కడికి వెళ్ళినా కేరాఫ్ అడ్రస్ రాస్తుండు"

"సరే" అన్నాడు విజయ్.

ఎక్కడికి వెళ్ళాలో అర్థంకాలేదు. ఏవో బట్టలు కొన్ని సర్దుకున్నాడు.

"విజయ్... ఎక్కడికి వెళ్తావురా తండ్రీ" భోరుమంది తల్లి రంగమ్మ.

"నేనేం శాశ్వతంగా వెళ్ళిపోవడంలేదమ్మా. ఏడవకు. మళ్ళీ వచ్చేస్తాను" అంటూ ఆమె కళ్ళు తుడిచాడు.

"అమ్మా... నీకు కష్టం కలిగిస్తున్నానంటే చెప్పు. పోనీ, ఉండిపోతాను" అన్నాడు విజయ్.

"నువ్విలా రా" రాజారావు భార్యని పిలిచాడు.

"నీకేమైనా మతిపోయిందా? వాడిక్కడ ఉంటే ఆ పిల్లని చూస్తూ ఒక్కనాటికీ తిరిగి నార్మల్‌గా కాలేడు. కొన్నాళ్ళు తిరిగిరానీ, దూరంగా ఉంటే ఆ అమ్మాయిని చూసే అవకాశం ఉండదు. రోజులు గడుస్తున్న కొద్దీ ఈ ప్రేమా గీమా అన్నీ సర్దుకుంటాయి. మనసు నెమ్మదిస్తుంది. తిరిగిరాగానే ఏదో ఉద్యోగం చూసి, ఎవర్నో ఒకర్ని కట్టబెట్టేస్తే సరి. ఆ తర్వాత హాయిగా ఉంటాడు. ఏడ్చి మొత్తుకుని వాడు మళ్ళీ ఇక్కడే ఉండిపోయేట్లు చూడకు" అని మందలించాడు.

"అది కాదండీ. వాడు ఈ పరిస్థితుల్లో ఇలా వెళితే ఏ అఘాయిత్యమైనా తలపెడితే... వేళకు తిండి తింటాడో లేదో... నా బాధ మీకేం తెలుస్తుంది"

"నాకు మాత్రం బాధలేదూ? వాడు ఏ అఘాయిత్యమూ చెయ్యనని మాటిచ్చాడు. ఇంక తిండి సంగతా, ఆకలేస్తే వాడే తింటాడు. ఊళ్ళు తిరుగుతుంటే మిగతా టూరిస్టులతో కలిసి వాడే తింటాడు. అన్నిటికీ దేవుడున్నాడని నిశ్చింతగా ఉండు" అన్నాడు రాజారావు.

రంగమ్మ తల ఊపింది.

విజయ్‌కి సర్దుకోవడంలో సాయం చేసింది. నిలవ ఉండే ఆహారం, జంతికలూ, చేగోడీలూ చేసింది.

ఢిల్లీకి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు విజయ్.

ఆ రాత్రే వెళ్ళిపోవాలనుకున్నాడు.

రాజారావు స్టేషనుకి వచ్చాడు. టికెట్ రిజర్వ్ చేయించుకోలేదు. అదృష్టవశాత్తూ బెర్తు దొరికింది. దొరకకపోతే జనరల్ కంపార్ట్‌మెంట్‌లో అయినాసరే వెళ్ళిపోదామనుకున్నాడు విజయ్.

రైలు కదిలింది.

"జాగ్రత్త... ఏం కావాలన్నా రాయి. నీ విశేషాలు ఎప్పటికప్పుడు చెప్తుండాలి. వీలైనప్పుడు ఫోన్ చెయ్యి" రాజారావు కంపార్ట్‌మెంట్ వెనకే పరుగెత్తి చెప్పాడు.

విజయ్ చెయ్యి ఊపుతూ ఉండిపోయాడు.

ధన్‌ధన్‌మంటూ పోతోంది రైలు. కిటికీ చువ్వలకి ఆనించి ఉన్న విజయ్ తల కూడా ధన్‌ధన్‌మంటోంది.

అమూల్య రూపం కళ్ళముందు కదులుతోంది. కళ్ళు మూసుకున్నాడు.

రైలు వేగం పుంజుకుంది.

స్టేషన్లు వస్తున్నాయి, పోతున్నాయి.

రాష్ట్రందాటి, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లను దాటి ఉత్తరప్రదేశ్‌లోకి ప్రవేశించింది రైలు.

కొండలూ, గుట్టలూ, లోయలూ, పర్వత సమూహాలూ... టన్నెల్సూ దాటుతున్నా ఏదీ విజయ్ దృష్టికి ఆనటంలేదు. శూన్యంలోకి చూస్తున్నట్లు చూస్తూ ఉండిపోయాడు.

రైలు ఢిల్లీ చేరింది.

★ ★ ★

విజయ్ ఢిల్లీలో కొన్నిరోజులున్నాడు. కుతుబ్‌మినార్, ఎర్రకోట, మ్యూజియంలు అన్నీ చూశాడు. గమ్యం లేకుండా ఎటో తిరుగుతూ ఉండేవాడు.

టూరిస్టు బస్సు ఎక్కి జైపూర్ వెళ్ళాడు. అంబర్‌కోట, మ్యూజియంలూ చూశాడు.

అక్కడినుంచి ఆగ్రావెళ్ళి కొన్నాళ్ళున్నాడు. తాజ్‌మహల్ చూస్తూ కాలం గడిపాడు. ఆగ్రా కోట చూశాడు.

పాలరాతి బొమ్మలు, పాలరాయి తాజ్‌మహల్ వగైరా అమ్మేవాళ్ళు అతన్ని పిలిచారు. కొనమని బలవంతపెడితే విజయ్ అక్కడ కొన్ని కొన్నాడు.

"ఇది అసలు సిసలు పాలరాయి. కాస్త ఖరీదు. చూడండి ఎంత బాగుందో! వెన్నెల్లో తాజ్‌మహల్‌ని చూశారా? " అని కొన్ని బొమ్మలు చూపిస్తూ అడిగాడొక దుకాణదారు.

"లేదు"

"చూడండి. చాలా బావుంటుంది"

విజయ్ అమూల్యకి కానుక ఇవ్వాలని ఒక పాలరాయి తాజ్‌మహల్ బొమ్మ కొన్నాడు.

"అమూల్య సుఖంగా ఉండాలి. ముంతాజ్ బేగమ్ షాజహాన్ ప్రేమని పొందినంతగా అమూల్య తన భర్త ప్రేమ పొందాలి" అనుకున్నాడు మనసులో.

కొన్ని ఏనుగుబొమ్మలూ, ఇంకా చిన్నచిన్న బొమ్మలూ కూడా కొన్నాడు ఇంట్లోకని.

"మీ చెప్పులు చూడండి ఎంత పాడైపోయాయో? ఇక్కడ లెదర్ చెప్పులూ, బూట్లూ కూడా దొరుకుతాయి కొనుక్కోండి" ఒక యాత్రికుడు సలహా ఇచ్చాడు.

విజయ్ అంతదాకా చెప్పులు అరిగి, చిరిగి తన పాదాలను బాధిస్తున్న సంగతి కూడా గమనించనేలేదు. అక్కడ చెప్పులు కొనుక్కున్నాడు.

వెన్నెల్లో తాజ్‌మహల్ చూశాడు.

వెన్నెలని తనలోంచి ప్రతిఫలిస్తూ మంచి ముత్యంలా హుందాగా నిలబడ్డ తాజ్‌మహల్ ఎవరినైనా మైమరపింపచేసేటట్లు ఉంది.

యాత్రికులంతా రెప్ప వేయకుండా చూశారు.

ఆగ్రాలో మరి కొన్ని రోజులుండి, విజయ్ ఢిల్లీకి తిరిగి వచ్చాడు.

★ ★ ★

ఇంక ఇప్పుడెక్కడికి వెళ్ళాలి?

ఎందుకో వారణాశి వెళ్దామనిపించింది.

కాశీ, వారణాశి, బెనారస్ ఏ పేరుతో పిలి





చినా అది ఓ పవిత్ర నగరం. పురాతన నగరం. ప్రతివాళ్ళూ జీవితంలో కనీసం ఒక్కసారైనా దర్శించాలనుకునే నగరం.

రైలు ఎక్కి కూర్చున్నాడు. వెళ్తున్నాడే కానీ ఎక్కడ బస చెయ్యాలో తెలియలేదు. ఢిల్లీకి వెళ్ళేటప్పుడు రాజారావే అంతా వివరించాడు. అక్కడికి వెళ్ళాక ఆ టూరిస్టు కంపెనీవాళ్ళు చూసుకున్నారు. కాశీకి కూడా వాళ్ళ బస్సు ఉందికానీ కాశీలో కొన్నాళ్ళుం దామనిపించి విడిగా బయల్దేరాడు.

రైల్లో ఒక తెలుగాయన పరిచయమయ్యాడు. "నా పేరు వేణు. మీ పేరూ? " అన్నాడు, అతనే విజయ్ తెలుగువాడయి ఉంటాడని ఊహించి.

"నా పేరు విజయ్"

"విశ్వనాథుని దర్శనానికేనా? " అడిగాడు.

విజయ్ మాట్లాడలేదు.

"సాధారణంగా మనవాళ్ళు కాశీకి వచ్చేది అస్థికల్ని గంగలో నిమజ్జనం చెయ్యటానికే. మా నాన్నగారు పోయారు అదుగో అస్థికల కలశం" అని పువ్వులతో అలంకరించిన కలశం చూపించాడు.

"అలాగా" సానుభూతిగా చూశాడు విజయ్.

"ఆయన చివరికోరిక, కాశీలో తన అస్థికలని కలపాలని. అందుకే ప్రయాసపడి వచ్చాను. నా దగ్గర డబ్బు కూడా ఎక్కువ లేదు. అయినా ఆయన ఆఖరికోరిక తీర్చాలని" అతను నెమ్మదిగా అన్నాడు.

"అవును. తల్లిదండ్రుల్ని గౌరవించి సన్మానించటం మన ధర్మం"

"మీ బస ఎక్కడనుకుంటున్నారు? "

"ఇంకా నిర్ణయించుకోలేదు"

"అయితే నాతో రండి. వాళ్ళు మన తెలుగువాళ్ళే. వాళ్ళ ఇంట్లో నాలుగు గదుల్లో లాడ్జి మాదిరి నడుపుతున్నారు. వాళ్ళే డబ్బు తీసుకుని భోజనం కూడా పెడతారు. మనకి ఇక్కడ తెలుగు భోజనం దొరకటం చాలా కష్టం. అదీగాక వీళ్ళు చాలా చవకలో రుచి అయిన భోజనం పెడతారు"

"వాళ్ళకేం అభ్యంతరం ఉండదా మరి నేను వస్తే"

"భలేవారే. రండి. నాతోపాటే ఉందురుగాని" అన్నాడతను. అతను ఆప్యాయంగా, చొరవగా మాట్లాడుతున్నాడు.

"నాలుగు రోజులపాటు ఉంటారా? " అడిగాడు.

"ఉందామనే ఉంది"

"నాపని పూర్తయ్యాక నేను ఖాళీనే కదా. ఇద్దరం కలిసి చూద్దాం ఊరంతా" అన్నాడతను.

బండి దిగారు.

అతను అస్థికలశం జాగ్రత్తగా పట్టుకుని, ఒక బ్యాగ్ తగిలించుకున్నాడు. విజయ్ అతని బ్యాగ్ ఒకటీ, తన బ్యాగ్, సూట్ కేస్ పట్టుకున్నాడు.

రిక్షా ఎక్కారు.

విజయ్ చుట్టూ చూస్తున్నాడు. పాత నగరం, పాత బిల్డింగులూ అయినా అదో మాదిరి ప్రశాంతత. రిక్షా కొన్ని వీధులు తిరిగి ఒకచిన్న ఇంటిముందు ఆగింది. ఎత్తుగా అరుగులు ఉన్న వరండా. రెండు పక్కలా రెండు గదులు, లోపలకు దారి, లోపల ఇంకో రెండు గదులూ, వంటగది. వంటగదిముందు పెద్ద వరండా, అక్కడే భోజనాలు వడ్డిస్తారుట.

ముందువైపు వరండాలో కూర్చున్న మనిషికి తననుతాను పరిచయం చేసుకున్నాడు వేణు.

"ఆ మీరేనా. ఉత్తరం రాశారుగా. గది రిజర్వ్ చేసిపెట్టాను. రండి" ఆహ్వానించాడు అతను.

ఇద్దరూ లోపలకు వెళ్ళారు.

చిన్నగది, చిన్న కిటికీ, నేలమీద రెండు చాపలు, రెండు దిండ్లు ఉన్నాయి. వాటిమీదే పడుకోవాలి. బయట రెండు టాయిలెట్లు ఉన్నాయి. వాటినే అంతా ఉపయోగించుకోవాలి.



"మీరు అస్థినిమజ్జనం, దైవదర్శనం చేసుకునిరండి. మీకు వంటచేసి పెట్టి ఉంచుతాం" అన్నాడాయన.

ఇద్దరూ బయల్దేరారు.

వేణు అస్థికలశం పట్టుకున్నాడు.

"సాక్షాత్తూ విష్ణుపాదాల చెంత పుట్టింది గంగ. ఆకాశంలోనుంచి ప్రవహిస్తూ హిమాలయాలలోంచి వచ్చి పారుతుంది. గంగ నీరు స్వచ్ఛం. ఎన్నాళ్ళయినా చెడిపోదు. గంగలో మునిగితే పాపాలన్నీ తొలగిపోతాయంటారు. సర్వదోషహరిణి గంగ. చచ్చిపోయే వాడి నోట్లో గంగాజలం పోస్తే వాడికి ఉత్తమగతులు ప్రాప్తిస్తాయిట" వేణు చెప్పుకుపోతున్నాడు.

ఇద్దరూ గంగ ఒడ్డుకి చేరారు.

పాతమెట్లు, రాతిమెట్లు, యుగాలనుంచి ఉన్నట్లున్నాయి. ఎందరు రాజులూ, రాణులూ, బికారులూ, మామూలు మనుషులూ, ఎన్నెన్ని కాలాల్లో ఎంతెంతమంది వాటిమీద నడిచారో? ఎన్నిసార్లు గంగానది ఉప్పొంగి, ఆ మెట్లని తన ప్రవాహంతో ముంచెత్తిందో... ఎన్ని రుతువులు, ఎన్ని వసంతాలు, ఎన్ని గ్రీష్మాలు, ఎన్ని శిశిరాలు, ఎన్ని ఏళ్లు, ఎన్ని శతాబ్దాలు... ఎన్నెన్ని చూశాయో అవి.

మెట్లకి కిందగా గంగ.

తెల్లగా పారుతున్న గంగని తదేకంగా చూశాడు విజయ్.

"నేనీ మెట్లమీద కూర్చుంటాను. మీరు కార్యక్రమం ముగించుకుని రండి" అన్నాడు ఒకచోట కూర్చుని.

వేణు అస్థికలశంతో ముందుకి నడిచాడు.

గంగ ఒడ్డున అనేక ఘాట్స్ ఉన్నాయి. ఒక్కోదానికీ ఒక్కో పేరు. కేదారేశ్వర ఘాట్, రాజా ఘాట్, మణికర్ణికా ఘాట్, హరిశ్చంద్ర ఘాట్.

ఒడ్డున గొడుగుకింద పురోహితులు కూర్చుని ఉన్నారు. అక్కడ పిండప్రదానం, అస్థినిమజ్జనం వగైరా కర్మకాండలు జరుగుతున్నాయి.

ఒక పురోహితుడి దగ్గరకు వెళ్ళాడు వేణు. అతనితో మాట్లాడి కూర్చున్నాడు.

పురోహితుడు కర్మకాండ ప్రారంభించాడు.

ఏవో మంత్రాలు చదువుతున్నాడు. ఆ తర్వాత పడవ ఎక్కివెళ్ళాడు వేణు. బహుశా అస్థికలు కలపటానికి కాబోలు.

విజయ్ గంగని చూస్తున్నాడు.

చాలామంది నీళ్ళల్లో మునిగి స్నానాలు చేస్తున్నారు. నీళ్ళమీద పువ్వులూ, బూడిదా, పుల్లలూ, శవభాగాలూ తేలుతున్నాయి.

హరిశ్చంద్ర ఘాట్, మణికర్ణికా ఘాట్ లలో శవాలకి దహనం జరుగుతుంది. కాశీలో దహన సంస్కారం జరిగితే ఉత్తమగతులు ప్రాప్తిస్తాయని హిందువుల నమ్మకం. చాలామంది ముసలివాళ్ళు ఓల్డేజ్ హోమ్‌లకి చేరుకున్నట్లు కాశీకి చేరుకుంటారు. అక్కడ చచ్చిపోతే పుణ్యం వస్తుందని నమ్మకం.

ఏ శ్మశానంలోనైనా దహనక్రియలు సూర్యాస్తమయంతో ఆగిపోతాయి. కానీ కాశీలోని మణికర్ణికా ఘాట్‌లో మాత్రం ఇరవైనాలుగ్గంటలూ దహనకాండ జరుగుతూనే ఉంటుంది. నిరంతరం ఏదో ఒక శవం కాల్తూనే ఉంటుందక్కడ.

విజయ్ ఆ రెండు ఘాట్‌లవైపూ చూశాడు. చితిమీద ఒక శవం కాలుతోంది. కింద నేలమీద ఇంకో శవం తన వంతు కోసం వేచిఉంది. శవం తాలూకు వాళ్ళు శవం పక్కన మౌనంగా నిలబడ్డారు. వాళ్ళ మొహాల్లో ఏ భావమూ లేదు. నిర్లిప్తంగా ఉన్నాయి ఆ మొహాలు. ఏమిటది? నిర్లిప్తతా లేక వైరాగ్యానికి పరాకాష్టా?

ఆ నదీతీరం, శవాలు, దహనం... నిర్లిప్తంగా నిల్చున్న మనుషులు, దూరాన విశ్వేశ్వరుడి గుడిలోంచి వినబడుతున్న ఘంటానాదం. అవి తన గుండెలోని గాయాన్ని ఆర్పుతున్నట్లు అనిపించింది విజయ్‌కి.




గాయం మాని, తనని కూడా నిర్లిప్తత ఆవరించుకుంటున్నదా?

ఏముంది ఈ జీవితం? ఇంతేకదా. పుట్టటం, పెరగటం, చావటం. దీనికోసం. ఇందులో ఏదో పొందాలనీ, అది పొందలేకపోయామనీ, పోగొట్టుకున్నామనీ ఎందుకీ తపన?

అతను మౌనంగా చూస్తూండిపోయాడు. గంగనీ, శవాల్నీ, స్నానం చేస్తున్న మనుషుల్నీ, దూరంగా కనబడుతున్న ఆలయాన్నీ.

శవాలు కాల్తున్నాయి. దూరంగా మెట్ల మీద కొందరు విదేశీయులు, యూరోపియన్సో, అమెరికన్సో కాబోలు, ఈ దహన కార్యక్రమం వింతగా చూస్తున్నారు. వాళ్ళకి శవాలు పూడ్చటమే తప్ప కాల్చటం అలవాటులేదు మరి. బహుశా వాళ్ళు చూస్తున్న మొదటి శవదహనం ఇదే అయిఉండొచ్చు.

విజయ్ కూర్చుండిపోయాడు. వేణు తిరిగివచ్చాడు.

"రండి. దర్శనానికి వెళ్దాం" అన్నాడు.

ఇద్దరూ విశ్వనాథుడ్ని దర్శించి, బసకు తిరిగి బయల్దేరారు. విజయ్ జనాన్ని చూస్తూ నడుస్తున్నాడు. అందరిలో భక్తిభావమూ, నిర్లిప్తతో తప్ప వేరే ఏం కనిపించలేదు. నగరంలో మాదిరి హడావిడి లేదు. ఏదో ప్రశాంతత.

బసకు వెళ్ళాక భోజనం వడ్డించారు.

అన్నం, కూర, పచ్చడి, చారు, మజ్జిగ.

చాలారోజుల తర్వాత అన్నం తిన్నాడు. అందువల్లనో, లేకపోతే మనసుకి కాస్త నిర్లిప్తతతో కూడిన ప్రశాంతత అలుముకుంటున్నందువల్లనో గానీ, నాలుగు ముద్దలు తినగలిగాడు.

భోజనంచేసి చాపమీద కూర్చున్నాడు. నాలుగు గంటలకి టీ తాగారు.

"ఊళ్ళోకి వెళ్ళి గుళ్ళు చూసుకువద్దాం" అన్నాడు వేణు.

ఇద్దరూ దగ్గర్లో ఉన్న ఆలయాలు చూశారు. తిరిగివచ్చి గంగ ఒడ్డున కూర్చున్నారు.

శవాలు కాల్తూనే ఉన్నాయి.

గంగానదిలో పడవలు తిరుగుతున్నాయి.

విజయ్ మెట్లమీద కూర్చున్నాడు. కొందరు విదేశీ టూరిస్టులు ఫ్లాష్‌లు మెరిపిస్తూ చకచక ఫొటోలు తీసుకుంటున్నారు.

కొన్నాళ్ళు కాశీలో ఉండి మనసు కాస్త కుదుటపడిందనుకున్నాక తిరిగి హైదరాబాద్ ప్రయాణమయ్యాడు విజయ్.

★ ★ ★

ఊళ్లన్నీ తిరిగి, తిరిగి హైదరాబాద్‌కి వచ్చాడు విజయ్.

గుండెలోని ప్రేమగాయం మాసిపోలేదు. కానీ కాస్త మానుపట్టింది.

పెరిగిన గడ్డం, లోతుకుపోయిన కళ్ళు, నిర్లక్ష్యంగా ఉన్న వస్త్రధారణ... కొడుకుని చూసి రాజారావు దంపతుల గుండె తరుక్కుపోయింది.

"బాబూ విజయ్... నా తండ్రీ" కొడుకుని కౌగిలించేసుకుని కన్నీళ్ళు పెట్టింది రంగమ్మ.

ఒక్క నిమిషం ఆమె గుండెల్లో తలదాచుకున్నాడు విజయ్. బాధ ఉపశమించినట్లయింది.

అతని వీపురాస్తూ, తల నిమురుతూ, కన్నీళ్లు పెట్టుకుంది ఆమె.

"చాల్లే నీ ప్రేమ. ఇప్పుడే అంత దూరం నుంచి ప్రయాణం చేసివచ్చాడు. కాస్త వేణ్ణీళ్లు సిద్ధంచేసి తిండి సంగతి చూడు" కళ్లల్లో నీళ్ళు తుడిచేసుకుంటూ ఆవిడ్ని తొందరపెట్టాడు రాజారావు.

"అవును. బాబుని చూడగానే అన్నీ మర్చిపోయాను. రారా తండ్రీ" అని వేణ్ణీళ్లు సిద్ధం చేయటానికి వెళ్ళింది రంగమ్మ.

"ముందు షేవ్ చేసుకో" అని షేవింగ్ సెట్ తెచ్చిపెట్టాడు రాజారావు.

కాఫీ తాగి షేవ్ చేసుకున్నాడు విజయ్.

"ఏమేం చూశావు? ఎక్కడెక్కడ తిరి

గావు? " అంటూ అడిగాడు రాజారావు.

రంగమ్మా, లలితా కూడా వచ్చేశారు.

"అవునవును. ఏమేం చూశావు విజయ్? నా కోసం ఏం తెచ్చావు? " అంది లలిత.

"స్నానంచేసి అన్నీ తీరిగ్గా చెపుతాడు" అంది రంగమ్మ. అసలే దిగులుతో ఉన్న కొడుకు తమకేదన్నా తెచ్చాడో, లేదో పాపం అసలా ధ్యాస ఉందో లేదో? పిచ్చివాడిలా వాలకం ఉన్న కొడుకుని చూసి ఆ తల్లి గుండె నీరయిపోతోంది. ఎట్లాగైనా కొడుకుని మళ్ళీ మనుషుల్లో పడేట్లు చెయ్యాలి. లలిత తనకేం తెచ్చావని అడిగి విజయ్‌ని ఇబ్బంది పెట్టిందేమోనని ఆవిడ భయపడింది.

"చాలా చూశాను లల్లీ. నీ కోసం, అమ్మ కోసం చిన్న చిన్న ప్రెజెంట్స్ కూడా తెచ్చాను" అన్నాడు విజయ్.

తల్లికీ, తండ్రికీ తనని చూసి గుండె నీరయిపోవటం అతను గమనించాడు. అప్పుడప్పుడూ రాసుకున్న ఉత్తరాల్లో, ఎప్పుడైనా ఫోన్‌లో మాట్లాడినప్పుడూ వాళ్ళ బాధ వ్యక్తం అయ్యేది. వాళ్ళ ప్రేమానురాగాలు చూసి అతనికి బాధ కలిగింది.

"ఎట్లాగైనా నేను ఈ బాధనుంచి దూరం కావాలి. అమూల్యతో ప్రేమ కరిగిపోయిన కల గడిచిపోయిన స్వప్నాన్ని తల్చుకుని ఎంత ఛింతించి మాత్రం ఏం ప్రయోజనం. ఇన్నాళ్ళూ ఇంటికీ, ఈ పరిసరాలకూ దూరమైనా ఆమెమీద ప్రేమనీ, ఆ జ్ఞాపకాలనీ మర్చిపోలేకపోయాను. మనిషి దూరమైనా మనసు దూరంకాదు. అందుకే ఇంక ఇక్కడ్నుంచి పారిపోయి దూరంగా ఉండే ఆలోచనలు కట్టిపెట్టాలి. ఒక కొడుకుగా, అన్నగా నాకున్న బాధ్యతల్ని తెలుసుకోవాలి. నేనిట్లా ఉంటే, నా తల్లితండ్రులెంత బాధపడతారు. తల్లితండ్రుల్ని సుఖపెట్టలేని కొడుకూ ఒక కొడుకేనా? సుఖపెట్టలేకపోతేపోయాను. కనీసం వాళ్ళకి దుఃఖాన్ని మాత్రం మిగల్చకూడదు. నేను మారాలి. మారలేకపోయినా, కనీసం మారినట్లయినా వాళ్ళకి కనిపించాలి" అనుకున్నాడు.

గడ్డం చేసుకుని స్నానం చేసి వచ్చాడు.

"ఇప్పుడు చూడు ఎంత తేటగా కనిపిస్తున్నావో. రా... అన్నం పెడతాను" అంది రంగమ్మ.

అంతా కలిసి అన్నం తినటానికి కూర్చున్నారు. వేడివేడి అన్నం, అప్పడాలు, వంకాయ కూర, సాంబారు, కొబ్బరిపచ్చడి, నెయ్యి, పూర్తి ఆంధ్రభోజనం.

"అక్కడ ఉత్తరాదిన మన తిండి దొరకదుకదూ. ఎట్లా చిక్కిపోయావో చూడు" అంది తల్లి.

"కాశీలో తెలుగు భోజనమేనమ్మా. మిగతాచోట్ల కూడా వెతుక్కుంటే దక్షిణాది హోటల్స్ ఉంటాయి" అన్నాడు విజయ్.

"సరే. ఇల్లు వదిలి వెళ్ళాక కూడా మన భోజనమేనంటే కుదరదు. సర్దుకుపోతుండాలి" అంది లలిత.

విజయ్ వాళ్ళ మాటలు వింటూ నవ్వుకున్నాడు. అసలు ఏం తింటున్నాడో, రుచి ఎట్లా ఉందో ఎన్నడన్నా పట్టించుకున్నాడా? కొన్నిసార్లు టూరిస్ట్ బస్సులో వెళ్ళినప్పుడు, వాళ్లు ఏదో హోటల్ ముందు ఆపితే, అక్కడ తినాలనిపిస్తే తినటం, లేకుంటే ఉపవాసం. అంతే.

కొసరి కొసరి తినిపించింది తల్లి.

విజయ్‌కి చాలా భారంగా అనిపించింది. చాలాకొద్దిగా తినటం అలవాటైపోయిన పొట్టకి అంత ఆహారం భరించటం కష్టమనిపించింది. ఎంత చెప్పినా రంగమ్మ వినలేదు.

"హు" అని భారంగా సోఫాలో కూలబడ్డాడు భోజనం ముగిశాక.

"ఇదుగో ఈ వక్కపొడి వేసుకో. కాస్త భారం తగ్గుతుంది" రాజారావు తను కాస్త వక్కపొడి నములుతూ పక్కనే కూర్చున్నాడు.

"విజయ్. ఇప్పుడు చెప్పు. మాకేం తెచ్చావు? నీ సూట్‌కేస్ పట్టుకురానా? "





అడిగింది లలిత ఉత్సాహంగా.

"వాడ్ని కాస్త విశ్రాంతి తీసుకోనీ" అన్నాడు రాజారావు.

"పర్వాలేదు నాన్నాగారూ... లల్లీ వెళ్ళి ఆ నల్లబ్యాగ్ తీసుకురా. అందులోనే నేను తెచ్చినవన్నీ ఉన్నాయి" అన్నాడు విజయ్.

లలిత వెళ్ళి బ్యాగ్ తెచ్చింది.

"ఇదుగో ఈ బెనారస్ సిల్క్‌చీర అమ్మకు. ఈ జరీచీర నీకు" విజయ్‌తీసి చూపించాడు.

"అబ్బ... భలేగా ఉంది. నాకీరంగు చాలా ఇష్టం" లలిత ఎగిరి గంతేసినంత పనిచేసింది.

"చాల్లే ఊరుకో. కోతిలా ఎగరకు" మందలించింది రాణీరంగమ్మ.

"అమ్మా. నీకు చీరె నచ్చిందా? "

"నచ్చకేం. నా చిన్నారి విజయ్ నా కోసం తెస్తే" ఆప్యాయంగా అంది రంగమ్మ.

రాజారావు కోసం తెచ్చిన చొక్కా, పాలరాయి ఏనుగులూ, వినాయకుణ్ణి కూడా చూపించాడు.

అమూల్యకోసం తెచ్చిన పాలరాయి తాజ్‌మహల్ పాకెట్ విప్పబోయింది లలిత.

"అది మనకి కాదు, ఉండనీ" అన్నాడు విజయ్.

లలిత అది వినిపించుకోకుండా ఎప్పటిలాగే మొండిగా పాకెట్ విప్పేసింది. పాలరాతి తాజ్‌మహల్ ముద్దులొలికిస్తూ బయటపడింది.

"అబ్బ... ఎంత బావుందో. అయినా ప్రెజెంట్ అంటున్నావు. మనకి కాదా? మరి ఎవరికీ? " అంది లలిత.

"అమూల్యకి"

ఒక్కసారిగా అక్కడ భయంకరమైన నిశ్శబ్దం చోటుచేసుకుంది. అమూల్య ప్రస్తావన తేవటం కూడా ఇష్టంలేనట్లు మారాయి రాజారావు దంపతుల మొహాలు.

లలిత ఏదో పనున్నట్లు వెంటనే అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

అప్పుడప్పుడే కాస్త ఆహ్లాదంగా మారుతూ వచ్చిన వాతావరణంలో మళ్ళీ కారుమేఘాలు ముసిరినట్లయింది.

చివరకు రాజారావే నోరు విప్పాడు. గొంతు సవరించుకున్నాడు.

"నువ్వు అమూల్యని కలుసుకోక పోవటమే మంచిదేమో. మళ్లీ ఈ ప్రెజెంట్ తీసుకుని వాళ్ళింటికి వెళ్ళటం దేనికి? ఆమె పెళ్ళయి భర్తచాటున బతుకుతోంది. ఇప్పుడు నువ్వు వెళ్ళటం బాగుండదు. నా మాట విని కనీసం ఏడాదిపాటు ఆమెని కలుసుకోకు. ఆమె ఎట్లా ఉందని కూడా ఎవర్నీ అడగకు. నీమూలంగా భార్యాభర్తల మధ్య అపోహలు వస్తే బాగుండదు" అన్నాడు.

తండ్రి చెప్పింది అక్షరాలా నిజం.

కానీ... కానీ... అమూల్యకి పర్సనల్‌గా ఏదన్నా కానుక ఇవ్వాలన్న కోరికని అణచుకోలేక దీన్ని తెచ్చాడు తను. అదీగాక ఈ మిషతో ఆమెని చూడవచ్చని తన అంతరంగంలో ఏమూలో కోరిక దాగి ఉందా? ఏమో మరి? అయినా ఏదైతే అయింది. ఆమెని మర్చిపోయి, చూడకుండా ఉండటమే తను చేయవలసింది. నాన్నగారు చెప్పినట్లు తను వెళ్ళటం ఆమెకి చెడుపు చేస్తే అంతకన్నా మానసిక క్షోభ ఉండదు తనకి.

"సరే" అన్నాడు.

రాజారావు దంపతుల మొహాల్లో బోలెడంత రిలీఫ్.

"అసలు ఎవరితోనూ ఆమె గురించి కూడా మాట్లాడకు. ఎటుపోయి ఎటొస్తుందో" అన్నాడు రాజారావు.

విజయ్ తల ఊపాడు.

రాజారావు తృప్తిగా లోపలకు వెళ్ళాడు.

"ఇంక నిద్రపోరాదూ కాస్సేపు" అంది రంగమ్మ.

"నిద్రరావటం లేదమ్మా"

"అదే వస్తుంది, హాయిగా వెళ్ళి పడుకో

అంది తల్లి. మెత్తటి పరుపు, చక్కటి దుప్పటీ. అయినా కళ్ళు మూసుకుని ఎంత ప్రయత్నించినా నిద్రరాలేదు.

అమూల్య మొహం కళ్ళముందు కదులు తోంది. అటూ ఇటూ పొర్లి పొర్లి ఎప్పటికో నిద్రపోయాడు.



మర్నాడు పొద్దున్న లేచి పళ్ళుతోము కుని, స్నానంచేసి వచ్చాడు.

అప్పటికే ఆఫీసుకి వెళ్ళిపోయే రాజారావు ఇంకా ఇంట్లోనే ఉన్నాడు. అంతా కలసి భోంచేశారు.

"ఇవాళ ఆఫీసుకి వెళ్లరా? " భోజనాల యాక విజయ్ అడిగాడు.

"వెళ్ళను. నెలరోజులు శలవుపెట్టాను" అన్నాడు రాజారావు.

"ఎందుకూ? " ఆశ్చర్యంగా అడిగాడు విజయ్.

"పెళ్ళి చేసేద్దామని" అన్నాడు రాజారావు.

ఒకవేళ లలితకిగానీ సంబంధం కుదిరి, పెళ్ళికోసం సెలవుపెట్టాడేమో అనుకున్నాడు విజయ్.

"సంబంధం కుదిరిందా? " అడిగాడు.

"కుదిరినట్లే. మేమే అన్నీ చూసి రెండు సంబంధాలు సెలెక్ట్ చేశాం. నువ్వు ఎవరిని ఔనంటే ఆ సంబంధం సెటిల్ చేస్తాము"

"నేను అవునని ఏం లాభం. నచ్చాల్సింది లలితకి కదా? చేసుకోబోయేది ఆమె"

"ఆమె కాదు. నేను నీ పెళ్ళి గురించే మాట్లాడుతున్నాను"

విజయ్ నిర్ఘాంతపోయాడు.

"నాకు పెళ్ళా? " అన్నాడు.

"అవును విజయ్. నీ పెళ్ళే. ఎన్నాళ్ళని మోడులా ఉంటావు. నువ్వు పెళ్ళి చేసుకుని సుఖంగా ఉండాలని మాకు ఉండదూ? "

"ఇప్పుడప్పుడే పెళ్ళి చేసుకునే ఉద్దేశం నాకు లేదు"

"మరింకెప్పుడు చేసుకుంటావు? నువ్వు ఇట్లా ఉండటం మేం భరించలేం. విజయ్... నువ్వు వీలైనంత తొందరగా పెళ్ళిచేసుకోవటం మంచిది. అటు ఆమెనీ మర్చిపోతావు. అది ఆమెకీ నీకూ కూడా మంచిది. పెళ్ళికాగానే భార్యా సంసారం గొడవలో అన్నీ సర్దుకుంటాయి. పెళ్ళిచే సుకో. ఇంక ఇప్పుడు కాదు ఎప్పుడో చేసు కుంటాను అనటం కాదు. ఎందుకంటే ఇప్పు డయితే నీకు భగ్నప్రేమికుడిగా పేరులేదు. లోకం నోరు పెద్దది. ఇట్టే చిలవలుపలవ లుగా వ్యాపించి, ఒకటికి నాలుగు చేర్చి ప్రచారం చేస్తే, ముందుముందు నీకు సంబంధాలు కూడా రావు. నువ్వు ఎక్కడికి వెళ్ళావని అడిగిన వాళ్ళందరికీ ఢిల్లీలో ఉద్యోగం చూసుకోవటమో, ఫారిన్‌కి వెళ్ళ టమో ట్రైచేస్తావనీ అందుకే వెళ్ళావనీ చెప్పాము. నువ్వూ అలాగే చెప్పు. వెంటనే పెళ్ళిచేసుకో" అన్నాడు రాజారావు.

విజయ్ ఏదో చెపుదామని నోరుతెరిచే లోపలే రంగమ్మ అందుకుంది.

"విజయ్... నా మాట విను. నువ్విట్లా ఉంటే, నా గుండె బద్దలైపోతుందిరా. నాన్న గారు చెప్పినట్లు విను. మంచి పిల్లను చూసి, పెళ్ళాడి, కాపరం చేస్తుంటే అన్నీ మర్చిపోయి హాయిగా ఉంటావు. నువ్వు చిన్నపిల్లాడివి. నీకేం తెలీదు. ఈ వయ





సులో అందరికీ ప్రేమా, దోమా అంటూ ఉంటాయి. అది సహజం. కానీ ఆ ప్రేమ ఫలించకపోయినంత మాత్రాన ఇట్లా మోడులా మారి ఏడుస్తూ కూర్చోకూడదురా" అంది తల్లి కాస్త ఆవేశంగా.

రాజారావు ఆమెని కళ్ళతోనే మందలించాడు.

"బాధపడకు. వాడు మంచి పిల్లాడు. మనం చెప్పినట్లు వింటాడు" అన్నాడు విజయ్‌ని బుజ్జగిస్తూ.

"మిమ్మల్ని బాధపెట్టకూడదనే అనుకుంటున్నాను. కానీ ఉద్యోగం సద్యోగం లేకుండా పెళ్ళేంటి? " అన్నాడు విజయ్.

"ఏం ఫర్వాలేదు. కాంతమ్మత్తయ్య కూతుర్ని ఇస్తానని ఉవ్విళ్లూరుతోంది. వాళ్ళకి ఒక్కత్తే కూతురు. ఊళ్ళో పొలం, ఇల్లూ ఉన్నాయి. అవి చూసుకుంటూ కూర్చున్నా గడిచిపోతుంది. ప్రయత్నం చేస్తూ ఉంటే ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోదు. నాకైతే ఆ సంబంధం బాగా నచ్చింది" అంది రంగమ్మ.

"రాజు మామయ్య మధ్యాహ్నం వస్తానన్నాడు. వాళ్ళమ్మాయిని కూడా చూడు. వాళ్లకి వ్యాపారం ఉందిగా. అది చూసుకుంటే చాలు ఉద్యోగం కూడా వద్దన్నారు" అన్నాడు రాజారావు.

ఇంతలో లలిత వచ్చింది.

"రాజుమామయ్య కూతురు బెటర్ అనుకుంటాను విజయ్" అంది.

విజయ్‌కి ఊపిరి పీల్చుకోవటం కూడా కష్టమైంది. అంతా హడావిడిగా ఏదేదో మాట్లాడేస్తున్నారు.

అతనికి అక్కడ ఉండబుద్ధి కాలేదు.

"నాకు పెళ్ళొద్దు" అని అరిచి చెప్పాలనిపించింది. ఎవరూ వినిపించుకునేట్లు లేరు. బలవంతంగా కట్టేసి అయినా పెళ్ళి చేసేట్లున్నారు, వాళ్ళ వాలకం చూస్తే.

"ప్లీజ్... ఇప్పుడే ఎవరినీ రమ్మనకండి. దయచేసి కొన్నాళ్ళు నన్ను ఒంటరిగా వదిలెయ్యండి" అన్నాడు బిగ్గరగా.

అంతా నిర్ఘాంతపోయి చూశారు.

"ఏమైందిరా నీకు. హాయిగా పెళ్ళిచేసుకోక ఏమిటా మొండితనం? " అంది రంగమ్మ.

"నా మనసంతా ఆందోళనగా ఉంది"

"అందుకే మరి పెళ్ళి చేస్తామనేది. ఒకసారి పెళ్ళిగానీ అయిపోయిందంటే ఈ ఆందోళనంతా పోయి మనసు శాంతిగా, హాయిగా ఉంటుంది" అన్నాడు రాజారావు మొండిగా.

అక్కడ ఉండబుద్ధి కాలేదు విజయ్‌కి. గబగబా పాంటూ, షర్టూ మార్చుకుని బయల్దేరుతుంటే తండ్రి వచ్చి గుమ్మానికి అడ్డంగా నిలబడ్డాడు.

"ఎక్కడికి వెళుతున్నావు? "

"ఊరికే కాస్త బయట తిరిగి వద్దామని"

"మేము నీ తల్లితండ్రులం. నీ శ్రేయోభిలాషులం. అవునా, కాదా? "

"అవును"

"మరి మేం చెప్పినట్లు చెయ్యక ఏమిటా మొండితనం? "

"మొండితనం కాదు. కాస్త నన్ను కుదుటపడనియ్యండి. ప్లీజ్"

"ఇంకా ఎన్నాళ్ళకి కుదుటపడతావు? ఆర్నెల్లయింది. ఏం కుదుటపడ్డావు? పెళ్ళి చేసుకుంటే, ఒక్కరోజులో కుదుటపడతావు" అన్నాడు రాజారావు తన మొండివాదన వదలకుండా.

"నాన్నగారూ... ప్లీజ్" విజయ్ గుమ్మం దగ్గరకి వచ్చి, తండ్రి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగాడు. ఆ కళ్ళల్లో ఏ శక్తి ఉందోగానీ రాజారావు అప్రయత్నంగా పక్కకి జరిగాడు.

"మంచి చెపితే వినటంలేదు" గొణిగాడు.

విజయ్ ముందుకి నడిచాడు. గేట్ వేస్తూ ఇంట్లోకి చూశాడు. తల్లీ, తండ్రీ, చెల్లెలూ, మొహాలు వేళ్ళాడేసుకుని ఇటే చూస్తున్నారు.

"కాస్త అట్లా తిరిగొస్తాను" అనేసి బయల్దే రాడు. ఎటు వెళ్ళాలో అర్థంకాలేదు.

ఇన్నాళ్ళూ ఎల్లా తిరిగాడు. ఒక గమ్యంలే కుండా ఈనాడూ అల్లాగే వెళితే సరి. కాసేపు తిరిగి, తిరిగి ఇంటికి వెళ్ళాలి.

బస్‌స్టాప్‌కి వచ్చాడు.

రామ్‌నగర్ వెళ్ళే బస్సు వచ్చింది. ఎక్కి కూర్చున్నాడు. రామ్‌నగర్‌కి టిక్కెట్ తీసు కున్నాడు.

బలరామ్ రామ్‌నగర్‌లోనే ఉంటాడు. చాలా రోజులైంది అతన్ని చూసి. 'వెళ్ళి, ఒక సారి చూసివస్తే' అనిపించింది.

రామ్‌నగర్‌లో దిగాడు. బలరాం ఇంటికి నడిచాడు.

బలరామ్ ఇంట్లోనే ఉన్నాడు.

విజయ్‌ని చ ి ఒక నిమిషం ఆశ్చర్యపో యాడు. ఆ తర్వాత అతని మొహంలో కాస్త కోపం కనిపించింది. అంతలోనే అన్నీ సర్దుకుని ఆప్యాయంగా ఆహ్వానించాడు.

"కూర్చో విజయ్. ఏమిటి ఇట్లా చిక్కిపో యావు? ఢిల్లీకి వెళ్ళావుట. ఎప్పుడు వచ్చావు? " అడిగాడు ప్రేమగా.

"నిన్న వచ్చాను. ఎలా ఉన్నావు? ఏం చేస్తున్నావు? " విజయ్ అన్నాడు.

"బాగానే ఉన్నాను. ప్రస్తుతం ఖాళీనే. కొన్ని ఉద్యోగాలకి అప్లైచేస్తున్నాను. ఇంకా ఏదీ రాలేదు. నీ సంగతేంటి? " సోఫాలో వెనక్కి వాలుతూ అడిగాడు బలరామ్.

"ఏదీ లేదు. నిన్ననే వచ్చాను. ఇంకా ఏమీ నిర్ణయించుకోలేదు" అన్నాడు విజయ్.

"ఏవ ఊళ్ళు చూశావు? " అడిగాడు బల రామ్.

విజయ్ చెప్పాడు.

బలరామ్ లోపలకు వెళ్ళి బిస్కెట్లు, టీ ఉన్న ట్రేతో వచ్చాడు.

ఇద్దరూ టీ తాగుతున్నారు.

బలరామ్ తమ క్లాస్‌మేట్స్ విశేషాలు చెపుతున్నాడు.

"అనిల్ స్టేట్స్‌కి వెళ్ళాడు. గోపి పెళ్ళ యింది. వాళ్ళ బిజినెస్ చూసుకుంటాడుట. నిన్ను గురించి అడిగాడు పెళ్ళికి కార్డు ఇచ్చే టప్పుడు. నీ అడ్రసు తెలీదన్నారు మీ నాన్న గారు"

అడ్రసెందుకు తెలియదు? ఎప్పటిక ప్పుడు డబ్బులు పంపిస్తూనే ఉండేవాళ్ళుగా. అడ్రసు ఎందుకు ఇవ్వలేదు? సందేహం వచ్చినా విజయ్ పైకిమాత్రం ఏం మాట్లాడ లేదు.

"అయితే గోపీ పెళ్ళయిపోయిందన్న మాట. సరే. ఇప్పుడెక్కడున్నాడు? ఇంకా ఏమిటి విశేషాలు? " అన్నాడు విజయ్.

బలరాం మౌనంగా సీలింగ్‌వైపు చూస్తు న్నాడు.

విజయ్‌కి అమూల్య గుర్తుకొస్తోంది.

ఆ క్షణంలో ఆమె తప్ప మరేం గుర్తులేని క్షణంలో తండ్రికి ఇచ్చిన మాట కూడా మర్చిపోయాడు. ఆమెని గురించి కూడా ఎవర్నీ అడక్కు! అన్న తండ్రిమాట అసలు జ్ఞాపకమే రాలేదు.

అతను నోరు తెరిచి... అడగనే అడిగే శాడు.

"అమూల్య ఎలా ఉంది? బావుందా? పరీక్షలు రాసిందా? "

బలరామ్ ఒకసారి విజయ్‌కేసి పరీక్షగా చూశాడు. ఆ చూపులు విజయ్‌ని ఇబ్బంది పెట్టాయి.

తను అమూల్య గురించి అడగటం తప్పా?

బలరామ్ దీర్ఘంగా నిట్టూర్చాడు.

"విజయ్... నీకు చెప్పాలో వద్దో తెలీటం లేదు"

"ఏమిటది" విజయ్‌కి ఎందుకో భయంవే సింది.

"విజయ్ నీ అడ్రస్ మీనాన్నగారికి నిజంగా తెలీదా? "

"ఎందుకడుగుతున్నావు? "

"కావాలి. చెప్పు"

"తెలుసు... ఆయన నాకు అడిగినప్పు





డబ్బు డబ్బు పంపేవారుగా. అదీగాక ఇంటికి ఫోన్‌చేసి మాట్లాడేవాడిని అప్పుడప్పుడూ" అన్నాడు విజయ్. ఏదో జరిగి ఉంటుందని అతని మనసు అతనికి చెపుతోంది.

బలరాం మళ్ళీ నిట్టూర్చాడు.

"అయితే నీకు నేను ఏమీ చెప్పకపోవటమే మంచిది. మీవాళ్ళు నీకేం చెప్పలేదన్నమాట. కావాలనే మానేశారేమో. మరి నేను చెపితే మీ నాన్నగారికి కోపం వస్తుందేమో? " అన్నాడు.

"అసలు విషయం ఏమిటి? " విజయ్ అసహనాన్ని అణుచుకుంటూ అడిగాడు.

బలరామ్ మాట్లాడకుండా కూర్చున్నాడు. అతని కళ్లు నేలను చూస్తున్నాయి.

విజయ్ ఈ సస్పెన్స్ భరించలేకపోయాడు.

అసలేం జరిగింది.

ఇంట్లోవాళ్ళు ఎందుకు చెప్పలేదు?

"బలరామ్. ప్లీజ్ ఏదీ దాచకు. చెప్పు" అన్నాడు అర్థిస్తూ.

బలరామ్ ఇంకా సంకోచిస్తూనే ఉన్నాడు.

"బలరామ్... నువ్వు నా స్నేహితుడివి ప్లీజ్ ఏదీ దాచకు. చెప్పు. విషయం ఏమిటసలు? " విజయ్ మళ్ళీ అడిగాడు.

బలరామ్ ఒకసారి మూలిగాడు.

అతని మొహం బాధగా విచారంగా ఉంది. ఎలా చెప్పాలా అన్నట్లు ఆలోచిస్తూ, ఒక రెండు క్షణాలు ఆగి, అప్పుడు చెప్పాడు.

"అమూల్య చాలా దీనస్థితిలో ఉంది"

"ఆ... అసలేం జరిగింది? " విజయ్‌కి గుండె ఆగిపోతున్నట్లనిపించింది. ఒక్కసారిగా సోఫాలోంచి లేచి బలరామ్ చేతుల్నీ, భుజాల్నీ కుదిపేస్తూ, ఆతృతగా, ఆవేదనగా అడిగాడు.

"కూర్చో చెపుతాను. ప్లీజ్... మనసు కాస్త చిక్కబట్టుకో. చాలా దారుణాలు వినాలి నువ్వు"

"బలరాం... ప్లీజ్ నాకేం కాదు చెప్పు. నా గుండె రాయి అయిపోయింది. ఎట్లాంటి వార్తనైనా విని, తట్టుకునే స్థితికి వచ్చేసింది. చెప్పు"

"నువ్వు ముందు కూర్చుని మంచినీళ్ళు తాగు. అది ఒక్క క్షణంలో చెప్పే సంగతి కాదు. చాలా సేపు పడుతుంది. ముందు స్థిమితంగా కూర్చో" బలరామ్ విజయ్‌ని బలవంతంగా సోఫాలో కూర్చోబెట్టాడు.

విజయ్ శిలలా చూస్తున్నాడు.

బలరామ్ చెప్పుకుపోతున్నాడు.

★ ★ ★

పెళ్లి జరిగిపోయింది.

మొదటిరాత్రి ఆనవాయితీ ప్రకారం పెళ్ళికూతురింట్లో జరగాలి. ముందు అట్లాగే అనుకున్నారు.

"మా ఆచారం ప్రకారం మా ఇంట్లో జరిపించాలి. అమ్మాయిని మా ఇంటికి పంపించండి" అన్నారు పెళ్ళికొడుకు తరపువాళ్ళు.

వాళ్ళిలా అన్నాక ఇంక బాగుండదని అక్కడే ఏర్పాటు చేద్దాం అనుకున్నారు.

పెళ్ళినాడే పెళ్ళి కొడుకు ప్రవర్తన వింతగా తోచింది. పెళ్ళిలో ఒకావిడ పాటలు పాడింది. ఆవిడతోపాటు ఇంకో పాప కూడా పాడింది. వాళ్ళకి మంచి బట్టలు పెట్టి, బహుమతులిచ్చారు కూడా. వాళ్ళతో పెళ్ళికొడుకు ప్రవర్తన అదోలా ఉండింది. పెళ్ళికొడుకు మొహం కూడా అదోలా ఉండి, కొత్తపెళ్ళికొడుకు మురిపెం, నూతనత్వం కనిపించకుండా అదోమాదిరి మొరటుగా అనిపించింది. అతన్ని చూస్తే అమూల్య తండ్రికి ఎందుకో భయంవేసింది.

అనుకున్న ప్రకారం అమూల్యని అత్తగారింటికి పంపారు. మొదటి రాత్రి... అమూల్యని అందంగా అలంకరించారు.

గదిలోకి పంపారు.

గదిలో మంచంమీద కూర్చుని తల వంచుకుని భర్తకోసం నిరీక్షిస్తోంది.

ఇంతలో తలుపులు తెరుచుకున్నాయి.

లోపలకు వచ్చింది పెళ్ళి కొడుకు కాదు. ఎవరో యాభైఏళ్ళ వ్యక్తి. గుబురు మీసాలు, లావుగా భయంకరంగా ఉన్నాడు. ఎర్రటి కళ్ళల్లో క్రౌర్యం.

అమూల్య తలవంచుకుని కూర్చున్నదల్లా అతని అడుగుల చప్పుడుకి భయపడి ఒక్క సారి తల ఎత్తింది. కసిగా తనని కౌగిలించుకోవటానికి ముందుకి వస్తున్న అతన్ని చూస్తూనే భయపడిపోయి కెవ్వున అరిచింది.

అతను ఆమెమీద పడబోయాడు.

అమూల్య మళ్ళీ అరిచింది. తప్పించుకుని మంచానికి అటువైపు వెళ్ళి నిలబడింది. ఈ విపరీత పరిణామానికి నిలువెల్లా వణికిపోతోంది. చచ్చేంత భయం వేసింది. శరీరం వణికిపోతోంది. తన గుండె చప్పుడు తనకే స్పష్టంగా వినిపిస్తోంది. బాబోయ్... ఏమిటిది? ఏం జరగబోతోంది? నాశనమయిందనుకున్న జీవితం సర్వనాశనం కాబోతున్నదా? ఎవరితను? ఎందుకిక్కడికి వచ్చాడు? ఆమెకి గొంతు తడారిపోయింది. ఈసారి అరుద్దామన్నా గొంతు పెగిలిరాలేదు. భయంతో కొయ్యబారిపోయింది.

ఆమె పరిస్థితి చూసి అతను నవ్వాడు.

"అలా భయపడతావేం? వాడు నీకేం చెప్పలేదా? " అన్నాడు.

ఎవరు? ఏం చెపుతాడు? అసలేం మాట్లాడుతున్నాడితను.

"ఏమిటిది? అసలు ఎవరు నువ్వు? " అమూల్య ఏడ్చేస్తూ అడిగింది.

"నేనెవరినైతేనేం.. ఈ రాత్రికి నీ భర్తని"

"ఏమండీ... ఏమండీ..." భర్తని పిలుస్తూ, ఎలుగెత్తి అరిచింది అమూల్య.

"వాడు రాడు. వాడెందుకు వస్తాడు. వాడేగా నిన్ను నాకు అప్పగించి పోయింది"

"ఆ..." నిశ్చేష్టురాలై నిలబడిపోయింది అమూల్య.





అప్పుడతను చెప్పిన నిజాలు.

అమూల్య భర్తకి ముందే పెళ్ళయింది. పెళ్ళిలో పాటలు పాడిన స్త్రీ అతని భార్యే. ఆ పిల్ల అతని కూతురు. అతనికి లేని దుర లవాటులేదు. అతను కొన్ని కాంట్రాక్టులు చేస్తాడు. స్మగ్లింగ్ లాంటి కార్యక్రమాలు కూడా ఉన్నాయి. ప్రతి దానికీ ఏదో ఒక నాడు అంతం తప్పదు. అలాగే అతనికీ పాపం పండింది. లేని రోడ్లు చేసినట్లుగా చూపించాడు. ఈ మహానుభావుడు వాటిని ఉన్నట్లు సర్టిఫై చెయ్యాల్సిన ఇంజనీరు. ఇతనికి ఆడపిచ్చి ఉంది. అది తెలిసిన అమూల్య భర్త అమూల్యని పెళ్ళినాటిరాత్రే అతనికి అప్పగిస్తానని అన్నాడు. అందమైన కన్య కదా అని అతనూ ఒప్పుకున్నాడు. వాళ్ళిద్దరి ఒప్పందం ప్రకారం అతను ఇతని మీద యాక్షన్ తీసుకోకపోగా బిల్స్ కూడా పాస్ అయేట్లే చేస్తాడు.

"అసలు వాడు ఒక పెళ్ళాం ఉండగా కూడా నిన్ను చేసుకున్నదే ఇందుకు. నువ్వు బోలెడంత అందంగా ఉన్నావు. నిన్ను వేరే వాళ్ళకి ఎరవేసి, తన పనులు పూర్తిచేసుకునేందుకు" అన్నాడతను ముగిస్తూ.

అమూల్య కుప్పకూలిపోయింది.

ఏడుస్తూ ఉండిపోయింది.

"ఏమిటిది? నేను చెప్పిందంతా విన్నావుగా. నాకు సహకరించి, సంతోషించు. నిన్ను ఊరికే అన్యాయం చెయ్యను. మీ ఆయనకిచ్చేదికాక నీకు ఇంకేమన్నా కావాలన్నా ఇస్తాను" అన్నాడతను.

"ఏమండీ... ఏమండీ" అమూల్యకి ఇంకా భర్తమీద నమ్మకంపోక భయంగా అరుస్తూ పిలిచింది.

భయంతో వణుకుతూనే ముందుకి దూకింది.

అతను ఆమెని పట్టుకోబోయాడు.

అమూల్య పరుగెత్తి బయటకు చూసింది.

అతను అమూల్యని ఒడిసిపట్టి, కిటికీ తలుపు కొంచెం తెరిచి బయట తిరుగు

తున్న ఆమె భర్తని చూపించాడు. ఒక్కడే ఉన్నాడు. బంధువులంతా ఎవరిదారిన వాళ్ళు ఎప్పుడో వెళ్ళిపోయినట్లున్నారు.

"ఇప్పుడైనా నమ్ముతావా" అన్నాడు.

అమూల్య గొడవ చేస్తోందని గ్రహించిన ఆమె భర్త కిటికీ దగ్గరకు వచ్చాడు.

"కాస్త ఆయన చెప్పినట్లు విను" అన్నాడు దూరంగా వెళ్ళిపోతూ.

కిటికీ తలుపులు మూసుకున్నాయి.

అతను ఆమెని పట్టుకోబోయాడు.

"రాకు... అడుగు ముందుకేస్తే విపరీత పరిణామాలు ఎదురవుతాయి, జాగ్రత్త" అరిచింది అమూల్య.

"పిచ్చిదానా... ఇంకా అర్థంకావటంలేదా? నీ అరుపులకి ఎవరూ రారు. నువ్వు నన్ను ఏమీ చెయ్యలేవు. నోర్మూసుకుని చెప్పిన మాట విను" అన్నాడతను.

"నిజమే... నేను నిన్ను ఏమీ చెయ్యలేను. నాకా బలంలేదు. కానీ నన్ను నేను ఏమన్నా చేసుకోగలను" అంది అమూల్య వెర్రిగా ఏడుస్తూ.

పిచ్చిగా తన తల గోడకేసి కొట్టుకోవటం మొదలుపెట్టింది.

అతను ఆపుదామని చూశాడు. కుదరలేదు. అదేపనిగా హిస్టీరిక్‌గా కొట్టుకుంటోంది. నుదురు చిట్లి రక్తం కారుతోంది. తల పగిలింది. రక్తం పారుతోంది.

ఆమె వెర్రి కోపంలో ఉంది. అమిత ఆవేశంలో ఉంది. తనమీద, తన పరిస్థితిమీద, తన నిస్సహాయ స్థితిమీద, తన అసహాయతమీద... అన్నిటిమీద వెర్రికోపం వచ్చింది.

ఆమెలో అన్నిటిపట్లా ధిక్కారం, తిరస్కారం, అసహ్యం ఒక్కసారిగా పెల్లుబికాయి. ఆవేశం... ఆ ఆవేశం ఆమె రక్తంలోంచి బొట్లుబొట్లుగా బయట పడుతున్నట్లు గోడకేసి తల కొట్టుకుంటూనే ఉంది.

"నిన్నేం చెయ్యను. ఆపు" అన్నాడతను భయంగా.

ఆమె ఆపలేదు.

అతను తలుపులు తెరిచి ఆమెని బయటకు నెట్టాడు. బయట కాపలాగా ఉన్న భర్త పరుగెత్తుకొచ్చాడు.

రక్తపు వరదలో ఉన్న ఆమెనీ, వణుకుతూ నిలబడ్డ ఆఫీసర్నీ చూసి అతను భయంతో వణికాడు.

"ఏం జరిగింది? " భయంగా అడిగాడు.

గాయం చూడ్డానికా అన్నట్లు ఆమెని సమీపించబోయాడు.

"నన్ను ముట్టుకోకు" గర్జించింది అమూల్య.

"ఆమెకి ఏదో వైద్యం చేయించు. భలే పెళ్ళాన్నే పట్టావు. చస్తే అదో కేసు" అని తిట్టి ఇంజనీరు వెంటనే అక్కడ్నుంచి జారుకున్నాడు.

అమూల్య అక్కడ నిలవలేకపోయింది. వెంటనే అక్కడ్నుంచి బయల్దేరింది. నగలు, పూలు, సెంట్లు, పెళ్ళి కూతురి అలంకరణ తలకి గాయం.

ఆపై అర్ధరాత్రి.

"ఈ రాత్రివేళ ఎక్కడికి వెళతావు? ఆడదానికి కాలు బయటపెడితే రక్షణలేదు. నేనూ వస్తాను. ఆగు" అన్నాడతను.

"ఇక్కడ అసలు రక్షణ లేదు. నీ తోడు నాకక్కర్లేదు" ఏడుస్తూ అని ఇంట్లోంచి బయటకు వచ్చేసింది అమూల్య.

ఒక ఆటో కనిపించింది. ఇంకా లోకంలో మంచితనం మరణించలేదన్నట్లుగా ఆ ఆటోడ్రైవర్, ఆమెని, నిస్సహాయస్థితిలో ఏడుస్తూ ఉన్న అమూల్యని క్షేమంగా తండ్రి ఇంటిదగ్గర దించాడు.

అమూల్య తండ్రి తలుపు తెరిచాడు.

ఆ పరిస్థితిలో ఇల్లు చేరిన అమూల్యని చూసి ఆయన గుండె పగిలింది. సంగతి విన్నాక ఆయన గుండె బద్దలయింది. ఏడుస్తూ కింద కూలిపోయాడాయన.

"డాడీ" అమూల్య గుండె పగిలేలా ఏడ్చింది.

ఆ తర్వాత... ఏముంది?



బంధువులు, స్నేహితులు, వచ్చేవాళ్ళు వచ్చారు. రావటం ఇష్టంలేని వాళ్ళు తప్పించుకున్నారు. ఆయన్ని హాస్పిటల్‌లో చేర్పించారు.

"మాకేం తెలుసు. మంచివాడనుకున్నాం. చెప్పకుండా ముందు ఇంకో పెళ్ళి చేసుకున్నాడేమో" అని తప్పించేసుకున్నాడు పెళ్ళి కుదిర్చిన బంధువు.

ఈ లోపల ఆ పెళ్ళి కొడుకు అమూల్యతో మళ్ళీ మాట్లాడాలనీ, ఇక్కడికి రావాలనీ, చాలా ప్రయత్నించాడు.

"నాకు బోలెడంత సర్కిల్ ఉంది. నువ్వు నన్నేం చెయ్యలేవు. నోర్మూసుకునిరా" అని బెదిరించాడు.

"నేను రాను. నీ ఇష్టం వచ్చింది చేసుకో ఫో. నీ బెదిరింపులకి భయపడను" అనేసింది అమూల్య.

ఆ బెదిరింపులు అమూల్యమీద పనిచెయ్యకపోయినా, చుట్టపక్కాలమీద, స్నేహితులమీద బాగానే పనిచేశాయి.

"మనకెందుకొచ్చిన గొడవ. పాడు పీడ. వాడు ఎంతకైనా తెగించినవాడు. మనమా మర్యాదస్థులం. మామూలు మనుషులం. వాడితో శతృత్వం పెట్టుకుని ఎట్లా నెగ్గుకొని వస్తాం" అని వాళ్ళల్లో వాళ్ళు నిర్ణయించేసుకుని, అమూల్యతో, స్నేహం, బంధుత్వం తెగతెంపులు చేసుకున్నారు.

అమూల్య ఒంటరి...

ఇక అమూల్య తండ్రి, పరిస్థితులకి తల వంచక తప్ప లేదు.

"భారత స్త్రీకి భర్తే దైవం"

"స్త్రీకి భర్తే సర్వస్వం" అని. చిన్నప్పట్నుంచీ సీతా, అరుంధతీ, అనసూయల కథలు నూరిపోసిన ఆ గొంతుతోనే.

అంతవరకూ భర్తకి కనీసం దూరంగా కూడా జీవించటం ఎరగని ఆ కుటుంబంలో.

మొట్టమొదటిసారిగా.

ఆయన గొంతులోంచి.

"విడాకులకి అప్లై చెయ్యి" అన్న మాట వచ్చింది.

అమూల్య వణికిపోయింది. కంపించిపోయింది.

కానీ అంతకన్నా మరో మార్గంలేదు.

పతివ్రతా లక్షణం అంటే అతని మాట వినటమా.

అంటే అతను చెప్పిన వాళ్ళ దగ్గరకి వెళ్తూ, వాళ్ళతో వ్యభిచరిస్తూ... అంతేనా? అప్పుడు... అప్పుడు భర్త చాటున జరిగే వ్యవహారం కాబట్టి ఎవరికీ తెలీదు. పతివ్రత అని పేరొస్తుంది. ఎవరి గుర్తింపు కోసమో పతివ్రతగా ఉండాలా? తను శీలవతిగా ఉండవలసింది తన కోసం. లోకం కోసం కాదు. భర్త అనే ముసుగు వేసుకున్న ఆ పశువు గురించి తనకు అనవసరం. వద్దు. వద్దు. వాడూ వద్దు, వాడి మూడు ముళ్ళ భార్య అనే బంధమూ వద్దు.

అతని బెదిరింపులు లెఖ్ఖ చెయ్యకుండా విడాకులకి అప్లై చేసింది.

కాస్తోకూస్తో మిగిలింది కాస్తా పెళ్ళికి ఖర్చుపెట్టేశారు. ఉన్న కొద్దిపాటి డబ్బుతో అతికష్టంమీద రోజులు నెట్టుకొస్తున్నారు. బలరాంలాంటి మిత్రులు కొందరు సాయం చేస్తున్నారు. అమూల్య ఉద్యోగం కోసం ప్రయత్నిస్తోంది.

బలరాం ఈ సంగతి విజయ్‌కి తెలియజెప్పాలని అనుకున్నాడు. అమూల్యకి ఈ సమయంలో విజయ్ తప్ప మరెవరూ ఓదార్పునివ్వలేరని అతనికి తెలుసు.

అమూల్య సంగతి తెలిసినా రంగమ్మ కానీ, రాజారావుగానీ, లలితగానీ, వెళ్ళాలని గానీ, ఓదార్చాలనిగానీ ప్రయత్నించలేదు.

అభిమానవతి అయిన అమూల్య కృంగిపోయింది. ఎవరినీ ఏ సాయం అడగలేదు.

విజయ్ ఉంటే ఎంతో బాగుండునని ఎన్నోసార్లు అనిపించేది ఆమెకి. బలరామ్ ఆ సంగతి గ్రహించాడు.





రంగమ్మ ఎన్నోసార్లు బజార్లో ఎదురయినా మొహం తిప్పేసుకుంది. విజయ్ కుశలం అడగాలన్న కోరిక చంపుకోలేక అమూల్య తనే ప్రశ్నించింది, విజయ్ బాగున్నాడా అని. రంగమ్మ సమాధానం చెప్పలేదు.

ఎన్నిరోజులు... ఎన్నిరాత్రులు... ఎన్నెన్ని సంఘటనలు. ఒంటరితనం... దారిద్ర్యం, నిరాశ... భర్త బెదిరింపులు.

అమూల్య వెక్కివెక్కి ఏడ్చేది. ఆ ఏడుపులో ఆసరాకోసం వెర్రి ఆక్రందన. స్నేహహస్తం చాచి ఆమెకి మానసిక స్థైర్యం అందించగల శక్తి కేవలం విజయ్‌కి మాత్రమే ఉందని తెలిసిన బలరామ్, విజయ్ అడ్రస్ ఇమ్మని ఎన్నిసార్లు అడిగినా విజయ్ కుటుంబంలో అంతా మాకు తెలీదు గాక తెలీదని విదిలించుకున్నారు.

అంతా విన్న విజయ్ శిలలా అట్లాగే కూర్చున్నాడు. అతని కళ్లు శూన్యంలోకి చూస్తున్నాయి. అసలేభావం లేకుండా అదోలా బిగుసుకుపోయింది మొహం. చలనరహితంగా ఉంది శరీరం.

బలరామ్ కంగారుపడ్డాడు.

"విజయ్... విజయ్" అంటూ కుదిపేశాడు. చలనరహితంగా, నిర్జీవంగా ఉన్న విజయ్ కళ్ళు అతనివైపు తిరిగాయి. కనుగుడ్ల చలనం తప్ప ఏ చైతన్యం లేని గాజుగుడ్లలా ఉన్నాయి అవి.

"అయ్యో... ఏమైంది విజయ్. ఎలా ఉంది నీకు" అడిగాడు బలరామ్, ఆదుర్దా నిండిన స్వరంతో.

"అమూల్య ఇప్పుడు ఎక్కడుంది?" అడిగాడు విజయ్. అతని గొంతు ఎక్కడో పాతాళంనుంచి వినవస్తున్నట్లు ఉంది.

"ఇక్కడికి దగ్గర్లోనే ఇల్లు. చూపిస్తాను వస్తావా?"

"పద" లేచి బయల్దేరాడు విజయ్.

బలరాం దూరంనుంచి ఇల్లు చూపించాడు.

"నువ్వు వెళ్లు. నేను వేరేచోటుకి వెళ్ళాలి. కాస్త పనుంది" అన్నాడు. అతని ఉద్దేశం, అన్నాళ్ళ తర్వాత, ఇన్ని సంఘటనలు జరిగాక కలుసుకుంటున్న వాళ్ళ మధ్య తనెందుకని.

విజయ్ తల ఊపాడు.

బలరామ్ చూపించిన పోర్షన్ తలుపు కొట్టాడు.

గడియ వేసిలేదు. తలుపులు దగ్గరకి వేసిఉన్నాయి. చిన్నగా నెట్టాడు. కిర్రుమని చప్పుడుచేస్తూ తెరుచుకున్నాయి అవి.

లోపల అమూల్య... శోకమూర్తిలా కూర్చుని ఉన్న అమూల్య తలపైకెత్తి చూసింది.

ఎదురుగా విజయ్.

కట్టలు తెంచుకున్న సముద్రంలా ఏడుపు ఆగకుండా వచ్చేసింది. ఒక్కసారిగా బావురుమంది.

విజయ్‌కి కూడా దుఃఖం ఆగలేదు.

అప్రయత్నంగా చేతులు చాచాడు.

ఆ చాచిన చేతుల్లో గువ్వలా ఇమిడిపోయింది అమూల్య. గుండెల్లోంచి పొంగి పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపలేక కుమిలి కుమిలి ఏడ్చింది.

అతను ఆమె చుట్టూ నిమురుతూ, పసిపాపని లాలిస్తున్నట్లు లాలిస్తూ ఉండిపోయాడు.

ఆమె వెక్కిళ్లు పెడుతోంది. శరీరమంతా కదిలి కదిలిపోతోంది. కన్నీరు వెల్లువై ప్రవహిస్తోంది. ఆ కన్నీరు అతని షర్టుని తడిపేస్తోంది.

అట్లాగే కొద్దిసేపు గడిచిపోయింది.

అమ్యూల తలెత్తి చూసింది. ఎన్నాళ్ళనుంచో అణచి పెట్టుకున్న దుఃఖం అంతా బయటకి వచ్చెయ్యటంతో మనసు కాస్త తేలికపడ్డది.

"విజయ్..." అంది.

"అమూల్యా. జరిగిందేదో జరిగిపోయింది. నీకు నేనున్నాను. నేనున్నాను"

అన్నాడతను. ఆమె కళ్లల్లోకి స్థిరంగా చూస్తూ.

ఆ చూపులో ఆప్యాయత, ప్రేమ, అను రాగం తొణికిసలాడాయి. ఆ చూపులు అమూల్యకి బోలెడంత శక్తినిచ్చాయి.

"విజయ్" అంది మళ్ళీ.

"అవును అమూల్యా. ఇంక నువ్వు ఏడవ టానికి వీల్లేదు. నీ దుఃఖదినాలు ఈ రోజు తోనే గడిచిపోయాయి. నీకు నేనున్నాను. నేనున్నాను. నా ఊపిరి ఉన్నంతకాలం నీకు ఏ భయంలేదు. ఇంక దిగులుపడకు" అన్నాడు.

"విజయ్"

"అవును అమూల్యా. జరిగిందేదో జరిగి పోయింది. అన్నీ మర్చిపో. నేను ఇందాకే గట్టి నిర్ణయం తీసుకున్నాను"

"ఏమని..." అమూల్య అయోమయంగా చూసింది.

"చెపుతాను. తీరిగ్గా చెపుతాను. నువ్వు దుఃఖమంతా మరిచిపో. కోర్టులో మళ్ళీ హియరింగ్ ఎప్పుడు? "

"వచ్చేనెల"



"డైవోర్స్ శాంక్షన్ అవుతాయి. భయపడకు. ఆ తర్వాత మళ్ళీ కొత్త జీవితం ప్రారంభించు. నాకు తెలిసిన లాయర్ ఉన్నాడు. ఆయన్ని కూడా అడిగి సలహా తీసుకుందాం. నీకు ఏ సాయం కావాలన్నా అడుగు. నేను రోజూ వచ్చిపోతుంటాను. మా నాన్నగారిని అడిగి భంగపడాల్సిన అవసరంలేదు. నేను వచ్చేశాను" అన్నాడు.

అమూల్య మొహంలో కాస్త రిలీఫ్. అది చూసి అతని గుండె కాస్త తేలికపడింది.

"విజయ్. నా గొడవలోపడి నీ సంగతి అడగనేలేదు. ఎప్పుడు వచ్చావు? ఏ ఊరెళ్ళావు? నీ విశేషాలేంటి? మంచినీళ్లు తాగుతావా? టీ పెడతానుండు" అంది ముందుకి కదుల్తూ.

"వద్దు. ఇప్పుడేం తాగను. అన్నీ బలరామ్ ఇంట్లో అయ్యాయి. నేను నిన్న వచ్చాను. చాలా ఊళ్ళూ చూశాను. ఇంతకీ నాన్నగారు ఎట్లా ఉన్నారు?" అన్నాడు విజయ్.

లోపల గదిలో అమూల్య తండ్రి పడుకుని ఉన్నాడు. దాదాపు అపస్మారక స్థితిలో ఉన్నాడు.

"డాడీ... డాడీ. విజయ్ వచ్చాడు" అని అమూల్య చాలాసార్లు తట్టి చెప్పాక ఆయన కళ్ళు తెరిచాడు.

విజయ్‌ని గుర్తుపట్టిన ఆ గాజు గుడ్లలాంటి నిర్జీవమైన కళ్ళలో కొద్దిగా వెలుగు కనబడింది. ఏదో చెప్పాలని ప్రయత్నించి చెప్పలేక ఆయాసపడ్డాడు.

కూతురు ఈ పరిస్థితిలో ఉంటే కన్న తండ్రి హృదయం ఎట్లా ఉంటుందో అర్థం చేసుకున్న విజయ్ గుండె తరుక్కుపోయింది.

"మీరేం భయపడకండి. అంతా చక్కబడుతుంది. అమూల్య బాధ్యత నేను తీసుకుంటాను. ఆమె సుఖంగా ఉండేట్లు చూసే పూచీ నాది" ఆయనకి మాట ఇచ్చాడు విజయ్.

ఆయన కళ్లల్లోంచి నీరు ధారగా కారింది. రెండు చేతులూ ఎత్తి జోడించబోయాడు.

మధ్యలోనే ఆయన ప్రయత్నాన్ని ఆపి, చేతుల్ని ఆప్యాయంగా తన అరిచేతులమధ్య ఇముడ్చుకున్నాడు విజయ్.

"ఇకనుంచే అన్నీ నేను చూసుకుంటాను" అన్నాడు హామీ ఇస్తూ.

ఆయన కళ్ళు మూసుకున్నాడు. మళ్ళీ మగతలోకి జారుకున్నాడు.

ఇద్దరూ బయటకి వచ్చారు.

"హాస్పటల్‌లో చేర్పించకపోయారా?" అడిగాడు విజయ్.

వెంటనే తను అడిగింది ఎంత తెలివితక్కువ ప్రశ్నో అతనికే అర్థమైపోయింది. ప్రైవేటు హాస్పటల్‌లో బోలెడంత ఖర్చు. ఉచితంగా వైద్యంచేసే గవర్నమెంటు హాస్పటల్‌లో మరీ చచ్చేట్లు ఉంటే తప్ప చేర్చుకోరు. ఈయన పాపం, ఎన్నాళ్ళనుంచో ఇదే స్థితిలో ఉన్నాడు. గవర్నమెంటు ఆస్పత్రిలో ఎవరు ఉండనిస్తారు ఇన్నాళ్లు.

"ఎవరికి చూపిస్తున్నారు?" అడిగాడు.

డాక్టర్ వినోద్ చూస్తున్నారు. చాలా మంచివాడు. మందులు ఫ్రీగా ఇస్తున్నాడు" అంది అమూల్య తల వంచుకుని.

ఇంటినీ, పరిసరాలనీ చూశాడు. రెండు గదుల పోర్షన్. ముందుగదిలో రెండు కుర్చీలు తప్ప ఏం పట్టవు. రెండోదాన్లో ఒక మంచం, ఒక బీరువా ఉన్నాయి. మంచం మీద అమూల్య తండ్రి పడుకుంటే, నేల మీద నిద్రపోతోందన్నమాట.

దారిద్ర్యం కోరల్లో చిక్కిన ఇంట్లో, దిగులు నిండిన మొహంతో అమూల్యని చూస్తుంటే విజయ్ గుండె కృంగిపోయింది. ఆమెని ఈ స్థితిలో చూడాల్సివస్తుందని ఎన్నడూ ఊహించలేదు మరి.

అతను గతం గుర్తుచేసుకున్నాడు. అమూల్య ఇల్లు... అందమైన ఆ బంగళా... చుట్టూ తోట, కారు గారేజ్‌లు, అందమైన ఫర్నిచర్, ఐశ్వర్యం ఉట్టిపడే ఆ




ఇల్లు, పనివాళ్లు, వంటమనిషి, కారు డ్రైవర్. అవన్నీ పోతేపోయాయి. ఈ పెళ్ళి ఈ దురదృష్టం, ఇదంతా ఏమిటి?

ఆమెని ఇట్లాంటి స్థితిలో చూస్తానని ఎప్పుడూ, ఎన్నడూ అనుకోలేదు అతను. అతని కళ్ళల్లో నీళ్లు నిండాయి.

"ఏమైంది విజయ్..." అమూల్య కంగారుగా అడిగింది.

"ఏంలేదు. నిన్నిట్లా చూడటం చాలా బాధగా ఉంది. మీ పాత ఇల్లూ, ఆ జీవితం... తల్చుకుని బాధగా ఉంది"

"పోనిద్దూ. నేను కనీసం కొన్నాళ్లయినా సుఖంగా ఉన్నాను. అదీలేకుండా పుట్టినప్పటినుంచీ కష్టాలే పడుతున్నవాళ్ళెంతమంది లేరు. చాలామందికన్నా నా పొజిషన్ చాలా బెటర్" అంది అమూల్య.

భారంగా నవ్వి ఊరుకున్నాడు విజయ్.

"రేపు మళ్ళీ ఇదే టైమ్‌కి వస్తాను. నేను ఇట్నుంచీ మా ఫ్రెండ్ అన్నయ్య ప్రకాష్ దగ్గరకి వెళ్తాను. ధైర్యంగా ఉండు" అని చెప్పి బయల్దేరాడు.

అమూల్య తల ఊపింది.

ఆమెకేసి చూశాడు. చిక్కి సగం అయిన శరీరం... లోతుకుపోయిన కళ్ళు, బుగ్గలు... దిగులుగా ఉన్న మొహం. అతని గుండె కలుక్కుమంది.

"ఉంటాను మరి" అంది అమూల్య.

విజయ్ ముందుకి కదిలాడు. ప్రకాష్ ఇంటికి బయల్దేరాడు.

ప్రకాష్ తన ఇంటికి ఎదురుగా ఉన్న ఇంట్లోనే, ఒక పెద్దగది అద్దెకి తీసుకున్నాడు. అక్కడే ఉన్నాడు.

విజయ్ అమూల్య విషయం అంతా చెప్పాడు. "ఆ అమ్మాయి కేస్ నాకు తెలుసు. మా ఫ్రెండ్ టేకప్ చేశాడు"

"మీ అభిప్రాయం ఏమిటి? ఆమె కేస్ గెలుస్తుందా? ఆ భర్త ఏదన్నా అభ్యంతరం చెపితే విడాకులు రాకుండా ఆగిపోతాయా? " అడిగాడు విజయ్.

"అదేంలేదు. ఆ అమ్మాయి కేసు క్లియర్‌గా ఉంది. వాడో పెద్ద లోఫర్. మోసంతో పెళ్ళి చేసుకున్నాడు. అదీగాక వాడికి ఇంతకుముందే పెళ్లయి పిల్లలున్నారు. ఈ పెళ్లి అసలు చెల్లదు. కాబట్టి డైవోర్స్ రావన్న ప్రశ్నేలేదు. తేలిగ్గా వచ్చేస్తాయి. ఆమెని నిశ్చింతగా ఉండమనండి. పూర్తిగా అసహాయస్థితిలో ఉన్నారు కాబట్టి నోరుమూసుకుని పడుంటారనే ధైర్యంతో పెళ్ళి చేసుకున్నాడు వాడు. ఆ అమ్మాయి వాడికి మంచి బుద్ధి చెప్పింది" అన్నాడతను.

★ ★ ★

ఇంటికి వెళ్లేసరికి తల్లీ, తండ్రీ ఆందోళన నిండిన మొహంతో ఎదురుచూస్తున్నారు.

విజయ్‌కి వాళ్ళవంక చూడబుద్ధి కాలేదు. వాళ్ళ మాటలు గుర్తుకొచ్చి కోపంతో మండిపోయాడు. అమూల్య విషయం పూర్తిగా దాచిపెట్టి, ఆ విషయం కప్పిపెట్టి తనని మభ్యపెట్టి పెళ్లి చేసేయాలని చూడటం. అమూల్యని శాశ్వతంగా తప్పించాలని చూడటం. ఎంత పకడ్బందీగా, ఏమీ ఎరగనట్లుగా వ్యవహరించారు. ఎందుకని ఎందుకని తననంత మోసం చెయ్యాలి?

అమూల్య అంత భయంకరస్థితిలో, ఒంటరితనంలో, ఒక్కసారి తల్లకిందులైపోయిన బతుకుతో తల్లడిల్లిపోతూ, సాయం కోసం విలవిల్లాడినప్పుడు ఆమెకి సాయం అందించాల్సింది పోయి, తామూ ఒక రాయి విసిరి ఆపైన తన అడ్రస్ కూడా ఇవ్వకుండా వేధించి, అవమానించి అయ్యో ఎంతపని చేశారు. దుఃఖంలో ఉన్న అమూల్యని తమ కొడుకు స్నేహితురాలుగా అయినా ఆదరించవచ్చు.

ఆపదలో ఉంటే, తెలియనివాళ్ళకీ, ముక్కూ మొహం ఎరగనివాళ్లకీ కూడా సాయం చేస్తామే, అట్లాంటిది తన ప్రియాతిప్రియమైన అమూల్య, తన ప్రాణసమానమైన అమూల్య ఎవరికోసమైతే తను తన

ప్రాణం కూడా త్యాగం చెయ్యటానికి సిద్ధమో, అట్లాంటి అమూల్యకి అవసరం అయినప్పుడు ఏం చెయ్యలేకపోయాడు. సరికదా, కనీసం... కనీసం కాస్త ఓదార్పుని వ్వలేకపోయాడు. కనీసం ఈనాడైనా తను తిరిగివచ్చాడు కాబట్టి, ఇన్నాళ్ళకు ఈ మాత్ర మైనా కాస్త ఓదార్పు ఇవ్వగలిగాడు. లేక పోతే ఇక్కడ అమూల్య ఇంత దిగులుతో, దుఃఖంతో, సర్వస్వం పోగొట్టుకుని కుమిలి పోతూ ఉంటే తను అక్కడ హాయిగా ఊళ్లు తిరుగుతూ ఎన్నేళ్ళయినా గడిపి ఉంటే? అప్పుడు అమూల్య పరిస్థితి ఊహించుకుని, అతని గుండె చెరువయింది.

తల్లిదండ్రుల్ని క్షమించలేకపోయాడు.

ఎటో మొహం తిప్పుకుని ఇంట్లోకి నడిచాడు. రాజారావు అతని మొహం చూడగానే అంతా తెలిసిపోయిందని గ్రహించేశాడు.

"ఎక్కడ్నుంచి వస్తున్నావు? " కోపాన్నీ, విసుగునీ, కప్పిపుచ్చుకుని వీలైనంత ఆప్యాయంగా అడిగాడు.

"మీరెక్కడినుంచి రాకూడదనుకున్నారో, అక్కడ్నుంచే" కటువుగా సమాధానమిచ్చాడు విజయ్.

"మేమేం అనుకుంటాం? "

"మీకు నిజంగా తెలీకే అడుగుతున్నారా? " ఇంతలో తల్లి కల్పించుకుంది.

"ఈ గొడవంతా దేనికిరా నాయనా. కోపం దేనికీ? ఇన్నాళ్ళూ నువ్వు ఎక్కడెక్కడో తిరిగావు. నీ ఆరోగ్యం ఎట్లా ఉందో, సరిగ్గా ఇంటికి చేరుకోగలవో, లేదోనని భయపడటం తప్పా? అందుకే అడిగారు ఎక్కడికెళ్ళావని. ఎక్కడికెళ్ళావు? ఇంత లేటయ్యిందేం? మీ ఫ్రెండ్స్ నెవరినైనా కలుసుకుని వస్తున్నావా? " అంది.

"అవును. బలరామ్‌నీ, అమూల్యనీ కలుసుకుని వస్తున్నాను" అన్నాడు విజయ్.

అక్కడ ఒక్కసారిగా నిశ్శబ్దం. అంతా షాక్ అయినట్లు, ఏం చెప్పాలో తెలీనట్లు నిలబడ్డారు.

రాజారావు కోపంగా గుటకలు మింగుతున్నాడు.

"హు" అని చేతులు విదిలించాడు.

విజయ్ ఇక ఉండబట్టలేకపోయాడు.

"నాన్నగారూ. ఎందుకిలా చేశారు? అమూల్య అంత కష్టంలో ఉంటే మీరు నాకెందుకు చెప్పలేదు? వాళ్ళకి నా అడ్రసు ఎందుకివ్వలేదు? ఆమెకి సాయం కావాల్సిన రోజున చెయ్యకుండా నేనలా దేశాలు పట్టి తిరగటం తల్చుకుంటే నాకు జీవితాంతం బాధగా ఉండదా? " అన్నాడు ఆవేదనగా చూస్తూ.

రాజారావుకి ఇక కంట్రోల్ చేసుకోవటం కాలేదు. "ఏమిటోయ్ నీకు చెప్పేది? దాని దారిన అది పెళ్ళయి వెళ్ళింది. ఇక నీకూ దానికీ ఏముంది సంబంధం?

ఎంతోమంది క్లాస్‌మేట్స్ ఉన్నారు. వాళ్ళలో ఈమె ఒకత్తి. అంతే" అన్నాడు.

"అంతేనా? " కోపంగా చూస్తూ అడిగాడు విజయ్.

"అవును. అంతే... అయినా సాయం, సాయం అని ఎగుర్తావేం? నువ్వెందుకు చెయ్యాలి. ఎవరి బతుకులు వాళ్ళవి. వాళ్ళేడుపు వాళ్ళేడుస్తారు" అన్నాడు రాజారావు.

"అంతేనా? " విజయ్ అరుస్తూ అడిగాడు.

"అంతేరా... అంతే. వాళ్ళ బంధువులేగా పెళ్ళి కుదిర్చింది. వాళ్ళే సాయం చేస్తారు. వాళ్ళ చుట్టాలూ, వాళ్ళూ చూసుకుంటారు? మనకెందుకు? ఎప్పటికీ నిలిచేవి రక్తసంబంధాలు"

"చుట్టాలు. హు... చుట్టాలు! వాళ్ళు ఏమాత్రం సాయం చేస్తున్నారో నాకు తెలుసు. అయినా నేను చుట్టరికాలు నమ్మను. అవన్నీ తప్పనిసరి బంధాలు. కానీ స్నేహం వేరు. నేను స్నేహితులకి చాలా విలువ ఇస్తాను. అమూల్య నాకు ముఖ్యురాలు. మంచి స్నేహితురాలు. నేనామెకి సాయం చెయ్యాలి. అంతే"




"సాయం అంటే ఏం చేస్తావు? "

"ఏదన్నా చేస్తాను"

"ఏదన్నా అంటే? దానికి దిక్కెవరున్నారు. ఇప్పుడు జీవితాంతం నీ సాయం కావాల్సిందే. ఇది తీరేది ఎన్నడు? "

"జీవితాంతం కావాలంటే జీవితాంతం చేస్తాను" పరిస్థితి చెయ్యి దాటిపోయిందని అందరికీ అర్థమైంది.

"ఏదో పెళ్ళి చేసుకుని పోయిందంటే ఇదెక్కడి పీడ పట్టుకుందిరా మళ్ళీ. అది ఒట్టి నష్టజాతకురాలురా తండ్రీ. దాని అన్నావదినా చచ్చారు. పెళ్ళేమో ఇలా ఏడ్చింది. దానితో చేరితే నువ్వూ నాశనమైపోతావురా నాయనా. అది నిన్ను సర్వనాశనం చేస్తుందిరా" రంగమ్మ గుండెలు బాదుకుంటూ ఏడ్చింది.

"అమ్మా... అమూల్యకి నేను పరిచయం కానంతవరకూ వాళ్ళు హాయిగా ఉన్నారు. నేను వాళ్ళ జీవితంలో ప్రవేశించాకేగా మరి వాళ్ళకి అన్ని నష్టాలు జరిగాయి. మరి నేను నష్టజాతకుడినేమోనని నువ్వు ఒక్కసారైనా ఎందుకు అనుకోలేదు? అమ్మా, నాకివన్నీ చెప్పాలని చూడకు. నేనీ నష్టజాతకాలూ, అపశకునాలూ ఇవేవీ నమ్మను"

"అదేదో మందు పెట్టిందిరా నీకు. నాకు ముందునుంచే అనుమానంగా ఉంది. దాన్ని చూడగానే అంతవరకూ బుద్ధిగా ఉన్నవాడివల్లా ప్రేమా, ప్రేమా అని ఎగిరావు. పోనీ పెళ్ళన్నా చేసుకుందా? ఎగిరి వెళ్ళి వాళ్ళవాడ్నే చేసుకుపోయింది. పోనీలే పీడా పోయిందంటే వాడ్ని వదిలిపెట్టి వచ్చి మళ్ళీ నీ మెడకి చుట్టుకుంది. వద్దురా తండ్రీ. మనకి దాని ఊసువద్దు. హాయిగా ఉండరా నాయనా. పోనీ, కావాలంటే ఎవరిచేతనన్నా డబ్బు పంపించు. నీక్కావలసినంత ఇస్తాను. నువ్వు మాత్రం పోకు" తల్లి మళ్ళీ ఏడ్చింది.

"అమ్మా. ఒక స్త్రీవి, ఇంకో ఆడపిల్లకి తల్లివి అయి ఉండి కూడా ఎంత నిర్దయగా మాట్లాడ్తున్నావు. అమూల్యా భర్తని విడిచిపెట్టి వచ్చిందని ఎంత తేలిగ్గా అనేశావు. అలాంటి భర్తని విడిచిపెట్టక పట్టుకుని ఉంటారా అమ్మా" సూటిగా చూస్తూ అడిగాడు విజయ్.

"దాన్ని అనవసరంగా అనాల్సిన అవసరం నాకేముంది? ఏదో నిన్ను పట్టుకుందని నా బాధగానీ"

"అంటే నీదాకా వస్తేగానీ నీ మంచితనం తెలియదన్నమాట. సరేలే" అన్నాడు విజయ్.

అప్పుడు రాజారావు మళ్ళీ నోరు విప్పాడు. "అమ్మకే కాదు. నాకూ ఆ అనుమానం ఉందిరా. అది నీమీద ఏదో మంత్రం ప్రయోగించింది. లేకపోతే ఎంతో బుద్ధిమంతుడివి, ఇట్లా పాడయిపోతావా. దానిచుట్టూ దీపం చుట్టూ శలభంలా తిరిగి మాడి మసైపోకు" అన్నాడు.

"అసలు మీకెందుకింత వ్యతిరేకత? ఎప్పుడూ ఎవరికి ఏ సాయంచేసినా సంతోషించేవాళ్ళు మీరు. ఆమెకి చేస్తే ఎందుకింత బాధపడ్తున్నారు? " అన్నాడు విజయ్.

"ఎందుకా? మామూలుగా అయితే మాకేం బాధలేదు. కానీ దానిమొగుడు పచ్చి దుర్మార్గుడు. వాడు నిన్నేం చేస్తాడో ఏమో? వాడి పెళ్ళానికి నువ్వు ఫ్రెండువని తెలుసుకుని నీమీద కక్ష కడతాడో ఏమో? ఎందుకొచ్చిన గొడవ? కోరి కోరి చిక్కుల్లో పడడం దేనికీ? " అన్నాడు రాజారావు.

"అలా భయపడి నేను వెనక్కిపోను. నేను చేసేది మంచిపని అని నేను నమ్మితే, ఇక ఎవరికో భయపడి వెనక్కు మళ్ళడం నా జీవితంలో లేదు"

రాజారావు మెల్లగా స్వరం మార్చాడు. "నాన్నా విజయ్, నువ్వు చిన్నపిల్లాడివి. నీకు తెలీదు. పోనీ, నిన్ను బొత్తిగా సాయం చెయ్యొద్దనటంలేదుగా. డబ్బు కావాలంటే ఎవర్తోనన్నా పంపిస్తుండు. నా తండ్రీ. దయచేసి నామాట విను. మాకన్నా నీ

మంచి కోరేవాళ్ళెవరు? మా మాట వినరా కన్నా. మనం మర్యాదస్తులం. దానిమొగుడా పెద్ద క్రిమినల్. అట్లాంటివాడితో మనకు శతృత్వం వద్దు. వాళ్ళ వెనక రౌడీలుంటారు, గ్యాంగ్‌లుంటాయి. మనం వాళ్ళతో పడలేం" అన్నాడు.

"నేను భయపడను. అలా భయపడ్తే ఆమెని పెళ్ళి ఎలా చేసుకోవాలనుకుంటాను" అన్నాడు విజయ్.

అంతే...

అక్కడ ఆటంబాంబు పేలినట్లయింది.

అంతా నిశ్చలంగా, శిలల్లా నిలబడ్డారు.

రెప్ప వాల్చడం కూడా మర్చిపోయి, విజయ్‌వైపు అలాగే నిశ్చలంగా చూస్తున్నారు.

"ఏమిటీ? " రాజారావు ముందుగా షాక్ నుండి తేరుకున్నాడు.

"అవును. నేను అమూల్యని పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు విజయ్.

"నీకేమైనా మతిపోయిందా? "

"పోలేదు కాబట్టే చేసుకుందామనుకుంటున్నాను. అమూల్య సంగతి నాకు బాగా తెలుసు. ఆమె ఒట్టి బేల. ఒక్కత్తే బతకలేదు. ఒంటరిగా ఉండలేదు. నేను ఆమెకి ఆసరాగా ఉంటాను. ఇందాక మీరన్నారుగా ఆమెకీ నాకూ ఏమిటి బంధమని? ఇదే ప్రశ్న ఇంకెవరన్నా వేసే అవకాశం లేకుండా మొహం పగిలేట్లు అమూల్యా నా భార్య అని సమాధానం ఇస్తాను. అమూల్యకి విడాకులు రాగానే ఆమెని పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు విజయ్ ఉద్వేగంగా.

రాజారావు కోపం పట్టలేక అరిచేశాడు. "ఫూల్... వెధవా, ఆ పని గనక చేశావంటే నీ భవిష్యత్తు మొత్తం శాశ్వతంగా మూసుకుపోతుంది. నువ్వు నాశనమైపోతావు. నీకేమన్నా పిచ్చెక్కిందా? నువ్వు కాస్త సాయం చేస్తేనే, దాని మొగుడు ఏం చేస్తాడోనని భయపడి చస్తుంటే, నువ్వు ఏకంగా దాన్ని పెళ్ళే చేసేసుకుంటావా? " అన్నాడు.

"అవును. నేను ఆమెకి తోడుగా నిలవడానికే నిశ్చయించుకున్నాను"

"భలేగా వల వేసిందిరా అది. ఇలా నిన్ను లొంగదీసుకుని మళ్ళీ పెళ్ళి చేసుకుంటుందన్నమాట? "

"అనవసరంగా మాట్లాడకండి. ఆమెకేం తెలీదు. నేనీ విషయం ఆమెకి చెప్పనేలేదు. అమూల్య వెంటనే ఒప్పుకుంటుందని నేను అనుకోవడంలేదు. ఎట్లాగైనా ఒప్పించి చేసుకుంటాను. అమూల్య శాంతిగా బతకాలంటే అంతకన్నా మార్గంలేదు"

రాజారావు ఇక కోపం పట్టలేక, విజయ్ చెంప ఛెళ్ళుమనిపించాడు.

ఆ చెయ్యి మళ్ళీ ఇంకోసారి తగిలే లోపలే విజయ్ దాన్ని పట్టి ఆపేశాడు.

"వాడ్ని కొడతారేం... మీ అంత పెరిగిన కొడుకు" అంది రంగమ్మ.

"అవును. పెరగటం నా అంతా పెరిగాడు. కానీ బుద్ధిమాత్రం లేదు. ఒరేయ్... నీకు చేతినిండా డబ్బు ఇస్తుంటే ప్రేమా, గీమా అంటూ ఎగుర్తున్నావు. బాగా విను. నేను చెప్పినట్లు వినకపోతే నీకు ఒక్కపైసా కూడా ఇవ్వను. ఫో... ఇక్కడ్నుంచి ఫో..." అని అరిచాడు రాజారావు.

విజయ్ ఆ మాటకి భయపడతాడని ఊహించాడు రాజారావు. కానీ అలా జరగలేదు.

విజయ్ గిర్రున వెనక్కి తిరిగాడు.

"సరే... వెళ్తున్నాను" అన్నాడు.

వెనకే తల్లీ, చెల్లీ ఘొల్లుమన్నారు.

"ఊరుకోండి. ఎవరు చచ్చారని ఇద్దరూ ఏడుస్తున్నారు. నోళ్ళు మూసుకుని కూర్చోండి. వాడితో మాట్లాడినా, వాడిని కలుసుకునేందుకు వెళ్ళినా, మిమ్మల్ని చంపి పారేస్తాను. లోపలకు నడవండి" భళ్ళున తలుపులు వేశాడు రాజారావు.

విజయ్ వెనక్కి తిరిగి వస్తాడని అతని ఆశ. ఇన్నాళ్ళూ విజయ్ ఎన్నిచోట్ల తిరిగినా, రాజారావు డబ్బుమాత్రం పంపిస్తూనే ఉన్నాడు. కాబట్టి, విజయ్‌కి డబ్బు లేకుండా




బతకటం చేతకాదని ఆయనకి తెలుసు. ఈ లోకంలో ఏది లేకపోయినా బతకొచ్చుకానీ డబ్బు లేకుండా మాత్రం బతకలేరు. ఇంకా స్పేపట్లో విజయ్‌కి ఆ సత్యం తెలిసిపో తుంది. ఇవాళ కాకపోతే రేపు... లేకపోతే ఎల్లుండి. అంతే... కట్టుబట్టలతో వెళ్ళి ఎన్నాళ్ళని బతకగలడు.

లోపల ఆశ మినుకుమినుకుమంటోంది కాబట్టి కొడుకు వెళ్ళిపోయాడని భార్యలా భోరుమనకపోయినా, ఎంత బాధగా ఉన్నా రాజారావు మాత్రం కాస్త నిబ్బరంగానే ఉండగలిగాడు.

"వాడే తిరిగి వస్తాడు. ఏడవకండి. ఈ మోజులూ, ఆకర్షణలూ ఎన్నాళ్ళుంటాయి" అని వాళ్ళను ఓదార్చాడు.



విజయ్ రోడ్డుమీదకి వచ్చి నిలబడ్డాడు. ఎటుపోవాలో, ఏం చేయాలో అర్థంకాలేదు. చివరికి బలరాంకి ఫోన్‌చేసి క్లుప్తంగా సంగతి వివరించాడు.

"ఇలా అవుతుందని ఊహించాను. అందుకోసమే నీకు అసలు అమూల్యా గురించి చెప్పకూడదనుకున్నాను కూడా" అంటూ బలరాం నొచ్చుకున్నాడు.

"అలా అనుకోకు. అంతా మంచికే అయిందనుకుంటున్నాను. సరే బలరాం... నాక్కాస్త డబ్బు కావాలి. ఎంత చిన్న ఉద్యోగమైనా సరే... తొందరగా ఏదో ఒక ఉద్యోగం కూడా కావాలి" అన్నాడు విజయ్.

"సరే... నువ్విప్పుడు ఎక్కడున్నావు?"

"మా ఇంటిదగ్గర బస్‌స్టాప్‌లో"

"సరే... అక్కడే ఉండు. నేను వెంటనే బయల్దేరి అక్కడికి వస్తున్నాను" అన్నాడు బలరాం.

అన్నట్లుగానే పదిహేను నిమిషాల్లో బలరామ్ అక్కడికి వచ్చేశాడు.

"విజయ్... నాకు చాలా బాధగా ఉంది. అమూల్య సమస్యలు సరే, నీకే ఇప్పుడు నిలువనీడ లేకుండా అయింది. ఇప్పుడెలా? వెళ్ళి మీ వాళ్ళతో రాజీ పడరాదూ?" అన్నాడు బలరాం.

"అది అసంభవం" అన్నాడు విజయ్ దృఢంగా.

బలరాం నిట్టూర్చాడు.

"సరే... ఇప్పుడేం చేద్దాం మరి?" అన్నాడు.

"ముందు నేను ఉండేందుకు చోటుకావాలి. రేపట్నుంచీ కూలిపనికైనా సరే నేను సిద్ధం. నా కాళ్ళమీద నేను నిలబడగలగాలి అంతే" అన్నాడు విజయ్.

"విజయ్ నీకు వంట వచ్చా?" అంటూ ప్రశ్నించాడు బలరాం.

"ప్రయత్నిస్తే చెయ్యగలను"

"విజయ్! నా ఫ్రెండ్ జయరాజ్ అని ఉన్నాడు. ఇక్కడే ఉండి చదువుకుంటున్నాడు. హాస్టల్ ఇష్టంలేక గది తీసుకుని ఉంటున్నాడు. వంటకి మనిషిని పెట్టుకోవాలనుకుంటున్నాడు. ఎవరూ దొరకలేదు. నువ్వేం అనుకోకపోతే అతని దగ్గర ఉండి వంట చేస్తుంటే నీకు తిండీ, వసతీ సమస్య ప్రస్తుతానికన్నా తీరుతుంది. మంచి ఉద్యోగానికి ప్రయత్నించి, రాగానే వెళ్ళిపోవచ్చు అక్కడ వంట చేస్తూనే మధ్యాహ్నం పూట

ఉద్యోగం కూడా చేసుకోవచ్చు ఇది నా సూచన మాత్రమే. ఒకవేళ నీకు వంట ఇష్టంలేకపోతే మొహమాటం లేకుండా చెప్పు. నిన్ను స్నేహితుడిగానైనా అతని గదిలో ఉండేందుకు ఒప్పుకుంటాడు. చాలా మంచివాడు. బాగా డబ్బుంది. అతనికి ఇంకో మనిషి ఖర్చు భారంకాదు" అన్నాడు బలరాం.

"ఊరికే ఉండడం నాకిష్టంలేదు. వంట చేస్తూ ఉద్యోగ ప్రయత్నం చేస్తాను" అన్నాడు విజయ్.

ఇద్దరూ వెంటనే జయరాజ్ ఇంటికి వెళ్ళారు. బలరాం విజయ్ పరిస్థితంతా వివరించాడు.

"అతను ఇక్కడ సంతోషంగా ఉండవచ్చు నాకేం అభ్యంతరంలేదు" అన్నాడు జయరాజ్.

అది ఒక చిన్న పోర్షన్. రెండు గదులూ, ఒక వంటగదీ ఉన్నాయి.

"ఆ గది మీరు వాడుకోవచ్చు" అన్నాడు జయరాజ్. బలరాం, విజయ్‌లిద్దరూ వెళ్ళి మరీ అవసరమైన బట్టలు కొన్నారు. వంటల పుస్తకం కొన్నారు.

విజయ్ కష్టపడి వండడం నేర్చుకున్నాడు.

జయరాజ్ విజయ్‌ని అర్థం చేసుకున్నాడు. ఇద్దరూ మంచి స్నేహితులయ్యారు.

అక్కడ వంట చేస్తూనే విజయ్ ఉద్యోగ ప్రయత్నాలు సాగించాడు. ఒక ఆఫీస్‌లో పార్ట్‌టైమ్ ఉద్యోగం దొరికింది. సగంపూట పని ఉంటుంది.

రోజూ అమూల్యని కలుసుకుంటూనే ఉన్నాడు. ఆమెకి కోర్టుకి వెళ్ళాల్సివస్తే తోడు వెళ్ళడం, ఇంటికి కావల్సిన సరుకులు కొనటం చేస్తున్నాడు.

ఈలోగా రాజారావూ, రంగమ్మా అతన్ని తిరిగి ఇంటికి తీసుకువెళ్ళామని ప్రయత్నించారు. కానీ విజయ్ వెళ్ళలేదు.

అమూల్యా తండ్రి తిరిగి కోలుకోలేదు. కొడుకు కుటుంబం ఆత్మహత్య, కూతురి దుర్భరస్థితీ అన్నీ కలిసి అతన్ని హరించివేశాయి. బెంగతో, చింతతో, దుఃఖంతో కృంగిపోయిన ఆయన గుండె ఇక దుఃఖాన్ని ఏమాత్రం భరించలేనట్లు ఒకరోజు ఆగిపోయింది.

అమూల్యా శవంవైపే చూస్తూ నిశ్చలంగా ఉండిపోయింది. విజయ్ అక్కడికి చేరుకోగానే ఆమెకి అప్పుడు భోరుమని దుఃఖం వచ్చింది. ఆమెని ఎలా ఓదార్చాలో అర్థంకాక విజయ్ మౌనంగా ఉండిపోయాడు. ఆమె తండ్రి పరిస్థితి చూస్తుంటే ఆయన ఇక కోలుకోడనీ, ఎన్నోరోజులు బతకడనీ వాళ్ళకి స్పష్టంగా తెలిసిపోయింది ఇంతకు ముందే. అయినా ఆశ మనిషికి దేవుడిచ్చిన వరం. కాబట్టి ఆయన బాగవుతాడనే ఆశించారు. కానీ అమూల్యా తండ్రిని కూడా పోగొట్టుకోవలసి వచ్చింది.

విజయ్, జయరాజ్, బలరామ్ కలిసి దహనక్రియలకి ఏర్పాటు చేశారు.

దహనం జరుగుతుంటే విజయ్ చితిమంటలకేసి మౌనంగా చూస్తూ ఉండిపోయాడు.

★ ★ ★

విజయ్ పార్ట్‌టైమ్ ఉద్యోగం చేస్తున్న ఆఫీసులో అసిస్టెంట్ మానేజర్ పోస్ట్ ఖాళీ అయింది. ఆ ఆఫీసువాళ్ళకి అతని సామర్థ్యం, నిజాయితీ తెలుసు. అతను అప్లై చేస్తే అతనికి ఆ ఉద్యోగం ఇచ్చారు. పర్మనెంట్ ఉద్యోగం.

జయరాజ్ పరిచయం కూడా విజయ్‌కి మేలుచేసింది. జయరాజ్ ఎన్నో సేవా కార్యక్రమాల్లో పాల్గొనేవాడు. విజయ్‌కి స్వతహాగా అట్లాంటివి చాలా ఇష్టం కాబట్టి అతనూ జయరాజ్‌తో కలసి వెళ్ళటం మొదలుపెట్టాడు. రానురానూ అవి తనకి ఎంతో సంతృప్తినిస్తున్నాయనీ, తన దృక్ప




థంలో చాలా మార్పు వచ్చిందనీ అతను గ్రహించగలిగాడు.

జయరాజ్ తనకి జీవితం యొక్క అర్థాన్ని తెలిపాడని అనిపించేది విజయ్‌కి.

★ ★ ★

విజయ్ అమూల్యా వంక చూశాడు. మంచంమీద ఒక మూలగా కూర్చుని ఉంది. ఉన్న ఒక్క కుర్చీలో విజయ్ కూర్చున్నాడు.

అమూల్యా కళ్ళకింద నల్లటి చారలు, నల్లబడి, చిక్కిశల్యమైన శరీరం. ఊడిపోయి పల్చబడిన జుట్టు, దీనంగా ఉన్న కళ్ళు... చూసి నిట్టూర్చాడు.

అమూల్యా తన అందం, లావణ్యం పోగొట్టుకుంది అనుకున్నాడు. అయినా అతను ఇంకా ఆమెని ప్రేమిస్తూనే ఉన్నాడు. అది ఒకనాటి ఉద్రేకభరితమైన, ఉద్వేగపూరితమైన ప్రేమ కాదు. అది అతని గుండెని వణికించి, సుఖంలేకుండా చేసిన తొలినాటి ప్రేమ కాదు. అది అతని ఆనాటి ప్రేమలా జలపాతాల వేగం, సుడిగుండాల చురుకూ ఉన్న ప్రేమ, అతన్ని ఉక్కిరిబిక్కిరి చేసిన ప్రేమ కాదు. ఇప్పుడు ఆ ప్రేమ ఒక శాంత వాహిని, ఒక చల్లటి సెలయేరు. ఒక ఒయాసిస్సు. దాహం తీర్చే నీరు. ఆకలి చల్లార్చే ఆహారం, చల్లటి నీడనిచ్చే తరువు, ప్రశాంతతనీ, చల్లదనాన్నీ ఇచ్చే ప్రేమ అది. అతను ఆనాటి అసంతృప్తి, ఆశాపూరితమైన ప్రేమికుడు కాదు. ఇప్పుడతను తన ప్రేమతో తన గుండెని పరిపూర్ణం చేసుకుని శాంతినీ, ప్రేమనూ ఇతరులకు కూడా పంచగలడు.

మంచి పుస్తకాలు చదవడం, అమూల్యా జీవితాన్ని కళ్ళారా చూడటం. ఇంకా ఇతరుల బాధల్ని గమనించి పంచుకోవటం అతని మనసుని పరిపక్వం చేశాయి. అతని దృక్పథాన్ని విశాలం చేశాయి.

అమూల్యాని పెళ్ళి చేసుకుంటానని అతను ఆరోజున తల్లితండ్రులతో అన్నా, పెళ్ళంటే తనకు విరక్తి కలిగిందని అతను తెలుసుకున్నాడు. అమూల్యా ఎప్పుడూ దిగులుగానే ఉండటంవల్ల మళ్ళీ పెళ్ళి గురించి ఎన్నడూ ఆలోచించలేదు. అందువల్ల ఆ ప్రసక్తి వాళ్ళ మధ్య ఎన్నడూ రాలేదుకూడా.

ఇతరులకి సాయం చెయ్యటంలోనే తనకు ఆనందం దొరుకుతోందని అతను గ్రహించాడు. ఒక స్వచ్ఛంద సంస్థలో చేరాడు. బీదలకు అన్నదానం, వస్త్రదానం, మందుల పంపిణీ మొదలైన కార్యక్రమాల్లో పాల్గొనేవాడు. మురికివాడల్లో పిల్లలకు చదువు చెప్పేవాడు.

అమూల్యా ఎప్పుడూ దిగులుగా కూర్చునేది. ఆమెని మళ్ళీ మామూలు మనిషిని చెయ్యాలని అతను ఆశించాడు.

"అమూల్యా ఎప్పుడూ దిగులుగా కూర్చుంటావేం? కష్టాలొచ్చాయని బాధపడకు. జీవితాన్ని అర్థంచేసుకుని జీవిత పరమార్థం తెలుసుకునేందుకు దేవుడు నీకిచ్చిన అవకాశం ఇది అనుకో" అన్నాడు.

"మన కష్టాలవల్ల అవెంత బాధాకరమో తెలుసుకుని ఇతరుల కష్టాలని సానుభూతితో అర్థంచేసుకోవాలి. మన అనుభవాలు మనకు పాఠాలు నేర్పే గురువులు" అని చెప్పాడు విజయ్.

★ ★ ★

రాజారావూ, రంగమ్మా అనుకున్నట్టే జరిగింది. అమూల్యా భర్త విజయ్‌మీద కక్షకట్టాడు.

అతను విజయ్‌ని కూడా కేసులోకి ఈడ్చాడు. అమూల్యాకీ విజయ్‌కీ అక్రమ సంబంధం ఉందనీ, అందుకే అమూల్యా తనతో వైవాహిక జీవితం గడపటానికి నిరాకరిస్తోందనీ ఆరోపించాడు. అమూల్యా ఇంకా ఆ సంబంధాన్ని కొనసాగిస్తోందనీ, విజయ్, అమూల్యా కలిసి తనని అనేక రకాలుగా వేధిస్తున్నారనీ వాపోయాడు. తనతో వైవాహికజీవితం గడపకుండా, వేరే



ఉంటూ, ప్రియుడితో అక్రమ సంబంధం కొనసాగిస్తూ, అమూల్య తనని వేధిస్తున్న దని మొరపెట్టుకున్నాడు. తను వివాహ బంధం పట్ల బోలెడు పవిత్రమైన అభి ప్రాయం కలవాడు కాబట్టి, ఇంత జరిగినా తన భార్యను క్షమించి, ఆమెతో వైవాహిక జీవితం కొనసాగించాలనుకుంటున్నాడు కాబట్టి, వైవాహిక సంబంధ పునరుద్ధరణకు, సంసార జీవితాన్ని సాగించటానికీ కోర్టు వారు అనుమతివ్వాలని వాదించాడు.

అతను బోలెడన్ని మొసలి కన్నీళ్ళు కార్చాడు. అతని ప్లీడరు బ్రహ్మాండంగా వాదించాడు. అయినా అతను ఓడిపో యాడు. నేర ప్రపంచంలో అతనికున్న సంబంధాలు రుజువయ్యాయి. అతను అప్ప టికే కొన్ని కేసుల్లో నేరస్థుడిగా నిరూపించ బడ్డాడు. అన్నిటికన్న ముఖ్యంగా అతనికి అదివరకే పెళ్ళయిందనటానికి రుజువులు కూడా దొరికాయి.

విడాకులు మంజూరయ్యాయి.

అతను దాన్ని సహించలేకపోయాడు. అమూల్యనీ విజయ్‌నీ నోటికి వచ్చినట్లు తిట్టి, బెదిరించాడు.

"నువ్వేదో అమాయకురాలివనుకున్నాను గానీ నువ్వు చాలా తెలివిగల దానివి. నిన్ను వదిలిపెడతాననుకోకు. నీమీద తప్ప కుండా పగసాధిస్తాను. నీ అంతం చూస్తాను" అన్నాడతను పోలీసులతో వెళుతూ.

విజయ్ ఆ మాటల్ని లెఖ్ఖ చెయ్యలేదు గానీ అమూల్య మాత్రం భయపడిపో యింది.

"విజయ్ అతనేం చేస్తాడో?" అంది.

"భయపడుతున్నావా?" విజయ్ అడి గాడు.

"అవును... కానీ నా గురించి కాదు. నీ గురించి"

"అమూల్యా, ఎందుకు అనవసరంగా భయపడతావు? అతను జైల్లో ఉన్నాడు. ఏం చెయ్యగలడు?"

"అతని తోడు దొంగలుంటారుగా బయట. వాళ్ళకి పురమాయిస్తాడేమో"

"ఏమీ కాదు. భయపడకు" విజయ్ ఆమెని శాంతపరుస్తూ అన్నాడు.

అమూల్య ఏం మాట్లాడలేదు కానీ ఆ భయం ఇంకా ఆమెని వణికిస్తూనే ఉంది. అతను విజయ్‌కి ఏ అపకారం తలపెడతా డోనని భయంగానే ఉంది ఆమెకి. అతను అమూల్యద్వారా, ఆమె శరీరాన్ని ఎరవేయ టంద్వారా తన ఆపదలన్నీ గట్టెక్కాలని ప్రయత్నించాడు. కానీ అందుకు బదులుగా అమూల్య మూలంగానే జైలుకెళ్ళాల్సి వ చ్చింది. ఆ కక్షని విజయ్‌మీద సాధిస్తాడు. ఈ ఊహతో ఆమె విజయ్ గురించి అహ ర్నిశలూ భయపడేది.

రంగమ్మ ఒకసారి అమూల్య ఇంటికి వచ్చింది.

"విజయ్‌ని మానుంచి వేరుచేశారు కదే. నీ మొగుడో క్రిమినల్. వాడో రౌడీ. వాడి కింద రౌడీలు పనిచేస్తున్నారు. వాళ్ళు అన్నెం పున్నెం ఎరగని నా కొడుక్కి ఏం అపకారం తలపెడతారో ఏమో? వాడ్ని చంపిపారేసినా దిక్కులేదు" కోపంగా అరి చింది ఆమె.

అమూల్య నిస్సహాయంగా చూసింది.

"ఆంటీ... నేను ఏం చెయ్యగలను?" అంది.

"నిన్ను కలుసుకోవద్దని విజయ్‌కి చెప్పు"

"చెప్పాను. వినటంలేదు. విజయ్‌కి నామూలంగా కష్టాలెదురవటం నేను భరిం చలేను" అంది అమూల్య.

"నిజంగా అంటున్నావా?"

"అవును ఆంటీ. నన్ను నమ్మండి. ప్లీజ్. విజయ్ భవిష్యత్తు నా మూలంగా పాడ వటం నాకు ఇష్టంలేదు. అతను సంతో షంగా ఉండాలని మనస్ఫూర్తిగా కోరుకుం టున్నాను" అమూల్య ఏడ్చింది.

"నువ్వు నిజంగా అంత నిజాయితీగా




ఉంటే, వెంటనే హైదరాబాద్ విడిచిపెట్టి ఇంకెక్కడికన్నా పో" అంది రంగమ్మ.

"ఎక్కడికి పోగలను? నేనొక అనాథని. ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను. ఒక వేళ బయట ఎక్కడన్నా దొరికితే తప్పకుండా పోతాను. ఏదో ఒకటి తప్పకుండా దొరుకుతుందనే అనుకుంటున్నాను" అంది అమూల్య.

"నీ మాటమీద నిలబడాలి" అమూల్యని ఆజ్ఞాపిస్తున్నట్లుగా అని బయటకు నడిచింది రంగమ్మ.

అమూల్య కొయ్యబారినట్లయిపోయి కూర్చుంది. 'ఎటుపోవాలి నేను?' తనని తాను ప్రశ్నించుకుంది. కన్నీళ్ళు చెక్కిళ్ళపై ధారలు కట్టాయి. చీకట్లు ముసిరాయి. చీకట్లు ఆమెని చుట్టుముట్టాయి. లైట్ వేసుకోవాలన్న ఆలోచన కూడా లేకుండా అలాగే కూర్చుండిపోయింది..

తలుపు తట్టిన చప్పుడయింది.

విజయ్ ఆమె ముందు నిలబడ్డాడు. అతని కళ్ళు స్నేహాన్నీ, ప్రేమనీ వెదజల్లుతున్నాయి.

"అమూల్యా అలా ఉన్నావేం? ఏం జరిగింది? ఎవరన్నా ఏమన్నా అన్నారా?" అడిగాడు విజయ్.

కొందరు మనుషులు కావాలనే ఆమెని అవమానించటానికి ప్రయత్నించటం అతనికి తెలుసు. ఎవరి కామెంట్స్ మూలంగానైనా ఆమె మనసు పాడయిందేమోననుకున్నాడు.

"లేదు" అమూల్య నీరసంగా చెప్పింది.

"మరి?"

"ఏం లేదు"

"ఏ పార్కుకన్నా పోయి కూర్చుందాం. కాస్త తాజా గాలి పీల్చినట్లవుతుంది" అన్నాడు విజయ్.

"కూర్చో ఇప్పుడే వస్తాను" అమూల్యా అయిదు నిమిషాల్లో తయారైవచ్చింది. ఇంటికి తాళంపెట్టి పార్కువైపు నడిచారు ఇద్దరూ.

ఇకమీద తనను కలుసుకోవద్దని చెపుదామని ప్రయత్నించింది అమూల్య. ఏదో విషాదం ఆమె గొంతుని పట్టేసి మాట్లాడనివ్వలేదు.

ఇద్దరూ పచ్చికలో కూర్చున్నారు.

"విజయ్... నువ్వు మీ తల్లిదండ్రుల్ని బాధపెడుతున్నావు. నువ్వు సుఖంగా ఉండి, జీవితంలో స్థిరపడాలని వాళ్ళకుంటుంది కదా" అంది.

విజయ్ సమాధానం చెప్పలేదు.

"విజయ్... నా బాధలేవో నేను పడతాను. నన్ను మర్చిపో ప్లీజ్" అంది అమూల్య మళ్ళీ.

విజయ్ ఆమెకేసి సూటిగా చూశాడు అమూల్య తలవంచుకుంది.

"అమూల్యా... బహుశా మా అమ్మగారు నిన్ను కలుసుకుని వెళ్ళినట్లుంది. ఆవిడ మళ్ళీ వస్తే చెప్పు. నీపట్ల నా ప్రేమ ఇదివరకటి ప్రేమ కాదు. ఇది స్వచ్ఛమైనది. నిన్నే కాదు... నేను అందర్నీ ప్రేమిస్తున్నాను. నా తల్లితండ్రుల్ని కూడా. ఇక నీకు నేను ఎందుకు సాయం చేస్తున్నానంటే నీకది అవసరం కాబట్టి. అంతే కాదు. అవసరమైన అందరికీ నాకు వీలైన సాయం చెయ్యాలని నా కోరిక. దానికోసం ఒక కార్యక్రమం కూడా రూపొందించుకోవాలనుకుంటున్నాను" అన్నాడు.

అతను అప్పటికే దానిగురించి చెప్పి ఉన్నాడు కూడా. నిజానికి ఆ కార్యక్రమాల్లో అతనితోపాటు పాలుపంచుకోవాలని ఆమె అనుకుంది. కానీ ఇప్పుడు అతనికి దూరమవ్వాలనీ, ఆవిధంగా చేస్తే అతను తన తల్లితండ్రులకు దగ్గరవుతాడనీ అనుకుంది. రంగమ్మ మాటలు ఆవిధంగా ఆలోచించేట్లు చేశాయి.

"ఇదంతా తాత్కాలికం... ఏదో ఉద్రేకంలో ఉన్నాడు. ఉడుకు నెత్తురులో ఇవన్నీ



మామూలు. ఏవేవో కలలూ ఆశలూ అంటూ పెద్ద మాటలు మాట్లాడతారు. కొన్నాళ్ళు నీకు దూరంగా ఉంటే వాస్తవాలు గ్రహిస్తాడు" అంది రంగమ్మ అమూల్యతో.

"అమూల్యా" విజయ్ పిలిచాడు.

అమూల్య తల ఎత్తి చూసింది. ఆమె కళ్ళు చెమ్మగిల్లి ఉండటం గమనించాడు విజయ్. అమూల్య తననెందుకు అర్థంచేసుకోవటంలేదో అతనికర్థంకాలేదు.

"అమూల్యా, నేను దృఢంగా నిశ్చయించుకున్నాను" ఆమె భావాల్ని చదివినట్లే అన్నాడతను.

అమూల్య అస్పష్టంగా ఏదో గొణిగింది.

ఇద్దరూ కాసేపు మౌనంగా ఉండిపోయారు. పార్కులో ఆడుకుంటున్న పిల్లల వైపు చూసింది అమూల్య. విజయ్ కూడా పెళ్లి చేసుకుని, పిల్లల్ని తీసుకుని పార్కుకి రావాలి అని కోరుకుంది.

"అమూల్యా, ఇంకేం ఆలోచించకు" అన్నాడు విజయ్.

అమూల్య సమాధానం చెప్పలేదు. వాళ్ళు ఇంటికి తిరిగివస్తున్నారు.

విజయ్ ఆమె మనసుకి కాస్త ఊరటగా ఉంటుందని ఏదో చెపుతూ వస్తున్నాడు. ఆమె పరధ్యానంగా వింటోంది. వాళ్ళిద్దరూ రోడ్డుమీద నడుస్తున్నారు. రాత్రి ఎనిమిది గంటలవుతోంది. రోడ్డుమీద ఇంకెవరూ లేరు. నిర్జనంగా ఉన్న రోడ్డు ఆమె మనసులోని ఒంటరితనాన్ని ఇంకాస్త పెంచుతోంది.

'ఈ నిర్జనత్వం... ఈ ఒంటరితనం విజయ్ జీవితంలో ఉండకూడదు' అనుకుందామె.

ఇంతలో హఠాత్తుగా ఎవరో వీధిదీపం మీదికి రాయి విసిరారు. అది భళ్ళున శబ్దం చేస్తూ, విరిగి ముక్కలై కిందపడింది. అంతలోనే ఒక కత్తి సర్రుమని విజయ్‌వైపు దూసుకువచ్చింది. భయభ్రాంతురాలైపోయిన అమూల్య ఒక్కసారిగా విజయ్‌ని పక్కకి లాగేసింది. ఒక్కక్షణం ఆలస్యమైనా ఆ కత్తి అతని గుండెని చీల్చేసి ఉండేదే.

విజయ్ చలించలేదుగానీ అమూల్య మాత్రం నిలువునా కంపించిపోయింది.

"ప్లీజ్ విజయ్ వెళ్ళిపో. మళ్ళీ రాకు. నీకేమైనా అయితే భరించలేను" ఏడ్చేసింది అమూల్య.

విజయ్ ఆమె కళ్లల్లోకి చూశాడు.

"అమూల్యా వందసార్లు చెప్పాను. నేను నిన్ను నీ ఖర్మానికి వదిలిపోను. నేను నీ పక్కన ఉండగానే ఇలా ఉంటే... నువ్వొక్క దానివే అయితే ఎలా ఉంటుందో ఆలోచించు" అన్నాడు.

"నాకేమైనా పర్వాలేదు" అంది అమూల్య.

"నేనూ అదే అంటాను"

"నీ సాయం నాకక్ఖర్లేదు" గట్టిగా అంది అమూల్య.

"అమూల్యా, ఎమోషనల్ అవకు"

"అదేంలేదు. ఎవరిమీదా ఆధారపడటం నాకిష్టంలేదు"

"సరే. నీకు ఉద్యోగం వస్తే నీ కాళ్ళమీద నువ్వు నిలబడ్డట్లే. అప్పుడింక నువ్వు అడిగి తేగానీ రాను" అన్నాడు విజయ్.

★ ★ ★

విజయ్ అమూల్య ఇంట్లో అడుగుపెట్టాడు. అతని చేతిలో కొన్ని నిత్యావసర సరుకుల పాకెట్లున్నాయి. వెళ్ళి వాటిని వంటింట్లో పెట్టి వచ్చాడు. అమూల్య బెంగగా కూర్చుని ఉండటం చూసి బాధపడ్డాడు.

"అమూల్యా, ఎంతసేపిలా ఇంట్లో కూర్చుంటావు? కాస్త బయట తిరిగివద్దాం రా" అన్నాడు.

అమూల్య మాట్లాడలేదు.

"లే... తొందరగా లేచి బయల్దేరు" తొందరపెట్టాడు విజయ్.

అమూల్య శవంలా లేచింది. అయిష్టంగానే మొహం కడుక్కుని తయారయింది.

ఇద్దరూ గార్డెన్‌లో కూర్చున్నారు. పక్కనే చిన్న సరస్సు ఉంది. అస్తమిస్తున్న





సూర్యుడి కిరణాలు నీళ్ళల్లో మెరుస్తు న్నాయి. ఆ ఎర్రటి సంధ్యకాంతి తనని భయపెడుతున్నట్లు తోచింది అమూల్యకి. తనపట్ల లోకం చూపుతున్న అనాదరణని ఆ కాంతి ప్రతిఫలిస్తున్నట్లుగా అనిపిం చింది. లోకమంతా భయంకరంగా కనిపిం చింది. ఏదో భయం చుట్టుముట్టింది.

"అమూల్యా"

అమూల్యా విజయ్‌వైపు చూసింది. అంత లోనే ఇద్దరు పక్కన నిల్చుని వెకిలిగా నవ్వటం కనిపించింది.

"ఇది..."

"అదే. మన బాస్ పెళ్ళాడింది దీన్నే"

"అవును. కానీ ఆరోజు రంభలా ఉంది. ఇప్పుడు చిక్కిపోయినట్లుందికదూ... అయినా చక్కగానే ఉంది"

"అయితే ఇంకేం. ఓ రాత్రి గడుపు. పక్కన ఎవడో కూర్చున్నాడుగా. వాడు ఏర్పాట్లు చూస్తాడు"

"హ...హ...హ" ఇద్దరూ వెకిలిగా నవ్వారు. అమూల్యా భయపడిపోయింది. కన్నీళ్లను ఆపుకోవటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తోంది"

విజయ్ రక్తం మరిగిపోయింది. అతని కళ్ళెర్రబడ్డాయి. కోపంతో వణికిపోయాడు.

ఒక్కసారిగా నిలబడి, ఊపుగా వాళ్ళ ముందుకు నడిచి ఒకడి కాలర్ పట్టుకు న్నాడు. ఇంతలో మరొకడు ముందుకు దూకి విజయ్‌ని కొట్టటం మొదలుపెట్టాడు. కొద్దిక్షణాల్లోనే జనం ఇదంతా గమనించి అక్కడికి రాబోవటం, అది గమనించి వాళ్ళి ద్దరూ అక్కడ్నుంచి పారిపోవటం జరిగిపో యింది.

"తర్వాత చూసుకుందాం" వెళ్తూ వెళ్తూ అరిచారు వాళ్ళు.

"అసలేం జరిగిందండీ?" కొందరు అడి గారు విజయ్‌ని. ఏం చెప్పాలో తెలియక విజయ్ మౌనంగా కూర్చుండిపోయాడు.

అమూల్యా తల ఎత్తలేకపోయింది. నెమ్మ దిగా జనం ఎవరికి తోచిన వివరణ వాళ్ళు ఇచ్చుకుంటూ వెళ్ళిపోయారు.

'ఇదంతా నా మూలాన్నే. విజయ్ తల్లి చెప్పినట్లే నేను ఎక్కడికన్నా వెళ్ళిపోతే విజయ్ భవిష్యత్తు బాగుపడుతుంది. నావల్ల విజయ్‌కి అవమానాలు ఎదురవుతు న్నాయి' అనుకుంది అమూల్యా.

విజయ్ క్షేమం కోసం ఆమె గుండె తపిం చిపోయింది. విజయ్... ఎంతో హుందాగా జీవితం గడిపే వ్యక్తి, ఎన్నో సుఖాలు అను భవించాల్సిన మనిషి. నా కోసం ఇన్ని అవ మానాలూ, కష్టాలూ సహించాల్సి వస్తోంది. లేదు, ఇకమీదట ఇలా జరక్కూడదు. ఏదో ఒకటి చెయ్యాలి నేను' అని నిర్ణయించు కుంది.

"అమూల్యా, నువ్వేం ఆలోచిస్తున్నావో తెలుసు. కానీ నేను పిరికివాడ్ని కాను. ఇది వరకూ చెప్పాను. నువ్వుగాక మరెవరున్నా ఈ పరిస్థితిలో నేను సాయం చేసేవాడ్నే. వాళ్ళ ఖర్మకి వాళ్ళని వదిలిపోవడం నావల్ల కాదు" అన్నాడతను స్థిరంగా.

అమూల్యా జవాబు చెప్పలేదు.

"అమూల్యా, ఇంకో సంగతి. వీళ్ళు ఇవాళ చేసినట్లు రేపు గొడవ చెయ్యరు. వాళ్ళ ముందు నీ తల వంచకు. నువ్వు ధైర్యంగా వాళ్ళ కళ్లల్లోకి చూడగలగాలి. వాళ్ళని ఎదు ర్కోవటానికి చూడు. అంతేగానీ వాళ్ళని ఎలాగో ఒకలా వదిలించుకు పారిపోవాలని ప్రయత్నించకు. వాళ్ళు ఎన్నాళ్ళని నిన్ను బాధించగలరు. అదీగాక వాళ్ళు కిరాయి రౌడీలు. ఇంకో బాస్‌ని వెతుక్కుని పోతారు. అంతదాకా వాళ్ళకి వీలైతే నిన్ను ఏడిపించటానికి చూస్తారు. వాళ్ళ మాట లకు నువ్వు బాధపడితే, వాళ్ళ లక్ష్యం నువ్వు నెరవేర్చినట్లవుతుంది. అందుకని ధైర్యంగా ఉండు. వాళ్ళని కేర్ చెయ్యకు" మృదువుగా ఆమెకి చెప్పాడు విజయ్.

అమూల్యా సమాధానం చెప్పలేదు.

'వీళ్లు నోరు మూస్తే, మరొకడు నోరు తెరుస్తాడు. ఈ సమాజం చాలా పెద్దది. దాని నోరు ఇంకా ఇంకా పెద్దది. నాకేం పర్వాలేదు. ఇది నా తలరాత. నేను భరించాలి. కానీ విజయ్ వీటన్నిటినీ ఎందుకు ఎదుర్కోవాలి? అతను సంతోషంగా ఉండటం కావాలి నాకు. దానికోసం ఏమైనా చేస్తాను. ఏదో ఒకటిచేసి, అతను నన్ను మర్చిపోయేట్లు చూడాలి' అమూల్య మనసులో అనుకుంది.

★ ★ ★

గవర్నమెంట్ ఆఫీసులో క్లర్కు పోస్టు కోసం రాతపరీక్ష పాసయ్యింది అమూల్య. ఇంటర్వ్యూకి పిలిచారు.

"ఎక్కడైనా పనిచేస్తారా?" వాళ్ళు అడిగారు.

"పనిచేస్తాను" అంది అమూల్య.

వాళ్ళు వింతగా చూశారు. అందులోనూ ఆడవాళ్ళు హైదరాబాద్ తప్ప ఇంకెక్కడా ఇష్టపడరు. అమూల్య ఎక్కడికైనా వెళతాననటం వాళ్ళకి వింతగా అనిపించింది.

అమూల్యకి వెంకటాపురంలో క్లర్కుగా పోస్టింగ్ ఆర్డర్స్ వచ్చాయి.

"అక్కడ ఎలా, ఎక్కడ ఉంటావు?" విజయ్ అడిగాడు.

"అది నా స్వవిషయం. నేను చూసుకుంటాను" కఠినంగా సమాధానం ఇచ్చింది.

విజయ్ నవ్వేశాడు. అమూల్య అతన్ని కూర్చోమని చెప్పలేదు. అతనికి దాహంగా అనిపించి, వంటింట్లోకి వెళ్ళి మంచినీళ్లు తాగాడు.

"విజయ్, అది చిన్న ఊరు. అక్కడ అందరూ కొత్త మనుషులు నాకు. నువ్వెప్పుడూ రాకు. నేనక్కడ కొత్త జీవితం ప్రారంభించాలనుకుంటున్నాను" గబగబా చెప్పేసింది.

"సరే" అతని స్వరంలో మార్పులేదు.

"ఆ తర్వాత..." ఆమె ఆగింది.

"ఊ... ఇంకేంటి?"

"నువ్వు నువ్వు మంచిపిల్లను చూసి పెళ్లి చేసుకోవాలి"

"అది నా స్వవిషయం. నేను చూసుకుంటాను" అతను ఆమె మాటల్ని అనుకరిస్తూ అన్నాడు.

"నేను సీరియస్‌గా చెపుతున్నాను" అంది అమూల్య.

"అవును"

"విజయ్ ప్లీజ్... మీ ఇంటికి తిరిగివెళ్లు. మీ తల్లిదండ్రులతో కలిసి ఉండు. నీ ప్రవర్తనతో వాళ్ళను బాధపెడ్తున్నావు" అంది అమూల్య.

"అమూల్యా, నేనేం చెయ్యాలో నిర్ణయించుకునే ఉన్నాను. నీక్కూడా చాలాసార్లు చెప్పాను. అందుకని ఆ విషయం ఇక మాట్లాడకు. నువ్వు కొత్తచోటికి వెళ్తున్నావు. అక్కడ మనుషులు, ఊరు వాతావరణం అంతా కొత్త. నువ్వు హైదరాబాద్ వదిలి వెళ్ళిపోవాలని దృఢసంకల్పంతో ఉన్నావు. సరే సంతోషంగా ఉండు. గతం మర్చిపో. నీకేమన్నా కావాలంటే నేనెప్పుడూ సిద్ధమే. ఏ సాయం కావాల్సినా ఒక కార్డు రాసినా, ఫోన్ చేసినా చాలు. సరేనా" అతను అన్నాడు.

అది చివరి కలయికని ఇద్దరికీ అర్థమైంది.

అమూల్య కళ్ళల్లోంచి నీళ్ళు కారాయి. తన భావాలను దాచుకుందామని వ్యర్థప్రయత్నం చేసింది. అతన్ని గట్టిగా కౌగిలించుకుని ఏడ్చి ఏడ్చి ఏడ్చి ఇంకెన్నటికీ కళ్లల్లో నీళ్లు రానంత గట్టిగా, మనసారా విలపించాలన్న కోరికను అతికష్టంమీద అణుచుకుంది.

అతను ఆమెని అర్థం చేసుకున్నాడు. ఆమె ఎందుకు హైదరాబాద్ వదిలి వెళ్ళిపోతానని పట్టు పట్టిందో అతనికి తెలుసు. ఆమె త్యాగాన్నీ, ఆవేదననీ, ఆందోళననీ అర్థం చేసుకున్నాడు.

ఇద్దరూ మౌనంగా ఎటో చూస్తూ నిల

బడ్డారు.

★ ★ ★

సూర్యా నర్సింగ్‌హోమ్‌కి తనతోపాటు తెచ్చిన పేషెంట్‌తోసహా వచ్చాడు విజయ్.

విజయ్ ఇప్పుడు లా చదువుతున్నాడు. నైట్ కాలేజ్‌లో చదువుతూనే సమాజసేవలో చురుగ్గా పాల్గొంటున్నాడు. ఆరోజు కాలేజీకి శలవు. అతను పనిచేస్తున్న స్వచ్ఛంద సంస్థవాళ్ళు అతనికి ఆరోజు ఒక పేషెంట్‌ని సూర్యా నర్సింగ్ హోమ్‌లో చేర్పించే బాధ్యత అప్పగించారు. డాక్టర్‌కోసం ఎదురుచూస్తున్నారు ఇద్దరూ.

ఇంతలో లేడీ డాక్టర్ రూమ్‌లోంచి సన్నగా ఏడుపు వినవచ్చింది. రూమ్ తలుపు తెరిచి ఆయా ఎవర్నో బయటకు వెళ్ళమని అడుగుతోంది. ఆ పేషెంట్ ఏడుస్తూ బతిమాలుతోంది. డాక్టర్ విసుక్కుంటోంది.

"లాభం లేదమ్మా. రెండువేలు ఇస్తేగానీ పని మొదలుపెట్టను. తర్వాత ఇస్తామంటారు. మళ్ళీ మొహం చూపించరు. అయినా పెళ్ళి కాకుండా ఎందుకు తొందరపడ్డావు. అనుభవించు" అంది డాక్టరు.

"డాక్టరుగారూ, మా ఇంట్లో తెలిస్తే చంపేస్తారు. అందుకని ఇంత వేడుకుంటున్నాను. ప్లీజ్... ఈ అయిదువందలతో పనికానివ్వండి. మీడబ్బు త్వరలోనే ఇచ్చేస్తాను. నన్ను నమ్మండి"

"అది కుదరదు. నువ్వు ఎవడినో నమ్మి మోసపోతే నాదా బాధ్యత? పో. డబ్బు లేకపోతే గవర్నమెంటు ఆస్పత్రికి పో" డాక్టర్ కరుగ్గా అంది.

"అందరికీ తెలిసిపోతుందేమోనని భయం..."

"అంత భయపడేదానివి ఇంత పని ఎలా చేశావు. నాకు కుదరదు" ఖచ్చితంగా చెప్పింది డాక్టర్.

పరిచితమైన ఆ కంఠం విజయ్‌ని వణికించింది. తలుపుదగ్గర అలికిడయ్యింది. విజయ్ ఒక మూలగా నిలబడ్డాడు, ఆ వ్యక్తికి కనబడకుండా.

అతని అనుమానం నిజం అయింది. ఆ వ్యక్తి లలిత. అతని గుండె బద్దలయ్యింది.

అయ్యో... ఇది తెలిస్తే అమ్మానాన్నా ఏమైపోతారు. ఆ ఆలోచనలతో అతను వణికిపోయాడు.

ఒక్క నిమిషం లలితమీద నిలువెత్తు కోపం వచ్చింది. ఆమెని చంపి ముక్కలు చెయ్యాలన్నంత కోపం వచ్చింది.

కొద్ది క్షణాల్లోనే ఆ కోపం మాయమయింది.

లలిత తనకు మాటమాత్రం తెలియచేస్తే ఎంత బాగుండేది? వెర్రిబాగుల్ది. వయసు చేసే అల్లరితో, పిచ్చిగా ఎవరినో ప్రేమించి, నమ్మి, మోసపోయి ఉంటుంది. తను ఇప్పుడు ఎంతమందికో సేవలు అందిస్తున్నాడు. సలహా ఇస్తున్నాడు. జీవితంలో మోసపోయినవారికి ఎంతమందికో తమ సంస్థ సాయం చేసింది. పెళ్ళి చేసుకుంటానని చెప్పి మోసం చేసిన వాళ్ళకి బుద్ధిచెప్పి, పెళ్ళి చేయించింది. ఇప్పుడు తన చెల్లెలి విషయమైనా అంతే. అందరికీ చేసినట్లు ఆమెకూ సాయం చేయాలి.

రేపే వెళ్ళి లలితతో మాట్లాడి, సంగతేమిటో తెలుసుకోవాలి.

లలిత మనసు శిరీష మనసులా సున్నితం కాకపోయినా, ఇప్పుడు ఈ సమస్యతో గుండె చెదిరిపోయినట్లు కనిపిస్తోంది. భోరున ఏడ్చిన లలిత ఏడుపూ, వణుకుతున్న ఆమె శరీరం గుర్తుకొచ్చి అతని గుండె కలిచివేసినట్లయింది. అరిటాకు సామెత రోజూ గుర్తుచేసుకుంటూనే ఆడవాళ్ళు మగవాళ్ళని నమ్మి ఎలా మోసపోతారా అని జాలివేసింది.

లలిత ఏడుస్తూ వెళ్ళిపోయింది. ఇంటికయినా సరిగ్గా వెళ్ళిందో లేదోనని అతనికి భయం వేసింది.

తనతో తెచ్చిన పేషెంట్‌ని అడ్మిట్ చేయించి వెంటనే ఇంటివైపు వెళ్ళాడు.

దూరంనుంచి ఇంటివంక చూశాడు.

తల్లీతండ్రీ ఆరుబయట కుర్చీల్లో కూర్చుని చల్లగాలి పీలుస్తున్నారు.

లోపలగదిలో లలిత కనిపించింది.

అమ్మయ్య, క్షేమంగా చేరిందన్నమాట అనుకున్నాడు.

రేపే లలితని కలుసుకుని మాట్లాడి, అక్కడ్నుంచి తర్వాత కార్యక్రమం ఏమిటో చూడాలి. "సమస్యని ధైర్యంగా ఎదుర్కోనేందుకు నీ అన్నయ్య నీకు తోడు ఉంటాడు లలితా. ఏం భయపడకు" అని చెప్పాలి, అనుకుంటూ వెనుతిరిగాడు.



అర్థరాత్రి...

హఠాత్తుగా ఎవరో బలంగా కుదుపుతూ లేపడంతో విజయ్‌కి మెలకువ వచ్చింది.

జయరాజ్...

"విజయ్... లేచావా" అన్నాడతను. అతని మొహంలో ఆందోళన కనిపిస్తోంది.

"ఏం జరిగింది? " ఏదో బలమైన కారణం లేందే జయరాజ్ అలా లేపడని విజయ్‌కి తెలుసు.

"విజయ్. నువ్వు గుండె చిక్కబట్టుకోవాలి. ఇందాక మీ నాన్నగారు ఫోన్‌చేశారు. మీ చెల్లాయి లలిత..."

"ఊ... లలిత"

"కాలిన గాయాలతో ఉస్మానియాలో ఉందిట. బతికే ఛాన్స్‌లేదుట. మీ నాన్నగారు నిన్ను వెంటనే రమ్మని చెప్పమన్నారు. మీ అమ్మగారు షాక్‌లో ఉన్నారుట. నిన్ను వెంటనే రమ్మన్నారు" అన్నాడు జయరాజ్ కంగారుగా.

అతను ప్యాంట్, షర్టు ధరించి సిద్ధంగా ఉన్నాడు. విజయ్ లేచి ఆదరాబాదరాగా బట్టలు తొడుక్కుని బయల్దేరాడు. ఇద్దరూ జయరాజ్ బైక్‌మీద హాస్పిటల్‌కి చేరుకున్నారు. వాళ్ళు వెళ్ళేసరికి అంతా అయిపోయింది. లలిత మరణించింది.

విజయ్‌ని చూస్తూనే రంగమ్మ ఘొల్లుమంది. "ఇప్పుడు వచ్చావా నాయనా. చూడరా...చెల్లాయిని చూడరా... ఏ స్థితిలో ఉందో" అని బావురుమని ఏడ్చింది.

రాజారావు ఏడవడంలేదు. కానీ ఆయన పూర్తి షాక్‌లో వున్నాడు. పిచ్చిచూపులు చూస్తున్నాడు. విజయ్‌కి తల్లితండ్రుల్ని ఎలా ఓదార్చాలో అర్థం కాలేదు. అతనికి తెరలుతెరలుగా దుఃఖం వస్తోంది.

తండ్రి చెయ్యి తన చేతిలోకి తీసుకున్నాడు. రాజారావు కొడుకు భుజంమీద తల వాల్చి ఒక్కసారిగా బావురుమన్నాడు.

విజయ్ తననితానే నిందించుకుంటున్నాడు. నిన్న లలిత మానసికస్థితి చూడగానే తను ఆమె ఆత్మహత్య చేసుకుంటుందని ఎందుకు ఊహించలేకపోయాడు. పరువుకోసం పాకులాడే ఇంట్లో, క్రమశిక్షణ పేరుతో శిక్షించే పెద్దలు, ఇంత పెద్ద తప్పుని క్షమిస్తారని లలిత ఎంతమాత్రం అనుకోదు. ఇంకేదారీ లేనప్పుడు, చావే దారి అనుకుని ఉంటుంది. తను అప్పుడే లలితను కలుసుకుని మాట్లాడి ఉంటే, ఎంత బాగుండేది? చేసిన తప్పే తిరిగి, తిరిగి





చేస్తున్నట్లు... అదే పొరపాటు... తనజీవితంలో మళ్ళీ మళ్ళీ జరుగుతుంది. నిన్న గనక లలితని వెంటనే కలుసుకుని ధైర్యం చెపితే ఈ పరిస్థితి వచ్చేదికాదు. అతను మౌనంగా కుమిలిపోయాడు.

★ ★ ★

అమూల్యకి ఉద్యోగం దొరికింది వెంకటాపురంలో. అది విశాఖపట్నం దగ్గర ఉంది. చిన్నఊరు. లేడీస్ హాస్టల్ లేదు. ఎక్కడ ఉండాలో తెలీక భయపడింది.

అదే ఊళ్ళో ఉన్న రాజమ్మత్తకి ఉత్తరం రాసింది. ఆ ఉత్తరం అందగానే రాజమ్మత్తా, భాస్కరంమామయ్యా ఇద్దరూ హైదరాబాద్ వచ్చేశారు.

వాళ్ళు ఎప్పుడన్నా కార్యాలపట్ల వచ్చిపోతుంటారు. రాగానే బోలెడంత హడావిడి... గొడవ. ఇద్దరూ సరదాగా చిన్నపిల్లల్లా బోలెడంత హడావుడి చేస్తారు. అంతవరకూ మామూలుగా ఉన్న వాతావరణం కాస్తా వాళ్ళు రాగానే సడన్‌గా సరదాగా, ఆహ్లాదంగా మారిపోతుంది.

పిల్లాపెద్దా అందర్నీ పలకరించుకుంటూ వస్తారు. ఎంత చిన్న పార్టీ అయినా, పెద్ద ఫంక్షన్ అయినా, పిలిస్తేచాలు వచ్చి వాలిపోతారు. అందరికీ సాయం చేస్తారని బంధువుల్లో వాళ్ళకి మంచిపేరుంది. వాళ్ళు చాలా దూరం బంధువులు అమూల్యా కుటుంబానికి.

అమూల్యా వాళ్లకి ఉత్తరమైతే రాసింది గానీ నిజంగా వచ్చి సాయం చేస్తారని ఊహించలేదు. బంధువులూ, మిత్రులూ అంతా ఎవరిదారిన వాళ్ళు జారుకున్నారు. అట్లాంటి స్థితిలో, వాళ్ళు తనకోసం పనిగట్టుకుని వచ్చారనేసరికి భోరుమని ఏడుపు వచ్చేసింది. రాజమ్మత్తమీద వాలిపోయి ఒక్కసారిగా భోరుమంది.

"పిచ్చిమొహమా. ఎందుకే ఏడుస్తావు? కష్టాలు మనుషులకి రాక మానులకొస్తాయా? ఊరుకో... ఊరుకో" అంటూ ఓదార్చింది అత్తయ్య.

"అమూల్యా జాబ్‌కి ప్రయత్నంచేసి మంచిపని చేశావు. ఈ ఊళ్ళో అన్నీ పోగొట్టుకున్నావు. పోతే పోయిందిలే. అన్నీ మర్చిపోయి, హాయిగా ఆ ఊళ్ళో కొత్త జీవితం ప్రారంభించు" అన్నాడు మామయ్య ఆప్యాయంగా చూస్తూ.

"మామయ్యా... చాలా భయంగా ఉంది. కొత్తఊరు. కొత్త మనుషులు. అసలే ఈ పరిస్థితులతో కుంగిపోయి ఉన్నాను. ఇక ఉద్యోగం చేయాలి. కొత్త వాతావరణం" అంది అమూల్య.

"ఏం భయపడకు. కొత్తఊరు, కొత్త మనుషులైతే ఏం? మేమంతా లేమూ? నీకేలోటూ ఉండదు. మా ఇంట్లోనే ఉండు. మేం నీకు అన్నివిధాలా అండగా ఉంటాం. ఇంకేం ఆలోచించకు. సర్దాల్సినవి సర్దుకుని, హాయిగా వచ్చెయ్యి" అంది రాజమ్మత్త.

అమూల్యకి పోయిన ప్రాణం లేచి వచ్చినట్లయింది. ఎక్కుడుండాలో, ఏం చెయ్యాలోనన్న బాధ తప్పింది.

భాస్కరం మామయ్యా, రాజమ్మత్తా ఎంత మంచివాళ్ళు. బంధువులంతా తెగతెంపులు చేసుకున్నారు. స్వార్థప్రపంచం... అంతా ఎవరికివాళ్ళు వాళ్ళ స్వార్థం చూసుకుంటారు. లోకం అంతా అలా ఉంటే, ఒక్కొక్కళ్ళ మనస్తత్వం చూసి తను ఎప్పటికప్పుడు ఆశ్చర్యపోతుంటే, వాస్తవాలు తెలుసుకుని మనసు బండబారిపోతుంటే చివరికి కనీసం ఇప్పుడు మనుషుల్లోనూ మంచివాళ్ళున్నారని తెలియచెప్తున్నట్లుంది వాళ్ళ ప్రవర్తన.

"అత్తయ్యా..." అమూల్యా కళ్ళు కృతజ్ఞతతో వర్షించాయి.

"అమూల్యా, నాకు శలవులేదు. నేను వెళ్ళిపోతాను. అత్తయ్య నీతోపాటే ఉండి, అన్నీ సర్ది తీసుకొస్తుంది" అన్నాడు మామయ్య.

అమూల్య కళ్ళనీళ్ళతో తల ఊపింది.

భాస్కరం మామయ్య మర్నాడు వెళ్లిపోయాడు. రాజమ్మత్త ఉండిపోయి అన్నీ సర్దటంలో సాయంచేసింది.

సామానంతా అప్పులు తీర్చడానికీ, అవసరాలకీ ముందే అమ్మేశారు. ఇక స్టౌ, ఒక పెద్ద సంచిలో వంటసామాన్లు, కొన్ని పుస్తకాలు, కాసిని బట్టలు... అంతే అమూల్య సామాను.

అందం, ఐశ్వర్యం... పేరుప్రతిష్ట, కుటుంబసభ్యులు, అన్నీ నిండిన జీవితంతో ఆ ఊర్లో గడిపిన రోజులన్నీ సమాధి చేసి. సర్వస్వం పోగొట్టుకుని పొట్ట చేతబట్టుకుని, దిక్కులేని పక్షిలా హైదరాబాద్ వదిలిపెట్టింది అమూల్య.

★ ★ ★

ఆఫీసులో అడుగుపెట్టిన అమూల్యకి మొదటిరోజే అదోమాదిరి వాతావరణం, భయాన్ని కలిగించింది.

ఆమె పని చేసే సెక్షన్‌లో ఆరుగున్నారు. ఒక సెక్షనాఫీసర్.

ఏమాత్రం ఉత్సాహం చూపించకుండా ఆమె పోస్టింగ్ ఆర్డర్ చూశాడు ఆఫీసరు. ఆ తర్వాత ఎగాదిగా ఆమెవైపుచూశాడు.

అమూల్య ఇబ్బందిగా సర్దుకుంది.

ఆ తర్వాత ఆయన సెక్షన్ మొత్తం ఒకసారి కలయచూసి, తర్వాత కప్పువైపూ, నేలవైపూ ఇంకా ఎటెటో చూసి చూసి చివరకు మళ్ళీ కళ్ళు అమూల్యమీద నిలిపాడు.

"ఊ..." అని మూలిగాడు.

"అయితే... నువ్వేనన్నమాట" అన్నాడు.

అమూల్యకి ఏం చెయ్యాలో అర్థంకాలేదు. ఆయన కనీసం కూర్చోమని కూడా అన్లేదు.

ఆయనకి ఎదురుగా ఒక కుర్చీ ఉంది. చూసి చూసి చివరకు అమూల్య తనే కూర్చుంది.

ఆయన అదోలా చూశాడు.





"ఏం పని చెయ్యగలవు నువ్వు? అంతా కొత్త. మళ్ళీ పనంతా నేర్పించాలి" అన్నాడు మళ్ళీ మూలిగి.

అమూల్య ఏం సమాధానం చెప్పాలో తెలియక మౌనంగా ఊరుకుంది.

"ఇదివరకటి క్లర్కుకి అన్నీ నేర్పాను. ఇంతలో ఆయన్ని ట్రాన్స్‌ఫర్ చేసేసి, నిన్ను వేశారు. నీకు మళ్ళీ అన్నీ నేర్పాలి. ఇలా నేర్పుతూ కూర్చుంటే, నా పనెవరు చేస్తారు" అన్నాడు.

"పనేమిటో తెలిస్తేచాలు. నేర్చుకుని తొందరగా చెయ్యడానికి ప్రయత్నిస్తాను" అంది అమూల్య.

ఎంత తెలివితేటలున్నా, అసలు పనేంటో, ఎలా చెయ్యాలో ఒక్కసారన్నా చూడనిది ఎవరు చెయ్యగలరు?

సెక్షన్లో అంతా ఎవరికివారు, ఏమీ పట్టనట్లు కూర్చున్నారు.

"ఈవిడకి కాస్త పని నేర్పిస్తారా ఎవరన్నా?" అడిగాడు ఆఫీసరు.

అంతా ఫైల్స్‌లో తమ తలలు దూర్చుకుని కూర్చున్నారు. ఎవరూ సమాధానం చెప్పలేదు.

"హు..." అని మూలిగాడు ఆఫీసర్.

"సరేగానీ ఆ సీట్లో కూర్చో" అన్నాడు ఒక సీటు చూపించి.

అమూల్య వెళ్ళి ఆ సీట్లో కూర్చుంది.

"ఫైళ్ళు తెరిచి చూస్తుండు" అన్నాడు.

అమూల్య తెరిచి చూసింది. అంతా అయోమయంగా అనిపించింది.

"డిస్పోజ్ చెయ్యడానికి ప్రయత్నించు" అన్నాడు.

అమూల్య రెండు ఫైల్స్ తెరిచి చూసింది.

ఏమీ అర్థంకాలేదు. తను ఇంతవరకూ ఎక్కడా పనిచెయ్యలేదు. ఎలా చెయ్యాలో ఏమిటో బొత్తిగా తెలీదు. ఎవరూ సహకరించేట్లూ, సాయంచేసేట్లూ కనిపించలేదు. ఏం చెయ్యాలి? కనీసం మర్యాదకైనా తల ఎత్తి పలకరించడంలేదు. ఎక్కడ పలకరిస్తే

ఆమెకి పనినేర్వాలో అన్నట్లు మొహాలు పెట్టుకుని కూర్చున్నారు.

పోనీ ఎవరికివాళ్ళు తమపనిలో బిజీగా ఉన్నారేమో అనుకుంది అమూల్య. కానీ అదేం లేదు. కాస్సేపవగానే ఫైల్స్ అవతల పారేసి నవల తెరిచింది ఒక క్లర్కు. ఇంకో క్లర్కూ, టైపిస్టూ కలిసి, టీకని వెళ్ళి పత్తా లేరు. మిగిలినవాళ్ళు వాళ్ళల్లోవాళ్ళు జాతీయ, అంతర్జాతీయ విషయాలన్నింటి మీదా కబుర్లాడుకుంటున్నారు. సెక్షనాఫీసరు ప్రపంచంలోని సమస్త కష్టాలూ తనకే వచ్చినట్లు ఏడుపుమొహం పెట్టుకుని, కన్నీళ్ళొక్కటే తక్కువన్నట్లు చూస్తున్నాడు.

ఆ పూట గడిచిపోయింది.

లంచ్‌టైమ్‌లో కాంటీన్‌కి వెళ్ళి టిఫిన్‌తిని టీ తాగింది. అప్పుడు మాత్రం లేడీక్లర్కులు ఇద్దరూ వచ్చి మాట్లాడారు.

ఆ తర్వాత కూడా ఏపనీ చెయ్యలేకపోయింది. సెక్షనాఫీసరు అప్పుడప్పుడూ కోపంగా, అసహనంగా చూస్తున్నాడు.

"మన సెక్షనాఫీసరుతో జాగ్రత్తగా ఉండాలి సుమా. ఆయనకి ఏ పనీ రాదు. మనం అన్నీ చక్కగా చేసి పంపిస్తే, సంతకం పెట్టి పై ఆఫీసరుకి పంపిస్తారు. జిత్తుల మారి మనిషి. ఆఫీసరు దగ్గర ఏవో కబుర్లు చెప్పి పని గడుపుకుపోతున్నాడు. అలాగే ప్రమోషన్లు కూడా సంపాదించేసి, పనిరాకపోయినా ఆఫీసరయిపోయాడు" అంది జానకి అనే క్లర్కు.

"మరి సెక్షన్లో పని ఎలా అవుతుంది?" ఆశ్చర్యపోతూ అడిగింది అమూల్య.

"ఏముంది... పని బాగా వచ్చినవాళ్ళు సెక్షన్‌కి ఒకరన్నా ఉంటారు. వాళ్ళమీద ఆధారపడి బతికేస్తూ ఉంటారు"

"నాకేం అర్థం కావటంలేదు"

"కొన్నాళ్ళాగు, అన్నీ అర్థం అవుతాయి" అది జానకి.

కొన్నాళ్ళాగకుండా కాసేపయాకే కాస్తకాస్త అర్థంకావటం మొదలుపెట్టింది అమూల్యకి. అక్కడ ఎవరికీ ఎవరంటే గౌరవంలేదు. ఎదురుగా బాగానే మాట్లాడినా వెనకాల వాడు, వీడు అని మాట్లాడుతున్నారు. ఆడవాళ్ళని అదీ, ఇదీ అంటున్నారు. ఆఖరికి ఆడవాళ్ళు కూడా మొగవాళ్ళని వాడు వీడు అనే చెపుతున్నారు వెనకాల ఏదన్నా చెప్పాల్సినప్పుడు.

సాయంత్రానికల్లా కోదండం స్వరూపం బయటపడింది.

"నువ్వు వచ్చి అప్పుడే ఒక రోజయిపోయింది. ఇవాళ ఏ పనీ చెయ్యలేదు. ఆఫీసరు నువ్వు వర్క్ ఏం చేశావో చూపించమంటే ఏం చెప్పాలి? అందుకే నాకు కొత్తవాళ్ళొద్దు మొర్రో అని మొత్తుకున్నాను. విన్నారా. నాకు తెచ్చి అంటగట్టారు" అంటూ రుసరుసలూ, సాధింపులూ మొదలుపెట్టాడు.

మౌనంగా అతని ఏడుపు భరించి ఇంటికి బయల్దేరింది.

ఆఫీసుకి ఇల్లు దూరమే. ఒక ఊరునుంచి మరొక ఊరు వెళ్ళే బస్సులు ఆఫీసుముందు ఆగుతాయి. అమూల్య ఇంటికి దగ్గరే మరొక స్టాపు ఉంది. మగవాళ్ళు కొందరు స్కూటర్లమీద వస్తారు.

★ ★ ★

అమూల్య ఇంటికి వెళ్ళేసరికి చీకటిపడింది.

"ఎట్లా ఉంది ఆఫీసు?" భాస్కరం మామయ్య నవ్వుతూ అడిగాడు.

"అంతా అయోమయంగా ఉంది"

"గవర్నమెంటు ఆఫీసులంటే అలాగే ఉంటాయి" భాస్కరం మామయ్య నవ్వుతూ అన్నాడు.

అమూల్య తనువూ, మనసూ అలసిపోయాయి.

"స్నానం చేసిరా. హాయిగా ఉంటుంది" అన్నాడు మామయ్య.

"అత్తయ్య లేదా?"

"లేదు... గుడికి వెళ్ళింది. ఇప్పుడప్పుడే



రాదు" భాస్కరం మామయ్య మొహంలో అదోమాదిరి మార్పు, అతని చూపులు అదోలా, వాపిరిగా ఉన్నాయి.

అమూల్య స్నానం చేసి వచ్చింది.

"భోజనం చేసేద్దాం. అత్తయ్య వచ్చేసరికి చాలా లేట్ అవుతుంది"

"ఫర్వాలేదు. వెయిట్ చేస్తాను. అవునూ. ఏగుడి?"

"ఇక్కడే ఆంజనేయస్వామి గుడి"

"నేనూ వెళ్ళొస్తాను"

"వద్దువద్దు ఉండరాదూ..." భాస్కరం మామయ్య కంగారుగా అన్నాడు. అతని మొహంలో నిరాశ.

"లేదు మామయ్యా నేనూ వెళ్ళి వస్తాను. గుడికి వెళ్ళి చాలా రోజులైంది" అంది అమూల్య.

దారి కనుక్కుని గుడి చేరుకుంది. చుట్టూ కాంపౌండ్ వాల్, వెనకవైపు చక్కటి పూల చెట్లు, మల్లెలు, పొన్న, పారిజాతం, జాజులూ గుప్పున వాసనలు వెదజల్లుతున్నాయి. అగరుబత్తీలూ, సుగంధద్రవ్యాలూ గుబాళిస్తున్నాయి. ప్రశాంత వాతావరణం. అమూల్యకి తన గుండెనిండా నిండిన అశాంతి కాస్తకాస్త తొలగిపోతున్నట్లనిపించింది.

చదువుకునే రోజుల్లో తండ్రితో గుడికి వెళ్ళటం, పురాణం వినటం గుర్తువచ్చి కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

జీవితం ఎంత తల్లకిందులయింది?

పోనీ... ఇక గతం గుర్తుతెచ్చుకోకూడదు.

గుడికి ఒక పక్క స్టేజ్ కింద పట్టాలు పరిచి ఉన్నాయి. ఎవరో పురాణం చెప్తున్నారు. కూర్చుని వింది.

ఆరుబయలు... చెట్లపైనుంచి వస్తున్న చల్లటి గాలి. మనసుని హాయిగొలిపేటట్లున్న సువాసనలు, మంద్రంగా వినబడుతున్న గంటల ధ్వని... ఇంపుగా చెప్పుకుపోతున్న పురాణం.

పొద్దుటి చీకాకులన్నీ దూరంచేస్తున్న వాతావరణం. అక్కడినుంచి కదలబుద్ధి కాలేదు.

గుళ్ళో ఎక్కడా రాజమ్మత్త కనిపించలేదు. తిరిగి వెళ్ళిపోయిందా? దార్లో కూడా కనిపించలేదే మరి అనుకుంది.

వాళ్ళు తనకోసం అన్నం తినకుండా ఎదురుచూస్తున్నారేమోనని అనుకుని వెంటనే బయల్దేరింది.

అనుకున్నట్లే వాళ్ళు ముందు హాల్లోనే కూర్చుని ఎదురుచూస్తున్నారు.

రాజమ్మత్త కొసరికొసరి తినిపించింది. వీళ్ళ రుణం ఎట్లా తీర్చుకోగలనా అనుకుంటూ నిద్రకి ఉపక్రమించింది అమూల్య. ఈ ఊరికి రాకముందే తను పేయింగ్ గెస్ట్‌గా ఉండేట్లయితేనే వస్తానని వాళ్లకి చెప్పేసింది అమూల్య. కానీ డబ్బుతోనే అన్ని ఋణాలూ తీరవు. ప్రేమ, ఆప్యాయతలకి ఎంత డబ్బు ఇచ్చినా సరిపోతుందా? వాటిని కొనగలమా అనుకుంది.

అమూల్యకి ఒక గది కేటాయించారు. అందులో మంచం, ఒక అలమరా ఉన్నాయి. నిద్రకి ఉపక్రమించింది అమూల్య.

గుడికి వెళ్లి రావటంవల్ల ఏర్పడిన ప్రశాంతతవల్ల కాబోలు, చాలా రోజుల తర్వాత అమూల్యకి భోంచేయగానే నిద్ర వచ్చింది.

కళ్ళు మూసుకుని ఆదమరిచి నిద్రపోయింది.

నడిరాత్రి...

తన ఒంటిమీద ఏదో పాకుతున్నట్లుంటే హఠాత్తుగా మెలకువ వచ్చింది.

పాముగానీ కాదుకదా అనుకుంటూ తోసేసింది.

పాముకాదు. పాముల్లా రెండుచేతులు మళ్ళీ ఒంటిమీద పడ్డాయి.

ఏం జరగబోతోందో అమూల్యకి అర్థమైపోయింది. ఒక్క దూకున లేచి లైట్





వేసింది. తన చేతుల్లో, ఆత్రంగా బంధించ బోతున్న ఆకారాన్ని చూసింది.

అంతే... అమూల్య కొయ్యబారిపోయి నిల్చుంది. ఎదురుగా భాస్కరం మామయ్య.

"మామయ్యా... నువ్వా..." అమూల్య జుగుప్సగా చూసింది.

భాస్కరం వెకిలి నవ్వు నవ్వాడు.

"అవును... నేనే. పాపం ఒక్కదానివే ఉన్నావు. ఎట్లా ఉన్నావోనని"

అమూల్య నిప్పులు కురిపిస్తూ చూసింది.

"అందుకని అర్థరాత్రి వచ్చి ఇలా చూస్తు న్నావా?. నువ్వు ముందు బయటకి నడు" అంది.

భాస్కరం ఇంకా పళ్ళికిలిస్తూనే ఉన్నాడు.

"అమూల్యా... ఎందుకంత కోపం. నీకా మొగుడు లేడు. కోరికలన్నీ దాచుకుని, వయసులో సరదాలన్నీ చంపేసుకుని, ఎందుకు బతుకుతావు. హాయిగా సుఖ పడు. ఉప్పూకారం తినే శరీరం. సెక్స్ అంటే తప్పేం కాదు. అదీ అన్నం నీళ్లలాగే ఒక శారీరక అవసరం. కాస్త ఎంజాయ్‌చేస్తే నువ్వూ ఆమాట ఒప్పుకుం టావు" అన్నాడు.

"నువ్వు నోర్మూసుకుని వెంటనే పోకపోతే నేను అరుస్తాను. అత్తయ్యకి తెలుస్తే నీ పని ఏమవుతుందో ఆలోచించు. ఆవిడ ముందు ఎంతో మంచి వాడిలా పోజుపెట్టి, చాటుగా ఇలా చేస్తావా? ఇదా నీ అసలు రూపం?" అమూల్య గట్టిగా అరవబో యింది.

భాస్కరం పళ్ళికిలించాడు.

"వెళ్ళు... వెళతావా లేదా?" అమూల్య గట్టిగా అరవబోతుండగా.

"వద్దు. అరవకు. సరే పోతున్నాను" అనేసి నిష్క్రమించాడు భాస్కరం.

అమూల్య వణికిపోతూ కూర్చుంది. ఇది ఎంత మాత్రం ఊహించని పరిస్థితి. ఇక్కడ తనకు రక్షణ లేదని స్పష్టంగా తెలిసిపో తోంది. ఏదో అత్తయ్య భయానికి ఇవాళ వెళ్ళిపోయాడుగానీ లేకపోతే ఎంతమాత్రం కదలకపోవచ్చును.

ఏం చెయ్యాలి? ఎక్కడికి పోవాలి?

"అన్నయ్య... డాడీ... నన్ను ఒంటరిని చేసి మీరంతా వెళ్ళిపోయారా!" బావురుమని ఏడ్చింది.

భాస్కరం మామయ్యగానీ మళ్ళీ వచ్చేస్తా డేమోనని భయంగానే ఉంది

తలుపు గడియ వేసుకుంది.

ఇంకో ఇల్లు చూసుకోవాలి.

ఇది చిన్న ఊరు. ఒంటరి ఆడదానికి ఎవరూ అద్దెకి కూడా ఇల్లు ఇవ్వరని వింది. అందులో తను విడాకులు తీసు కున్న స్త్రీ. హైదరాబాద్‌లాంటి నగరంలో అయితే ఫర్వాలేదుగానీ, ఇక్కడ తనకు ఇల్లు దొరకటం కష్టమే. పోనీ హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటే?

అప్పుడు విజయ్‌ని మళ్ళీ చూడాలి. అతను తన పరిస్థితికి బాధపడతాడు. మళ్ళీ గాయం రేగినట్లవుతుంది. కాస్త ఆగి... అతని పెళ్లి అయాక వెళితే అప్పుడు ఫర్వాలేదు. తను ఎన్ని కష్టాలన్నా పడనీ... కానీ విజయ్... విజయ్ సుఖంగా ఉంటే చాలు.

ఆరోజుకి ఇక నిద్రపట్టలేదు.

ఏదో ఉద్యోగం వచ్చింది. తన కాళ్ళమీద తను నిలబడగలిగిందంటే మళ్ళీ, ఏమిటీ సమస్యలు.

పరిస్థితి చూస్తే అక్కడ అలా, ఇక్కడ ఇలా ఉంది. అసలు ముఖ్యమైన సమస్య ఉద్యోగంలో నిలదొక్కుకోవటం.

ఆఫీసు చూస్తే అట్లా ఉంది. ఎవ్వరూ నేర్పకుండా పని ఎలా నేర్చుకోవాలి. పాత ఫైలు చూసి నేర్చుకుంటే వస్తుందేమో అన్న ఆలోచన వచ్చింది.

రేపు పొద్దున్నే వెళ్ళి మళ్ళీ ఆ ఫైల్స్ అన్నీ తిప్పిచూడాలి. దృఢనిశ్చయంతో పడు కుంది.

మర్నాడు పొద్దున్నే ఆఫీసుకి వెళ్ళింది.

అన్ని ఫైల్స్ తిప్పి చూసింది. అదే పరిస్థితి. ఏదీ బోధపడటంలేదు.

"టైప్ వచ్చా పోనీ" అడిగాడు ఆఫీసరు.

"రాదు"

"చంపావు, పోనీ అదన్నా వస్తే నాలుగు పేపర్లన్నా టైపుకొట్టావని చూపించేవాడిని. అదీలేదు. నాఖర్మ. ఇట్లాగే రోజులు గడిస్తే నీకు మెమో ఇవ్వాల్సివస్తుంది" అన్నాడు తూస్కారంగా చూస్తూ.

కన్నీళ్ళు రాకుండా ఎట్లాగో అదిమిపట్టుకుంది. ఒక గంట గడిచింది ఒక యుగంలా నరకంలో కూర్చున్నట్లు.

ఇంతలో సెక్షన్ మొత్తం కలకలం.

"హలో రంగం"

"హాయ్"

"ఓహో రంగం. వచ్చేశావా"

అంతా సంతోషంగా ఎవర్నో పలకరిస్తున్నారు.

ఎవరా అని చూసింది.

యాభైఏళ్లున్న పెద్దమనిషి. మంచి రంగులో నున్నగా నిగనిగలాడుతున్నాడు. మామూలుగా అయితే అతన్లో ప్రత్యేకంగా గుర్తు పెట్టుకునేందుకేమీ లేవు. కానీ అతని ప్రత్యేకత అతని కళ్ళు, మొహంలో ఫీలింగ్స్. ఆ కళ్ళు వెటకారంగా, వెక్కిరింపుగా ఉన్నాయి. ఆ మొహంలో భావాలు కూడా అవతల మనిషిని, 'ఏడిశావులే, నీ సంగతంతా తెలుసు' అన్నట్లు ఉన్నాయి.

అతన్ని చూడగానే అంతదాకా ధుమధుమలాడుతున్న సెక్షనాఫీసరు పిల్లిలా మారాడు.

ఏదో ఫైలు చూపించి దానిమీద ఏదో తన సందేహం అడిగాడు. అతను జవాబిచ్చాడు.

వాళ్ళు మాట్లాడే విధానాన్నిబట్టి ఆయన ఆఫీసర్. ఈ కోదండం అతని కింద పనిచేస్తున్నాడేమో అనుకుంది అమూల్య.

కానీ కొద్ది నిమిషాల్లోనే అది తప్పని తేలిపోయింది. రంగం ఆ సెక్షన్‌లో సీనియర్ మోస్ట్ యు.డి.సి. ఎన్నో ఏళ్ళనుంచి ఆ సెక్షన్‌లో పనిచేయటంతో అందులోని పని అంతా కొట్టిన పిండి అతనికి. రూల్సూ, రెగ్యులేషన్సూ అన్నీ వేలికొనలమీద ఉంటాయి. ఆఫీసు పనిలో అతనికి తెలియంది లేదు. అతను ఆ సెక్షన్‌కి ఒక వరం. అతను లేనిది ఆ సెక్షన్ లేదు.

రంగం ఇన్నాళ్ళూ సెలవులో ఉండి, ఇవాళే చేరాడు మళ్ళీ.

అతను తల ఎగరేసి, ఎవరీ కొత్తపిల్ల అన్నట్లు ఆఫీసర్‌వైపు చూశాడు.

"కొత్త క్లర్కు. ఏ. త్రీ సీటులో పోస్ట్ చేశారు. నిన్న జాయినయింది. పని బొత్తిగా రాదు. మరి... మరి... రంగం గారూ... కాస్త మీరు పని నేర్పుతారా ఆ అమ్మాయికి" అన్నాడు కోదండం.

రంగం ఒకసారి భుజాలు ఎగరేశాడు.

"చూద్దాం. అయినా నాకూ బోలెడంతపని పెండింగ్‌లో పడిపోయింది" అన్నాడు.

"అమ్మమ్మ... మీరు కాదనడానికి లేదు. ప్లీజ్... ఎలా అయినా ఆ పిల్లకి మీరు పని నేర్పించాలి" అన్నాడు కోదండం.

తన బదులు ఆయనే ప్రాధేయపడుతుండడంతో అమూల్యకి ఇక అడిగేందుకు ఏమీ లేకపోయింది.

పాపం కోదండం చాలా మంచివాడిలాగే ఉన్నాడు. తనకి పని నేర్పించడానికి ఒప్పుకుంటే అంతేచాలు. శ్రద్ధగా, చాలా కష్టపడి, వీలైనంత తొందరగా పని నేర్చుకునేందుకు ప్రయత్నిస్తుంది. దేవుడి దయవల్ల ఈ రంగం తనకి పని నేర్పేందుకు ఒప్పుకుంటే అంతేచాలు అని ప్రార్థిస్తూ కూర్చుంది.

రంగం మళ్ళీ వెటకారంగా నవ్వాడు.

అమూల్య దగ్గరకు వచ్చి నిల్చున్నాడు, "సరేలెండి. ట్రై చేస్తాను" అంటూ.

అమూల్య గౌరవంగా నిలబడింది. రంగం అమూల్యకన్నా చాలా పెద్దవాడు. వయసుకి గౌరవం ఇవ్వడం చిన్నప్పటి

నుంచీ అలవాటు.

"కూర్చో... కూర్చో..." అన్నాడు రంగం.

పక్కనే ఉన్న కుర్చీ లాక్కుని అమూల్య పక్కన కూర్చున్నాడు.

బల్లమీదనుంచి ఒక ఫైలు లాగాడు.

"ఇది చూడు" అన్నాడు దాన్ని తెరిచి చూపిస్తూ.

"ఒక ఖాళీ పుస్తకం తీసుకో" అన్నాడు.

ఖాళీ బుక్‌కోసం వెతికింది. దొరకలేదు.

"బీరువాలో ఉంటుంది" అన్నాడు. అక్కడా దొరకలేదు.

"పిల్లలకోసం ఇంటికి పట్టుకుపోతారు. ఈసారి స్టాక్ రాగానే నీకేమేం కావాలో తీసేసుకో. లేకపోతే ఉండవు. నాకు చిన్న పిల్లలు లేరు. ఇంటికి తీసుకెళ్ళే పనిలేదు. నా దగ్గర టేబుల్ డ్రాలో ఉన్నాయి. ఇస్తానులే" అని లేచి వెళ్ళి డ్రా తెరిచి, ఒక నోట్ బుక్ తీసుకువచ్చి ఇచ్చాడు.

పొడుగాటి పుస్తకం. లోపల రూళ్ళ కాగితం...

"నీ సీటు, నీ పేరు రాసుకో. అన్నట్లు నీ పేరేంటి? " అన్నాడు.

"అమూల్య"

"బాగుంది" అని తనే జేబులోంచి పెన్ను తీసి, అమూల్య అని పేరు రాసి సీటు నెంబరు కూడా అందంగా రాశాడు పుస్తకం మీద.

"ఇప్పుడు రాసుకో. అసలు నీ సీట్లో ఉండే పని ఇది. ఆ వివరాలు ఇవి. అవునూ డ్యూటీ లిస్టు ఉంటుందిగా. అందులోంచి రాసేసుకోమనలేకపోయారా? " అని కోదండాన్ని అడిగాడు రంగం.

కోదండం నీళ్ళు నమిలాడు.

అంటే కోదండానికి ఆ ఐడియా రాలేదన్న మాట అని అమూల్యకి అర్థమైంది.

"ఇదుగో నీ డ్యూటీలు ఇవి" అని రంగం కోదండం టేబుల్ మీదున్న డ్యూటీలిస్ట్ పుస్తకం తీసి ఇచ్చాడు.

అమూల్య అందులోంచి తన పని ఏమిటో ఎక్కించుకుంది పుస్తకంలో.

రంగం ఒక్కొక్కపనీ, దాన్ని ఎలా చేయాలీ అని వివరించాడు.

తర్వాత ఒక ఫైలు తెరిచి అందులో ఉన్న పనంతా బోధించాడు.

అతను చెప్పే తీరు చిన్నపిల్లలకి టీచరు బోధించినంత వివరంగా ఉంది.

అక్కడ్నుంచి దాన్ని ఎలా పూర్తిచెయ్యాలో చెప్పాడు.

ఒక్కపూటలో సగం పని చెప్పేశాడు.

"విన్నావుగా, అర్థమైందా? " అని శ్రద్ధగా అడిగాడు. పనిలో ఉన్న ముఖ్యమైన పాయింట్లన్నీ పుస్తకంలో నోట్ చేయించాడు.

ఉండుండి స్కూలు టీచర్లా తను వివరించిన దానిలోంచి ప్రశ్నలడిగాడు.

అమూల్య సమాధానం చెప్పింది.

"ఫర్వాలేదు. బాగానే అర్థమవుతోంది" అని సర్టిఫై చేశాడు.

"ఏదో దయతో నువ్వే చెప్పాలి. నువ్వు చెప్పకపోయి ఉంటే ఆ అమ్మాయికి పాపం మెమో ఇవ్వాల్సి వచ్చేది" అని నిట్టూర్చాడు కోదండం.

ఆ మధ్యాహ్నం పని మొదలుపెట్టి చెయ్యసాగింది అమూల్య. రంగం బాగా వివరించడంవల్ల అంతా చక్కగా అర్థమైంది.

గబగబా చెయ్యటం ప్రారంభించింది.

కొన్ని ఫైళ్ళు కోదండంకి పుటప్ చేసింది కూడా.

కోదండం అవి చూశాడు కానీ తెరవలేదు. మళ్ళీ రంగంని పిల్చి, అవన్నీ తీసి చూడమన్నాడు.

రంగం చూసి ఒకసారి కోదండంవైపు తూస్కారంగా చూసి, "బాగానే ఉన్నాయి. సంతకం పెట్టండి. ఫర్వాలేదు" అన్నాడు.

కోదండం అవన్నీ సంతకం చేసేసి, ప్యూన్‌ని కూడా పిలవకుండా తనే స్వయంగా అన్నీ పట్టుకుని ఆఫీసరు దగ్గరకు వెళ్ళాడు.



రంగం అతన్ని వెకిలిగా నవ్వుతూ చూస్తూ నిలబడ్డాడు.

"వెధవ. పనిరాదు. నేను చెపితే తప్ప సంతకం పెట్టలేడు. ఇప్పుడు ఆఫీసరు దగ్గరకు వెళ్ళాడు చూడు. మళ్ళీ ఆఫీసరు ఏదన్నా అడిగితే సమాధానం చెప్పలేడు. నన్నే పిలుస్తాడు" అన్నాడు అమూల్యతో.

కొద్ది సేపట్లోనే అతనన్నది జరిగిపోయింది. ఆఫీసరు రూమ్‌నుంచి కబురువచ్చింది.

రంగం చాలా దర్పంగా, దర్జాగా వెళ్ళాడు. ఆ తర్వాత కాసేపటికి తిరిగివచ్చాడు.

"ఏ టూ ఫైల్‌లో రూల్ పొజిషన్‌మీద ఆఫీసర్‌కి డౌట్ వచ్చింది. అడిగితే మన కోదండం నీళ్ళు నమిలాడు. ఎప్పుడూ ఉండేదే కాబట్టి నన్నే పిలిచాడు" అన్నాడు.

అక్కడితో అమూల్యకి అంతా అర్థమైపోయింది.

సెక్షన్, ఆఫీసర్ అంతా రంగం చెప్పిన ప్రకారమే నడుస్తాడు.

"కోదండం మరి సెక్షనాఫీసర్ కదా. అతను మనం చేసినవి చెక్‌చేసి కరెక్ట్ చేసి పంపించాలి. మరి మనతో చెప్పించుకునే పొజిషన్‌లో ఉంటే ఆఫీసరుకి కోపం రాదా? " అంది.

"వాడు వీడికి తగ్గవాడు. ఎలాగో ఒకలా సెక్షన్లో పని అయిపోవాలిగానీ, ఎవడికి ఎంత పని వస్తేనేం! ఆయనకి కావల్సింది పని జరగటం. అది జరిగిపోతూనే వుంది. ఇకపోతే మన కోదండం దువ్వడంలో బెస్ట్. వీడి పెళ్ళాం పనిచేసే ఆఫీసులో సిల్కుబట్టలు ఊరికే వస్తాయిట. మనవాడు ఆఫీసర్‌కి వాటిని అప్పుడప్పుడూ ఇస్తుంటాడు. ఆఫీసర్ భార్యకు పట్టుచీరలంటే ప్రాణం. ఆ చీరలన్నీ చూసి మురిసిపోయి తన మొగుడి ప్రతాపానికి సంతోషపడిపోతుంది. పెళ్ళాన్ని సంతోషపెట్టడంకన్నా ఏ మొగుడికి మాత్రం ప్రయోజకత్వం ఏముంటుంది. మనవాడు పెళ్ళాందగ్గర తన పవర్ పెంచేసిన కోదండంమీద అభిమాన పడక ఏం చేస్తాడు. కోదండం భార్య వాళ్ళ ఆఫీసులో తీసుకున్న లంచం పట్టుచీరలే వాడు ఇక్కడ ఆఫీసరు భార్యకి లంచంగా ఇస్తున్నాడు. నాకు ఇవన్నీ కుదరవు. నేను స్ట్రెయిట్ ఫార్వర్డ్ మనిషిని. ముక్కుకి సూటిగా పోతాను. అందుకే ఇన్నాళ్ళయినా, ఇన్ని తెలిసినా నేను అప్పర్ డివిజన్ క్లర్కుగా మిగిలిపోయాను. కోదండం ఎంత చవటా, అసమర్థుడూ అయినా ఆఫీసరు అయ్యాడు. ఇది గవర్నమెంటు ఆఫీసుల్లో మామూలే. ఇక్కడ పనిచేసేవాడికి పని, పనిచెయ్యనివాడికి జీతం, గీతం... ఇంతకీ నువ్వేం చదివావు? " అడిగాడు రంగం.

"ఎమ్మెస్సీ చదువుతూ మానేశాను"

"ఎందుకు మానేశావు. కంటిన్యూ చెయ్యకపోయావా? ఇక్కడన్నీ రాజకీయాలు. నువ్వు ముక్కుకి సూటిగా పోయే మనిషివైతే ఇవన్నీ పడలేవు. ఎమ్మెస్సీ అయి ఏ ఉమెన్స్ కాలేజీలోనో లెక్చరర్‌గా పోతే హాయిగా ఉంటుంది"

"వీలయితే పూర్తిచేస్తాను"

"సరేలే. ఎవరికష్టాలు వారివి" అన్నాడు రంగం.

అతను చాలా మంచివాడిలా, అర్థం చేసుకునే మనిషిలా కనిపించాడు. జీవితంలో ఢక్కామొక్కీలు తిని, జీవితాన్ని అవగాహన చేసుకున్న వ్యక్తిలా కనిపించాడు అమూల్యకి.

"నువ్వు పని బాగానే పికప్ చేస్తున్నావు. వర్క్‌ని బాగానే అర్థం చేసుకోగలుగుతున్నావు. ముఖ్యంగా ఆసక్తి ఉంది. ఏమన్నా అనుకోగానీ, మా ఆఫీసులో లేడీస్‌కి మాత్రం పనంటే అస్సలు శ్రద్ధలేదు. లేట్‌గా వచ్చి లంచ్ టైంలో శుభ్రంగా తిని, కాలక్షేపం చేసేసి వెళ్ళిపోతారు. ఫ్యాషన్ పెరేడ్‌కి వచ్చినట్లు మంచిగా డ్రెస్సు వేసుకుని, మేకప్ చేసుకుని రావడమే తప్ప పని చేద్దా





మనిగానీ, నేర్చుకుందామనిగానీ ఉండదు. నువ్వు పిచ్చిదానిలా ఉన్నావు. పని నేర్చుకుంటున్నావు. నువ్వు చేయకపోయినా ఫర్వాలేదు. అడిగేవాడు లేడు. కోదండం ఎవర్నో పట్టుకుని చేయించేసుకునేరకం. గవర్నమెంటు ఉద్యోగం దొరకాలేగానీ చేసినా చేయకపోయినా అడిగేవాడులేడు. కాకపోతే చర్మం కాస్త దళసరిగా ఉండాలి. ఎప్పుడో ఒకసారి తిట్టిపోసినా, పట్టించుకోకుండా తిరగాలి" అన్నాడు రంగం.

"మన డిపార్టుమెంటు ఉంది చూశావూ. మహా చెత్త డిపార్టుమెంటు. ఇక్కడ ఎంత కష్టపడి చచ్చినా ప్రమోషన్లు రావు. వచ్చే ఆ కొద్ది ప్రమోషన్లు కూడా కోదండంలాంటి వాళ్ళు తన్నుకుపోతారు. నువ్వు వేరే ఏమన్నా మంచి ఉద్యోగానికి అప్లై చేసి వెళ్ళిపో" అన్నాడు రంగం.

అమూల్య అతని కళ్ళల్లోకి చూసింది.

అందులో ఉన్న కసి... బాధ అర్థమయ్యాయి. ఎంత తెలివి ఉన్నా, పనిలో ఆసక్తి, సమర్థత అన్నీ ఉన్నా ఏదీకాలేక, ఏ ప్రమోషనూ రాక, చేరిన పోస్ట్‌లోనే రిటైర్ అవబోయే మనిషి. తన కళ్ళముందే చవటలూ, అసమర్థులూ ఆఫీసర్లు అయిపోతే తను ఉన్నచోటే ఉండిపోయిన మనిషి కళ్ళల్లో కసి... బాధ... కనిపించక మరేం కనిపిస్తాయి?

అమూల్యకి అతని బాధ అర్థమైంది.

★ ★ ★

అత్తయ్య పక్కింటావిడతో సెకండ్ షోకి వెళ్ళింది. బోల్ట్ పెట్టుకుని గదిలో పడుకుంది. భాస్కరం మళ్ళీ వచ్చి తలుపు కొట్టాడు.

"ఏం కావాలి?" తలుపు తియ్యకుండానే అడిగింది. "ఎందుకంత బెట్టుచేస్తావు. ఓహో భయమా? లోకానికి భయపడకు. మనం చేసేది ఎవరికీ తెలియదు. గుట్టుచప్పుడు కాకుండా సుఖపడొచ్చు. ఏ కడుపో, కాలో వస్తుందని భయపడకు. నేను ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేయించుకున్నాను" అన్నాడు భాస్కరం మామయ్య.

"నోర్ముయ్. అత్తయ్యా లేదని మళ్ళీ వచ్చావా? ఆమె రాగానే చెప్తాను చూడు" కోపంగా అరిచింది అమూల్య.

"అత్తయ్యకా? అహ్హహ్హ..."

"దుర్మార్గుడా. నువ్వు నోర్మూసుకుని పోకపోతే నేను అరిచి గోల చేస్తాను"

ఈ బెదిరింపు పనిచేసింది.

భాస్కరం నోర్మూసుకుని వెళ్ళిపోయాడు.

అత్తయ్యకి చెపుతానంటే ఎందుకు నవ్వాడు? అమూల్యకి అర్థంకాలేదు. బహుశా తనకి ఆమె ఎదురు చెప్పదని ధీమా కాబోలు అనుకుంది అమూల్య.

★ ★ ★

ఆఫీసులో చేరి వారం దాటింది.

సీట్లో ఉన్న పెండింగ్ పని పూర్తిచేసింది.

ఈ వారంలో, రంగంకి పనిలో ఉన్న నాలెడ్జ్‌కీ, ఇన్ని ఏళ్ళయి ఏ ప్రమోషన్ రాకపోయినా, ఆ బాధనీ, కసినీ పనిలోమాత్రం చూపించకుండా, క్వాలిటీ మెయిన్‌టైన్ చేయడాన్నీ చూసి అమూల్య ముగ్ధురాలైంది.

"చేస్తే మాకేం వస్తుంది. చేసినందుకు మాకేం వచ్చింది?" అని ప్రశ్నలు వేస్తూ ప్రమోషన్లు రానందుకు ఆ కసినీ, కోపాన్నీ చేస్తున్న ఆఫీసు పనిమీద నేరుగా చూపిస్తున్నవాళ్ళని కూడా ఆ కొద్దికాలంలోనే చూసేసింది అమూల్య. వాళ్ళందరితో పోలిస్తే రంగం ఎంత గొప్పవాడోకదా అనిపించింది.

కానీ తొందర్లోనే అతని స్వభావం అర్థమైపోయింది.

అతనిది అదోమాదిరి తత్వం. మాట్లాడుతూనే ఉంటాడు. ఉండుండి చెయ్యో, కాలో తగిలించేస్తాడు.

మొదట్లో అది తెలియకుండా చేస్తున్నాడేమో, పొరపాటున తగిలిందేమో అనుకుంది అమూల్య. కలిసి పనిచేస్తున్నప్పుడు ఎందులోనో లీనం అయి పని వివరిస్తున్న

ప్పుడు ఎంతని చూసుకుంటాడు ఏదో యధాలాపంగా తగిలి ఉంటుందని సరిపెట్టుకుంది.

కానీ అది తప్పని తెలిసిపోయింది.

రంగం కావాలని చాలా తెలివిగా చేస్తున్నాడు అది.

ఏదన్నా ఫైలు వివరిస్తున్నట్లు చేసి చేతికి చెయ్యి తగిలించేస్తాడు. మళ్ళీ ఏమీ ఎరగనట్లు కూల్‌గా, అతి సాధారణంగా ప్రవర్తిస్తుంటాడు.

బస్సుల్లో, రద్దీగా ఉండే చోట్లా ఇట్లాంటి వాళ్ళు 'బాటమ్ పించర్స్' ఎదురవుతూ ఉండేవాళ్ళు.

ఏమీ తెలియనట్లు రష్‌గా ఉన్నచోట ఆడవాళ్లని రాసుకుంటూ, పూసుకుంటూ తిరగడం, వీలు దొరికినప్పుడు గిల్లడం, నిమరటం.

చాలామంది మగాళ్ళకి ఈ జబ్బు ఉందని అంటారు. అట్లాంటివాళ్ళలో ఈ రంగం కూడా ఒకడన్నమాట.

అదొక్కటేకాదు అతని అలవాటు. ఏ సంకోచమూ లేకుండా శరీరంలో ఏ భాగం చూడాలనుకుంటే ఆ భాగంవైపు నిస్సంకోచంగా, నిర్లజ్జగా చూసేస్తుంటాడు. చీర నిండుగా కప్పుకుని కూర్చున్నా అందులోంచి లోపల్లోపలికి... అందులోపల దాగిన అందాల్లోకి ఆబగా, ఆత్రంగా చూస్తుంటాడు.

ఒకసారి ఇద్దరూ పక్కనున్న మరో సెక్షన్‌కి పనిమీద పోవాల్సి వచ్చింది.

పని అమూల్యదే.

ఎట్లా చేయాలో వివరించటానికీ ప్రత్యక్షంగా చూపించటానికీ రంగం తోడుగా వచ్చాడు. అది అమూల్యకి సాయం చెయ్యటమే.

"ఇదుగో... ఈ రికార్డు తీసుకుని, ఈ రిజిస్టర్‌లో ఉన్న వివరాలన్నీ ఇందులోకి, ఇట్లా ఎక్కించాలి. అర్థమైందా?" రంగం వివరాలన్నీ ఎక్కడెక్కడినుంచి తీసుకోవాలో అన్నీ చక్కగా వివరించాడు. అది నిజానికి అమూల్య సీట్లో చాలా ముఖ్యమైన పని.

అమూల్య మనసు అతనిపట్ల కృతజ్ఞతతో నిండిపోయింది. ఇతనుగానీ లేకుంటే పని నేర్చుకోవటానికి ఎంత కష్టపడాల్సి వచ్చేదో అనుకుంది.

ఎవరిమీదన్నా కృతజ్ఞతగా ఉండటం అనేదొక మధురమైన భావన. మనసు నిర్మలంగా, ప్రశాంతంగా మారే సమయం అది.

ఆ నిర్మలతనీ, ప్రశాంతతనీ కలుషితం చేస్తూ, రంగం చేతులు తాకిస్తూ, రాసుకుంటూ చటుక్కున ఆమె చేతుల్లోంచి రిజిస్టర్ తీసేసుకున్నాడు. ఆ పనిలో అతని చేతులు ఆమె వక్షోజాలని తాకాయి. అమూల్య గభాల్న తప్పుకునేలోపలే అతను లాఘవంగా తన చేతివేళ్ళని ఆమె పిరుదులకి కూడా తగిలించేశాడు.

అమూల్య నివ్వెరపోయింది. సిగ్గుతో చచ్చిపోయింది.

ఒకలాంటి అసహ్యంతో, ద్వేషంతో ఆమె మనసు నిండిపోయింది. అతను అలా చేస్తాడేమోనని ఊహించి కూడా తన జాగ్రత్తలో తను ఉండనందుకు తననితానే నిందించుకుంది.

అతనివైపు కోపంగా చూసింది.

రంగం ఏం పట్టనట్లు ఆమె వక్షోజాలవైపు ఆబగా ఆత్రంగా చూసేస్తున్నాడు. చొంగ ఒకటే తక్కువ. అతని మొహం ఎలా ఉందంటే... మంచి మాంసం ముక్కచూసి, దానిమీదకు దూకేసి తిందామని చూస్తున్న కుక్కలా ఉంది.

ఆ సెక్షన్లో అంతా వింతగా చూస్తున్నారు.

అమూల్యకి తల కొట్టేసినట్లయింది.

రంగం మాత్రం ఆమె ఫీలింగ్స్‌ని ఏమాత్రం పట్టించుకోకుండా అలాగే చూస్తూ నిలబడ్డాడు.

అమూల్య కొయ్యబారి చూస్తూ నిలబడింది.

"పదండి వెళ్దాం" అన్నాడు రంగం, తనివి తీరా చూసేశాక చాలా మామూలుగా, అసలు ఏం చెయ్యనట్లుగా.

అమూల్యకి సర్వావయవాలూ చచ్చుబడ్డాయి. మనసు మాత్రం రోతతో, అసహ్యంతో వికారంగా మారిపోయింది.

ఏం చెయ్యాలో తెలీని పరిస్థితి.

తిరిగి తమ సెక్షన్‌కి వచ్చేలోపల అతని చేతి వేళ్ళకి చిక్కకుండా జాగ్రత్తపడింది.

తిరిగి వచ్చాక.

"అదే... అర్థమయిందిగా. ఇంకా ఏమన్నా చెప్పాలా?" అడిగాడు రంగం.

నిజానికి రంగం ఆపని చక్కగా చెప్పాడు. అమూల్యకి బాగా అర్థమైంది కూడా. కానీ ఏం లాభం? కడివెడు పాలలో ఒక్క ఉప్పు రాయి ఆ పాలన్నీ విరిచేసినట్లు... అతని మీద ఏర్పడిన కృతజ్ఞతనంతా మాయం చేస్తూ తన ఒంటిమీద అతని చేతివేళ్ళు చేసిన పని మనసుని దుఃఖంతో కమ్మేస్తూ వుంది.

వస్తున్న ఏడుపుని బలవంతాన ఆపుకుంది. ఏమిటీ కన్నీళ్ళు? ఇంకా తనని వదిలిపోవా?

జీవితం ఎండిపోయింది. గుండె ఎండిపోయింది. కానీ కన్నీళ్ళు మాత్రం ఎండిపోలేదేం? ఎన్ని జరిగినా, ఎన్ని అనుభవాలైనా ఈ సున్నితత్వం మాత్రం తనని వదిలిపోదేం?

"ఏంటి అలా ఉన్నావు?" అడిగాడు రంగం, ఏం జరగనట్లు.

"ఇంకెలా ఉంటాను?" రోషంగా అడిగింది.

"అదేంటి? ఎందుకు బాధపడ్తున్నావు?" ఏమీ ఎరగనట్లు విస్తుపోతూ అడిగాడు.

"ఎందుకు బాధ పడ్తున్నానో మీకు తెలీదా?" కోపంగా అంది.

"అయ్యో... తెలిస్తే ఎందుకడుగుతానూ? చెప్పు. ఏం జరిగింది?"

"మీరేం చేశారో కూడా మీకు తెలీదా?"

"నిజంగా తెలీదు. ప్లీజ్... ఎందుకు బాధపడ్తున్నావో చెప్పవూ?" అమాయకంగా అడిగాడు రంగం.

అతను శుభ్రంగా నటించేస్తున్నాడని అమూల్యకి అర్థమైపోయింది. అతని మనస్తత్వం గ్రహించింది.

అతను చేసేది చేసేసి, అమాయకత్వం నటిస్తాడు. ఇప్పుడు స్పష్టంగా, 'నువ్విది చేశావు. ఎందుకు చేశావో చెప్పు' అని అడిగినా నాకేం తెలీదు పొమ్మని నటిస్తాడు. అంతకన్నా ఇంకేం చేస్తాడు. నేరుగా దౌర్జన్యం చేసేంత దుర్మార్గపు శక్తిలేకపోయినా, గుంటనక్క జిత్తులు ఉన్నాయి. మరి ఇంత టక్కరి వెధవ ఆఫీసర్లకి మస్కా కొట్టి ప్రమోషన్లు ఎందుకు లాగలేకపోయాడు? అమూల్యకి అర్థంకాలేదు. జిత్తులమారి తత్వానికి కూడా కొన్ని పరిమితులూ, పరిధీ, ప్రత్యేక ఫీల్డులూ లాంటివి ఉంటాయి? ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క ఫీల్డులో నిపుణులుగా ఉంటారన్నమాట.

మనసూ మూడ్ అంతా పాడైపోయాయి. దీనికంతా ఒకటే మార్గం. వీలైనంత తొందరగా ఈ పనంతా నేర్చుకుని, రంగంతో మాట్లాడటం తగ్గించేసుకోవటం.

అమూల్యకి తన ఆలోచనాధోరణి తనకే నచ్చలేదు. అవకాశవాదులకీ తనకీ తేడా లేదనిపించింది.

తనకీ రంగంకీ తేడా ఏమిటి? 'అతనికున్న అవకాశాన్ని అతను ఉపయోగించుకుని తనను తాకేందుకు ప్రయత్నిస్తున్నాడు. తను వీలైనంత తొందరగా పని నేర్చుకుని అతన్ని వదిలించుకోవాలనుకుంటోంది. తన ప్రిన్సిపుల్స్, తన నిజాయితీ, తన పట్టుదలా ఏమైపోయాయి' అని తనని తాను నిందించుకుంది.

అవసరం ముందు అన్నీ ఓడిపోతాయా? రంగం తప్ప తనకు పని నేర్పే దిక్కులేదు కాబట్టి, నోరు మూసుకుని, అతని ప్రవర్తన సహించాలా? తన పనికోసం తను సర్దుకు

పోవాలా?

హు... తను ఇంతకన్నా ఏం చెయ్యగ లదు మరి?

అలా కాకుండా తను పాత అమూల్యా అయిఉంటే ఏం చేసి ఉండేది? ఛెళ్ళున అతని చెంప చరిచి ఉండేది. అతనిమీద రిపోర్ట్‌చేసి, న్యాయంకోసం పోరాడి ఉండేది.

ఇప్పుడు తనకు అలా చేసినా, న్యాయం జరుగుతుందన్న నమ్మకం లేదు.

రంగం పని అవసరం ఈ ఆఫీసుకి ఉందో లేదో తెలియదుగానీ రంగం అవ సరం మాత్రం ఆఫీసర్లకి చాలా ఉంది. అతను తప్ప కోదండంకిగానీ, పెద్దాఫీసరుకి గానీ వేరే దిక్కులేదు. వాళ్ళు అతన్ని సమ ర్థించి కాపాడుతారు. తనకే ఏదో ఒక మెమో ఇచ్చి, ఇంకెక్కడికన్నా ట్రాన్స్‌ఫర్ చేసినా దిక్కులేదు. అక్కడ ఇంకెంత భయంకరమైన మనుషులుంటారో?

నిస్సహాయత ముందు ఇంకేదీ పనికిరా దని అమూల్యాకి అర్ధమైపోయింది.

అణచివేతకు గురయ్యి, ఎంత వేధించినా, చైతన్యం లేక పడిఉండే మనుషులని చూస్తే, వాళ్ళెందుకు తిరగబడరా అని ఆశ్చ ర్యపోయేది ఇదివరకు.

కానీ ఇప్పుడు బాగా అర్ధమైంది.

నిస్సహాయత... ఇంకేం చెయ్యలేని అస హాయత... మన ఖర్మ ఇంతేలే అని కన్నీ ళ్లను కళ్ళలోనే అదిమేసుకుని, గుండె రాయి చేసుకుని, మనసు చంపేసుకుని, శరీరాన్నీ, మనసునీ బండగా మార్చుకుని, చైతన్యాన్నీ, భావస్రవంతినీ మర్చిపోయి, శిలల్లా మారి పోయి దీనంగా బతుకుతున్న మనుషుల నిస్సహాయ స్థితిని అర్థంచేసుకోగలిగింది. తనూ వాళ్ళలో ఒకరిగా మారిపోయింది.

ఇంట్లో చూస్తే అలా...

ఆఫీసులో చూస్తే ఇలా...

ఆఫీసుపని కాస్త అలవాటయ్యాక కొలీగ్ జానకికి చెప్పింది అమూల్యా.

"నాకు ఇల్లు కావాలి"

"మీ చుట్టాలింట్లో ఉంటున్నట్లున్నావు కదూ"

"అవును... కానీ విడిగా ఉందామని. ఇక్కడ వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్ లాంటి వేమీ లేవు కదూ. సిటీస్‌లో అయితే ఉంటాయి. నేను గది అద్దెకు తీసుకోక తప్పదనుకుంటాను"

"అవుననుకో. కానీ ఒంటరి స్త్రీకి రక్షణ లేదు"

కానీ అక్కడ అసలు రక్షణలేదు అను కుంది అమూల్యా మనసులో.

"ప్లీజ్. కాస్త చూడరాదూ" అంది.

"చూస్తాను" అంది జానకి.

ఆరాత్రి... భాస్కరం మామయ్య ఊళ్ళో లేడు. క్యాంప్‌కి వెళ్ళాడు.

ఇంటికి ఎవరో అతిథి వచ్చాడు. తనకి బంధువని చెప్పింది అత్తయ్య.

మొదటిరోజే బుద్ధిరావటంతో, గడియ పెట్టుకోకుండా పడుకోవటంలేదు అమూల్యా.

గడియ పెట్టుకుని తన గదిలో ఉండి పోతే ఇవతల గదుల్లో ఎంతో పెద్ద చప్పుడ వుతేగానీ తెలీదు.

భాస్కరం మామయ్య ఊళ్ళోలేడు కదా అని గడియపెట్టుకోలేదు అమూల్యా. తలుపు దగ్గరకు వేసింది.

గాలికి ఆ తలుపు తెరుచుకున్నట్లుంది.

అమూల్యా నిద్రలో ఉంది. ఇంతలో హఠా త్తుగా మెలకువ వచ్చింది. ఏవో సవ్వడులు వినిపించాయి.

మామయ్య ఊళ్లోలేడు. ఇంట్లో తనూ, అత్తయ్యా తప్ప ఎవరూ లేరు. మరి ఈ చప్పుళ్ళు ఎక్కడ్నుంచి వస్తున్నాయి. కొంప దీసి దొంగగానీ రాలేదు కదా? అమూల్యా మనసు శంకించింది.

వెంటనే లేచి ముందుకి నడిచింది.

ఎదురుగానే ఉంది అత్తయ్య గది.

గదిలో... రాజమ్మత్త నగ్నంగా. ఇంకొక మగాడి చేతిలో మెలికలు తిరిగిపోతూ,





ఆనందపు చిహ్నంగా సవ్వడిచేస్తూ.

అమూల్యకి గుండె ఆగిపోయినట్లయింది.

తను చూస్తున్నది నిజమేనా? దేవత లాంటి రాజమ్మత్త, నలభై ఏళ్ళు పైబడి... గుళ్ళూ గోపురాలూ అంటూ తిరుగుతూ, పూజలూ, వ్రతాలూ చేసుకుంటూ, పరమ పతివ్రతలా, భర్తచాటు మనిషిలా, ఒద్దికగా, హుందాగా కనిపిస్తూ, అందరితో కలిసి పోయి, కలివిడిగా ఉంటూ, పకపకా నవ్వుతూ, అందరిలో మంచిపేరు సంపాదించుకున్న రాజమ్మత్త.

అసలు రూపం ఇదా?

భాస్కరం మామయ్య అసలు రూపానికే షాక్ అయిన అమూల్య, అత్తయ్య నిజస్వరూపం తెలిసి పూర్తిగా హడలిపోయింది.

కాళ్లూ చేతులూ వణికాయి.

ఆరోజు తను అత్తయ్యకి చెప్తానన్నప్పుడు, భాస్కరం మామయ్య నవ్విన వెకిలినవ్వుకి కారణం ఇప్పుడు తెలిసింది. ఆవిడా అదే రకం అయినప్పుడు ఇక మామయ్యనేం మందలిస్తుంది? పైపెచ్చు తన కార్యక్రమం ఇకమీదట కూడా నిర్విఘ్నంగా సాగిపోయేందుకు, తనని లొంగదీసుకోవటంలో మామయ్యకి సాయం కూడా చేస్తుందేమో?

ముందురోజు గుడికి వెళ్తానన్న అత్తయ్య, అక్కడ లేకపోవటం... కావాలని తనకి ఏకాంతం కల్పించేందుకు వీలుగా తరచూ ఎటో వెళ్ళిరావటం... అన్నీ మామయ్యకి లైన్ క్లియర్ చేసేందుకు ఆమె చేసే సాయాలన్న మాట. ప్రతిగా ఆ పతిదేవుడు ఏవో ఒక పని కల్పించుకుని ఊళ్ళోలేకుండాపోయి, ఈ మహానుభావుడు వచ్చేందుకు దారి సుగమం చేస్తాడన్నమాట.

ఏం మనుషులు వీళ్ళు?

'డాడీ...డాడీ' అమూల్య గుండె ఘోషించింది. తను పుట్టిపెరిగిన వాతావరణం ఎలాంటిది? తనకి అంతవరకూ తెలియని ఈ దుర్మార్గపు ప్రపంచంలోకి వచ్చి పడింది. అయ్యో దేవుడా! ఇదేం ఖర్మ. వీళ్ళేం మనుషులు. ఇలాంటి వాళ్ళు ఉంటారని కూడా ఎన్నడూ ఊహించలేదు? భగవంతుడా! వీళ్ళమధ్యకా నన్ను తీసుకొచ్చిపడేశావు.

ఏడుపు వచ్చింది.

భరింపరాని విరక్తి కలిగింది.

చచ్చిపోతే ఎంత బాగుంటుందనిపించింది.



కోదండం కాస్త మంచివాడేనేమో అనుకుంది మొదట్లో అమూల్య. కానీ అదీ తేలిపోయింది.

కోదండం భార్య ఆఫీసు ఇక్కడికి దగ్గర్లోనే ఉంది. రోజూ స్కూటర్‌మీద ఆమెని పికప్ చేసుకుని ఇంటికి వెళతాడు. అప్పుడప్పుడూ ఆమె హఠాత్తుగా ఈ ఆఫీసులో ప్రత్యక్షమవుతుంది. ఆమె ప్రవర్తన సడన్‌గా చెకింగ్‌కి వచ్చిన ఇన్స్‌పెక్టర్‌లాగా ఉంటుంది. ఏమిటో వింతగా ఉంటుంది ఆమె ప్రవర్తన అనుకునేది అమూల్య మొదట్లో. ఆ వింత ప్రవర్తనకి కారణం ఈరోజు తెలిసింది.

కోదండం భార్య ఊరికి వెళ్ళిందిట. ఈ విషయం అతనే స్వయంగా చెప్పాడు

అమూల్యకి.

"నువ్వు ఉండేది ఎక్కడ?" అడిగాడు.

అమూల్య చెప్పింది.

"మా ఇంటివైపే. మా ఆవిడ ఊళ్ళో లేదు. నిన్ను ఇంటిదగ్గర డ్రాప్ చెయ్యనా?"

"థాంక్సండీ. కానీ వద్దు. నేను బస్సులో పోతాను" అన్నది అమూల్య.

"పర్వాలేదు. రారాదూ. సరదాగా ఏదన్నా హోటల్‌లో భోంచేసి, సినిమాకి వెళ్ళి రాత్రి ఎంజాయ్ చెయ్యవచ్చు కూడా" అన్నాడు, ఎంజాయ్ అన్నమాటని నొక్కి పలుకుతూ.

"నాకు ఎంజాయ్‌మెంట్ ఇష్టం ఉండదు" అంది అమూల్య అసహ్యంగా మొహం పెట్టి.

కోదండం ఉద్దేశం స్పష్టంగా అర్థమైపోతోంది. అతన్ని ఏం చేసినా పాపం లేదనిపించింది. ఎంతో మంచివాడిలా నటిస్తూ ఎలా అడుగుతున్నాడు.

"ఎంజాయ్‌మెంట్ ఇష్టంలేదా? అదేం మనిషివి? అవునూ నీకు పెళ్ళయిందనీ, నువ్వూ మొగుడూ విడిపోయారనీ విన్నాను. నిజమేనా?" అడిగాడు కోదండం.

అతనంత మొరటుగా అడగటంతో అమూల్య తల సిగ్గుతో వాలిపోయింది. కోపంతో మనసు మరిగిపోయింది.

"అది మీకు అనవసరం" అంది.

"అయ్యో. అంత కోపం దేనికీ? ఏదో పెద్దవాడినీ, నీ శ్రేయోభిలాషినీ కాబట్టి అడిగాను. నీకిష్టం లేకపోతే చెప్పకులే. సరే గానీ, పాపం మొగుడు లేక ఇబ్బందిగా లేదూ? మనదేశంలో మళ్ళీ పెళ్ళిళ్లు కూడా అరుదే. వేరే దేశాల్లో అయితే ఇట్టే ఒకడ్ని వదిలేసి, ఇంకోడ్ని చేసుకుంటారుట. మనకి భర్తే దైవం అని నూరిపోస్తారు. మరీ తప్పనిసరి పరిస్థితిలో విడాకులు తీసుకోవటమంటేనే బోలెడంత తెగింపుకింద లెక్క. సరే పాపం... నువ్వు మరి ఎన్నాళ్ళిలా ఉంటావు? పోనీ మా ఆవిడ లేనప్పుడన్నా నాతో ఎంజాయ్ చేస్తుండరాదూ? మా పిల్లలు కూడా లేరు. వాళ్ళమ్మతో ఊరికెళ్ళారు. మా ఇంట్లో ఎవరూ ఉండరు. మనిద్దరమే. ఏంటి? రాగూదూ? రాత్రి హాయిగా గడపొచ్చు" అన్నాడు కోదండం నాలుక చప్పరించుకుంటూ.

కన్నీళ్ళు ఆపుకోవటం, తన్నుకుని వస్తున్న ఏడుపుని అణుచుకోవటం ఇక అమూల్య వల్ల కాలేదు. ఏడుస్తూ టాయిలెట్‌కి వెళ్ళిపోయింది.

ఛీ... ఏమిటి తన బతుకు.

ఎందుకిలా అయిపోయింది?

ఇప్పుడీ కోదండంని ఏంచేయాలి? ఇప్పుడేం చెయ్యాలి? అసలే అతను ఆఫీసరు. ఈ కోపం పెట్టుకుని ఏం చేస్తాడో? తను టెంపరరీ ఇంకా. పీకిపారేసినా అడిగేవారు లేరు. ఏదో ఒకటి చెడ్డగా రాసి, తన కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్ చెడగొట్టి తనని ఉద్యోగంనుంచి తొలగించేందుకు ప్రయత్నిస్తే? అతనికి అధికారం, అధికారుల అండ, అన్నీ ఉన్నాయి. తనో? ఒక అబల. నిస్సహాయురాలైన స్త్రీ. తనేం చేయగలదు? ఎవరికి రిపోర్ట్ చెయ్యాలి? ఏం చెయ్యాలి? అసలేం చెయ్యగలదని ఇంకా ఆలోచించాలి? ఈ ఉద్యోగం చేసే పరిస్థితులు కనిపించటంలేదు. ఇది లేకుండా తనకి ఆధారం లేదు. ఎలా బతకాలి?

వెక్కివెక్కి ఏడ్చింది.

జానకి అప్పుడే టాయిలెట్‌లోకి ప్రవేశిస్తోంది.

అమూల్య ఏడుపు చూసి కంగారుపడింది.

"ఏం జరిగింది?" అదుర్దాగా అడిగింది.

అమూల్య ఏడుస్తూ ఉండిపోయింది.

"ఏదన్నా పర్సనల్ సంగతా? అయితే చెప్పకు. నువ్వు ఏడుస్తుంటే చూసి, ఉండబట్టలేక అడిగాను సారీ" అంది జానకి.

"అది పర్సనల్... అఫీషియల్ కూడా" అంది అమూల్య వెక్కుతూనే.

"అదేంటో నేను తెలుసుకోవచ్చా? నీకు




సాయం చెయ్యటానికి ప్రయత్నిస్తాను. ప్లీజ్, సంకోచించకు" అంది జానకి అనునయంగా.

అమూల్య ఒక్కక్షణం ఆలోచించింది. చెపితే సాయం చేస్తానంటోంది జానకి. పోనీ చెపితే?

ఒక్క నిమిషం మౌనంగా ఉండిపోయింది. వెక్కిళ్లు ఆపుకునేందుకు ప్రయత్నించింది. వృథా అయింది. వెక్కుతూనే అంతా వివరించింది.

అంతా విని జానకి పకపకా నవ్వటం మొదలుపెట్టింది.

ఆమె నవ్వు చూసి అమూల్య బిత్తరపోయింది.

ఈమెకి వేళాకోళంగా ఉన్నట్లుంది. తన పరిస్థితి అందరికీ లోకువై, తన బతుకు ఇలా నవ్వులపాలైపోయిందా అనుకుని ఇంకా ఇంకా ఏడుపు వచ్చింది.

అప్పుడు జానకికి తను చేసింది అర్థమైంది. "ప్లీజ్... అమూల్యా, ప్లీజ్ ఏడవకు. ఆ కోదండం ఉత్త దద్దమ్మ. వాడికి నువ్వేం భయపడక్కర్లేదు. వాడు నెంబర్ వన్ ఇడియట్. వాడికి నువ్వు భయపడ్తుంటే నాకు నవ్వు వచ్చింది. అంతేకాదు. వాడి పెళ్ళాం పరమగయ్యాళి. వీడ్ని కొడుతుందని కూడా విన్నాను. వీడు ఆవిడంటే హడలిచస్తాడు. అలాంటివాడు నిన్ను ఇలా అడిగాడంటే, వాడికింత ధైర్యం కూడా వచ్చిందా అని నవ్వు వచ్చింది. అంతే, అంతే. ప్లీజ్... ఏడవకు. నన్ను నమ్ము. నేను నీ ఫ్రెండ్‌ని" అంది జానకి.

అమూల్య కళ్ళు తుడుచుకుంది.

"అమూల్యా వాడుత్త కాగితపు పులి. నిజానికి కాగితం పులి కూడా కాదు. దిష్టిబొమ్మ. అంతే. వాడికి నువ్వేం భయపడక్కర్లేదు. అసలు వాడు కూడా లోలోపల సగం బెదుర్తూనే, నిన్ను అడిగి ఉంటాడు. తన పెళ్ళాం నీడని చూస్తేనే వణికిపోయే మనిషి వాడు. నువ్వేం చెయ్యాలంటే నదురూ బెదురూ లేకుండా ఏమీ జరగనట్లు దర్జాగా కూర్చో. మళ్ళీ వాడేమన్నా అడిగితే, 'పిచ్చివేషాలు వేస్తే మీ ఆవిడకి చెపుతాను జాగ్రత్త' అని బెదిరించు. కిక్కురు మనకుండా, నోరు మూసుకుని కూర్చుంటాడు. ఏమాత్రం భయపడకు. అంతే. పిచ్చిపిల్లా. దీనికి ఇంత ఏడుస్తావా. ఇలా అయితే ఎలా బతుకుతావు?" అంది జానకి.

ఆమె పరిస్థితివేరు, ఆమెకి అంతా ఉన్నారు. తను ఒంటరి, తను ఇదంతా ధైర్యంగా ఎదుర్కోగలదా? అనుకుంది అమూల్య.

"ముందు శుభ్రంగా మొహం కడుక్కో. నీ దగ్గర టాయిలెట్ బాక్స్ ఉందా?" అడిగింది జానకి.

"లేదు"

"నా దగ్గర ఉందిలే. ఇదుగో. మొహం కడుక్కుని, శుభ్రంగా పౌడర్ రాసుకుని, బొట్టు పెట్టుకుని తల దువ్వుకో. దర్జాగా ఉండు. ఏం భయంలేదు. నేను చెపుతున్నాగా" అంది జానకి.

అమూల్య గబగబా మొహం కడుక్కుంది. పౌడర్ రాసుకుని బొట్టు పెట్టుకుని, జడ మళ్ళీ అల్లుకుంది.

కాస్త తేటగా, ధైర్యంగా అనిపించింది. వెళ్ళి సీట్లో కూర్చుంది. జానకి టాయిలెట్లోనే ఉంది.

కోదండం వచ్చాడు.

అమూల్య ఫ్రెష్‌గా తయారయ్యి కూర్చోవటం చూసి సంతోషించాడు. బహుశా తన ప్రపోజల్ నచ్చి తనతో ఇంటికి రావాలని, చక్కగా తయారై వచ్చింది కాబోలనుకున్నాడు.

"అబ్బ, అద్భుతంగా కనిపిస్తున్నావు సుమా" అన్నాడు.

"మీకు ఏం కావాలి?" నిర్లక్ష్యంగా చూస్తూ అడిగింది అమూల్య.

"అంటే?"

"ఎందుకు నా సీట్ దగ్గరకు వచ్చారూ అని అడుగుతున్నాను. ఏదన్నా ఫైల్ గురించి మాట్లాడాలా?" కరుగ్గా అడిగింది.

"అదేంలేదు. నేను అడిగింది ఏం చేశావు? బహుశా నేను చెప్పిన ప్రోగ్రామ్ నచ్చిందనుకుంటాను" పళ్ళికిలించాడు కోదండం.

"షటప్. వెళ్ళి మీ సీట్లో కూర్చోండి. ఇక మీదట ఎప్పుడైనా ఇలా మాట్లాడితే... నేను..." అమూల్య పెదవులు కోపంతో వణికాయి.

"ఆ... నువ్వు" కోదండం గొంతు తగ్గించి అడిగాడు.

"మీ ఆవిడకి చెబుతాను" అంది అమూల్య, అంతే.

కోదండం శరీరం భయంతో వణకటం స్పష్టంగా కనిపించింది.

"అంత కోపం దేనికీ?" అన్నాడు చివరికి ఎలాగో తన బెదురూ, భయం కప్పిపుచ్చుకుంటూ.

అతను క్షణాలమీద అట్లా మారిపోతాడని ఊహించని అమూల్య ఈ పరిణామానికి చాలా రిలీఫ్ పొందింది.

"మీరన్నది బాగుందా మరి?" సూటిగా చూస్తూ ప్రశ్నించింది.

కోదండం ఆ చూపులు తట్టుకోలేనట్లు మొహం తిప్పేసుకున్నాడు.

"ఇందులో అంత కోపం తెచ్చుకునేందుకు ఏంలేదు. మా ఆవిడా, ఊరువెళ్ళింది. నీకా మొగుడు లేడు. వయసులో ఉన్నావు. పాపం కోరికలు రెచ్చగొడితే ఏ దుర్మార్గుడి చేతిలోనో చిక్కి, చెడిపోతావేమోనని నేనే ప్రపోజ్ చేశాను. నాలాంటి మంచివాడైతే నీకు ఏ కష్టం రాదని. అంతే. ఇలా చాలా చోట్ల జరుగుతుంది. ఇష్టమైతే సరే అంటారు, లేకపోతే లేదు. అంతే. ఇందులో పర్సనల్‌గా ఫీలయిపోయి, కోపం తెచ్చుకునేందుకు ఏంలేదు. సరే నీకిష్టంలేదంటే వద్దు. సరేనా మనం ఆ విషయం ఇక మర్చిపోదాం ఎప్పటికీ" అనేసి వెళ్ళిపోయాడు.

అమూల్య నివ్వెరపోయి చూస్తూ కూర్చుంది. తను వయసులో ఉంది కాబట్టి, కోరికలు రెచ్చగొడితే ఎవడి చేతిలోనో చిక్కి చెడిపోతుంది. అందుకని పాపం తనే ఆ పుణ్యం కట్టుకుందామనుకున్నాడుట. సిగ్గులేకుండా ఎలా చెపుతున్నాడో. వీళ్ళకి చీమూ, నెత్తురూ లేవా? ఇంత జరిగాక కూడా ఇంకా ఏమీ జరగనట్లు అతిమామూలుగా ఎట్లా ప్రవర్తించగలుగుతున్నారు?

కోదండం ఇంక అక్కడ ఎక్కువ సేపుంటే మంచిది కాదనుకున్నట్లున్నాడు, ఇంటికి ఉడాయించేశాడు.

అమూల్యకి ఒక్కత్తే వెళ్ళబుద్ధి కాలేదు. జానకితోపాటు బస్‌స్టాప్‌కి వెళ్ళింది.

బస్‌కోసం వెయిట్ చేస్తున్నంతసేపూ, జానకి కోదండం గురించి చెప్పుకుపోయింది.

"ఈ కోదండం ఉత్తదరిద్రుడు, రోగ్. వీడికి ఇద్దరు ఆడపిల్లలు. పెద్దదానికి ఇరవై రెండు, చిన్నదానికి ఇరవై. ఆ పెద్దది ఎవర్నో ప్రేమించిందట. వాడికిచ్చి చెయ్యటం కోదండంకి ఇష్టంలేదు. అందుకని ఏం చేశాడో తెలుసా? అదీగాక ఇంకోటి కూడా ఉందిలే. ఆ పిల్ల కాస్త క్రాక్. తల్లీదండ్రీ సంపాదించి పారేస్తుంటే, హాయిగా తిని కూర్చోక పిచ్చిపిచ్చిగా బిహేవ్ చేస్తుందిట. మరి ఎందుకో అలా. నిజంగా పిచ్చో, లేక పొగరో. ఎప్పుడన్నా ఆఫీసుకి వస్తే చూస్తావులే. ఆ అమ్మాయికి ముందు ఏ పిచ్చీలేదు, ఆమె ప్రేమికుడు దీన్ని ఆకర్షించాలని ఏదో మందు పెట్టాడని మన కోదండం గాఢనమ్మకం. వాళ్ళని ముందునుంచీ తెలిసినవాళ్ళు ఆ మాట చచ్చినా నమ్మరు. ఆ పిల్లకి ముందునుంచీ కాస్త పిచ్చి ఉందని వాళ్ళు అంటారు. సరే. ఏదైతే ఏంగానీ, ఆ పిల్ల వాళ్ళ వెనకింటివాడిని ప్రేమించిన మాట మాత్రం నిజం. ఆ




పిల్లాడికి ఆస్తీ, ఉద్యోగం ఏమీలేవు. అందు కని కోదండంకి వాడికిచ్చి చెయ్యటం ఇష్టం లేదు. ఆ పిల్లకి వాడేదో మందుపెట్టాడు కాబట్టి, ఆ మందుకి విరుగుడూ, ఆ పిల్లకి పిచ్చి వదిలేందుకు అని మన ఆఫీసులోనే ఉన్న మస్తాన్‌రావుని సాయం అడిగాడు" అంది జానకి.

"మస్తాన్‌రావు ఎవరు? "

"చూపిస్తానులే. సి.టూ. సెక్షన్లో ఉంటాడు. ఆయన పూజలూ అవీ చేస్తాడు. మంత్రాలు, తంత్రాలు తెలుసు. పూజచేసి తాయెత్తులూ, మంత్రాలూ ఇస్తాడు. రోగాలు వదిలిపోవటానికీ, పిచ్చి కుదరటానికీ, ఉద్యోగం రావటానికీ, పెళ్లి కుదరటానికీ, ఒకటేమిటిలే, దేన్నికైనా సరే, ఆయన పూజ చేసి తాయెత్తు ఇస్తాడు" జానకి ఆగింది.

అమూల్యా మౌనంగా వింటోంది.

"ఆయన్ని పిల్చి కోదండం సెక్షన్లోనే బతి మాలుకున్నాడు. అంతకుముందు ఏదో కాస్త విని ఉన్నా సంగతేంటో మాకు అప్పుడే క్లియర్‌గా తెలిసింది. సరే. మస్తాన్‌రావు అంతా చేస్తాను, రెండు వేలిమ్మని అడిగాడు"

"రెండువేలా? " అమూల్యా ఆశ్చర్యపోతూ అడిగింది.

"అంత ఆశ్చర్యపోకు. మస్తాన్‌రావు చెప్పిన ప్రకారం గ్రహాలకి శాంతి జరిపించా లంటే బోలెడు ఖర్చవుతుంది. పదిమందికి రకరకాల పిండివంటలతో భోజనం పెట్టా లిట. దేవుడికి ఇరవైరోజులపాటు శాస్త్రో క్తంగా పూజచేసి, కొబ్బరికాయలు కొట్టాలిట. ఇంకా ఏవేవో అర్పించి, కొన్ని దానాలు కూడా చెయ్యాలిట. ఇందులో తనకి మిగి లేది ఏదీలేదనీ, ఆఫీసువాళ్ళకని లాభంలే కున్నా చేస్తున్నాననీ మస్తాన్‌రావు అన్నాడు. నిజమే అయిఉండొచ్చు సిన్సియర్‌గా, శాస్త్రో క్తంగా చేస్తే, ఆయన చెప్పిందాన్ని బట్టి, అంత ఖర్చూ అవుతుంది"

"సరే, డబ్బు ఇస్తానుగానీ, నువ్వీలోపల పూజ మొదలుపెట్టి పనికానిస్తుండు. తాయెత్తు సిద్ధం చెయ్యి" అన్నాడు కోదండం.

"మస్తాన్‌రావు అలాగే చేసి ఇచ్చాడు. ఇదంతా నువ్వు ఈ ఆఫీసుకి రాకముందు జరిగింది. సరేగానీ నీకు తాయెత్తుల్లో నమ్మకం ఉందా? " జానకి అడిగింది.

అమూల్యా చిన్నగా నవ్వింది.

"నిజం చెప్పాలంటే, ఏది నమ్మాలో, ఏది నమ్మకూడదో, నేనేం నమ్ముతున్నానో కూడా తెలీనంత అయోమయస్థితిలో ఉన్నాను" అంది.

"ఎవరయినా అంతేలే. మరి అందులో నిజంగా పవర్ ఉందో, లేకపోతే యాదృచ్ఛి కంగా జరిగిపోయిందోగానీ మన కోదండం గారి కూతురి పిచ్చి తగ్గిపోయింది. ఆ వెన కింటివాడిని ప్రేమించటం కూడా మానే సింది. అంతవరకూ ఆ పిల్లని ఇంట్లో పెట్టి తాళం వేసేవారుట. బాగుపడ్డాక తిరిగి కాలే జీకి కూడా పోయిరావటం మొదలుపె ట్టింది. అంతా సాఫీగా అయిపోయింది" ఇంకా చెబుతూనే వుంది జానకి.

"అమూల్యా... ఆ తర్వాత ఏం జరిగిందో తెలుసా? నువ్వు కోదండంని పూర్తిగా ఎర గవు. వాడు పరమలోభి. ఏది ఎట్లా ఎగ్గొడ దామా అని చూస్తుంటాడు. ఏం చేశాడో తెలుసా? పాపం మస్తాన్‌రావు కోదండం ఇదే ఆఫీసులో ఉన్నాడు, పైగా సెక్షనాఫీస రుగా కూడా పనిచేస్తున్నాడు. ఎక్కడికి పోతాడులే' అని నమ్మి, అంత ఖర్చుపెట్టి, పూజచేసి, తాయెత్తు ఇచ్చాడు కదా. అతను అంతా అయాక డబ్బుకోసం రాగానే కోదండం ఒక్కపైసా కూడా ఇవ్వను పొమ్మ న్నాడు" జానకి ఆగి అమూల్యా మొహంలోకి చూసింది.

"ఆ..." అమూల్యా నిర్ఘాంతపోయింది.

"అవును. అది ఎలాంటి పనైనా కానీ. మస్తాన్‌రావు చాలా డబ్బు ఖర్చుపెట్టిన

మాట వాస్తవం. మెల్లగా డబ్బు ఇస్తానని నమ్మబలికిన కోదండం, సమయం రాగానే ప్లేటు ఫిరాయించాడు. అసలు నీ తాయెత్తు మా పిల్లకి కట్టనే లేదు పొమ్మని' అనేశాడు. 'నువ్వు తాయెత్తు కట్టావో లేదో నాకు అనవసరం, కానీ నేను నీకోసం బోలెడు ఖర్చు చేసి పూజ చేశాను కదా, మరి ఆ ఖర్చు ఇవ్వు' అని మస్తాన్‌రావన్నాడు. ఇవ్వను. ఏం చేసుకుంటావో చేసుకో అన్నాడు కోదండం. అవసరం తీరిపోయింది కదా అని బోలెడంత ధైర్యం వచ్చేసింది కోదండంకి"

"మరి తాయెత్తు ఇచ్చి పిచ్చి కుదిర్చే పవర్ ఉన్న మస్తాన్‌రావు ఇంకో తాయెత్తు తయారుచేసి ఆ తాయెత్తు మహిమ పోయేట్లు చేస్తాడేమోనని భయం వెయ్యలేదా కోదండంకి" అమూల్యకి అర్థంకాలేదు.

"అట్లాంటి భయాలేం లేవు కోదండంకి. అదో మాదిరి పశువు తరహా మనిషి. చివరికి పైసాకూడా ఇవ్వనేలేదు. మస్తాన్‌రావు చేసేది లేక తిరిగి వెళ్ళిపోయాడు"

"ఇంకెప్పుడూ మొత్తం సొమ్ము అడ్వాన్స్ తీసుకోకుండా చెయ్యడు"

"అంతే... చూశావా కోదండం ఎలా చేశాడో. వాడికి ఈ లోకంలో ఏదన్నా భయంలేదు, ఒక్క భార్య అంటే తప్ప. ఈ తాయెత్తు ఐడియా, ఆ తర్వాత డబ్బు ఎగ్గొట్టిన ఐడియా కూడా ఆ మహాతల్లివే అంటారు జనం. నిజమే అయ్యుండాలి. వీడికి సొంత బుర్ర, సొంత అయిడియా ఏమీలేవు. ఆవిడ ఏం చెపితే అదే" అంది జానకి.

కోదండం మాటలు గుర్తుకొచ్చి అమూల్యకి ఇంకా బాధగానే ఉంది. ఇదా ప్రపంచం... ఎట్లాంటి మనుషుల్ని చూడాల్సి వస్తోంది.

అమూల్య నిట్టూర్చింది.

★ ★ ★

జానకి ప్రయత్నంమీద అమూల్యకి ఇల్లు దొరికింది. ఒక గది, హాలు, వంటగది ఉన్నాయి. ఇంటి ఓనరు హైదరాబాద్‌లో ఉంటాడు. అద్దె తక్కువే. అమూల్య వెంటనే అడ్వాన్స్ ఇచ్చేసింది.

ఇల్లు అద్దెకి తీసుకున్న విషయం చెప్పగానే రాజమ్మత్తా, భాస్కరం మామయ్యా చిందులుతొక్కారు. అమూల్య ఏదో ఒక రోజు తమదారికి రాక తప్పదని అనుకుంటూ వచ్చారిన్నాళ్ళూ. ఒకసారి ఇల్లు గనక వేరే చూసుకుని వెళితే మళ్ళీ తమకి చిక్కదని వాళ్ళబాధ. బంగారు చేపని తిరిగి నీళ్ళలో వదిలిపెట్టాల్సివస్తోందని భాస్కరం తెగ బాధపడ్డాడు.

"అంతా నిన్నసలు ఇంట్లో చేరనివ్వవద్దని సలహా ఇచ్చారు. నీ మాజీమొగుడు పెద్దరౌడీట. మామీద కక్షకడతాడని అంతా మొత్తుకున్నా వినకుండా నీకు నీడనిచ్చాం. నీకు విశ్వాసం లేదే. నీ అవసరం ఉన్నన్నాళ్ళూ ఊరుకుని ఇప్పుడు ఎగిరిపోతావా. నువ్వు బాగుపడవు" భాస్కరం శపించాడు. రాజమ్మత్త అతనికి వంతపాడింది.

వాళ్ళిద్దరి తిట్లమధ్యా అమూల్య మౌనంగా నిష్క్రమించింది.



**ఆ**ఫీసు వాతావరణం అలా ఉండగా





ఇంటిదగ్గర కూడా అశాంతికి కొరతలేదు. అమూల్య ఉంటున్న ఇంట్లో ఇంకా చాలా పోర్షన్లు ఉన్నాయి. చుట్టుపక్కల కూడా ఇళ్ళు ఉన్నాయి. ఇరుగుపొరుగు స్త్రీలు ఆమెతో ఎన్నడూ మాట్లాడేవాళ్ళు కారు. ఆమెని చూడగానే తలుపు వేసుకునేవాళ్ళు. అమూల్యకి భర్తలేదు కాబట్టి వాళ్ళ భర్తలనెక్కడ వాళ్ళనుంచి కాజేస్తుందోనన్నట్లు భయపడేవాళ్ళు. అందుకని తమతమ భర్తల్ని సంరక్షించుకునే ప్రయత్నంలో ఉండేవాళ్ళు. ఇంత ప్రయత్నిస్తున్నా వాళ్ళ భర్తలు మాత్రం, అంత ప్రతికూల వాతావరణంలో కూడా ఎలాగో ఒకలా ఆమెతో మాట్లాడటానికీ, చనువు పెంచుకోవటానికీ ప్రయత్నిస్తుండేవాళ్ళు.

స్నేహితులు లేరు. బంధువులు లేరు. ఒంటరితనం ఆమె మనసుని మరీ బలహీనం చేసింది. ఒంటరితనాన్ని భరించలేననుకున్నప్పుడు ఆమె తన పరిస్థితినంతా ఒక ఉత్తరంలా విజయ్‌కి రాసేది. కానీ పోస్ట్ చేసేది కాదు. ఊరికే రాసి దాచిపెట్టేది. తన మిత్రుడితో బాధల్ని పంచుకున్న భావన కాస్త ఊరటనిచ్చేది ఆమెకి.

ఆమె పూర్తిగా ఒంటరి. తనకి దేవుడు తప్ప ఎవరూ లేరనుకునేది. కానీ దేవుడి దర్శనానికి గుడికి వెళ్తే అక్కడి వాతావరణం కూడా...

జనం అదోలా చూసే చూపులు.

మగాళ్ళ డేగ కళ్ళు

పిల్లలు ఆమెని వింతగా చూడటం.

ఇంతే.

రాత్రిపూట ఉండుండి మెలకువ వచ్చేస్తుంది. గుండె దడదడా కొట్టుకుంటుంది. భయంకరంగా చెమటపోస్తుంది. తను కాళ్ళూ, చేతులూ కదిలించలేక బాధపడుతుంది. ఎలాగో ఆ పరిస్థితినుంచి బయటపడి పూర్తిగా మెలకువలోకి వచ్చాక తన నిస్సహాయ పరిస్థితి ఆమెని మరింత భయపెడుతుంది. గతం ఆమెని జడిపించి, వర్తమానం భయపెట్టి భవిష్యత్తు బెదిరిస్తుంది. ఓదార్చేవాళ్ళు ఎవరూ లేక ఆమె బావురుమని ఏడ్చి, మరింత భయంతో కాలం గడిపేది.

★ ★ ★

అమూల్య ఆరోజు పని ముగించుకుని కూర్చుంది.

భోజనం చేద్దాం అనుకుంటుండగా...

ఎవరో తలుపు తట్టారు.

ఒంటరి మనిషి కావటంతో రాత్రయాక తలుపు శబ్దం వినబడితే చాలు భయంవేస్తోంది. ఎవరో, ఏమిటో అని ఒణికిపోతుంది. రోజురోజుకీ భయం, భద్రతారాహిత్యం. ఒంటరితనం, ఎవరూ లేరన్న భావన, ఆందోళన, అయోమయం ఆమెని చుట్టుముట్టుతున్నాయి.

కిటికీలోంచి తొంగిచూసి గానీ తలుపు తియ్యటం లేదు. అలాగే తొంగిచూసింది.

రంగమ్మ.

అమూల్య ఆశ్చర్యపోయింది. వెంటనే తలుపు తెరిచింది.

"రండి ఆంటీ... రండి" అంది.

"నాకేం మర్యాదలు చెయ్యక్కర్లేదు. చేసేవన్నీ చేస్తూ మళ్ళీ ఎందుకీ నంగనాచి మర్యాదలు? " అందావిడ కరుగ్గా.

అమూల్య బిత్తరపోయింది.

"నేనేం చేశాను" అంది.

"చెయ్యకేం మహాతల్లీ. మావాడికి ఏం మందు పెట్టావో, ఏ మాయ చేశావో గానీ, పెళ్ళిమానుకుని నీ జపం చేస్తూ కూర్చున్నాడు. నువ్వో దెయ్యానివి. నా కొడుకు జీవితం నాశనం చేశావు. ఇంకా ఏం చేద్దామనే నీ ఆలోచన? " రంగమ్మ బిగ్గరగా అరిచింది.

ఇరుగుపొరుగువాళ్ళు కిటికీల్లోంచి చూడటం మొదలుపెట్టారు.

అమూల్యకి బెరుగ్గా, భయంగా ఉంది.

ఆమె కళ్ళు లజ్జనీ, భయాన్నీ ప్రతిఫలిం

చాయి.

అది చూసి రంగమ్మ రెచ్చిపోయింది.

కూతుళ్ళిద్దరినీ పోగొట్టుకుంది ఆమె. ఉన్న ఒక్క కొడుకూ మోడులా ఉండటం సహించలేక ఇవాళ అటో ఇటో తేల్చెయ్యా లన్నంత ఆవేశంలో ఉంది.

"రాక్షసీ... పచ్చి వ్యభిచారపు ముండవి నువ్వు. నా కొడుకుని మాయచేసి నీ చుట్టూ తిప్పుకుంటున్నావే. నువ్వు బాగుప డవు" గొంతు చించుకుని అరిచింది రంగమ్మ.

అమూల్య నిర్ఘాంతపోయి చూస్తోంది.

"దెయ్యంముండా... నీతో ఏ బంధం ఉన్నా వాళ్ళంతా సర్వనాశనమైపోతారు. నువ్వో నష్టజాతకురాలివి. మనుషుల్ని మింగేసే రాక్షసివి. నీ తల్లి చచ్చింది. నీ అన్నా వదినా, అబ్బా అంతా చచ్చారు. అంతే నీ తలరాత. నీతో ఏమాత్రం బంధం ఉన్నా వాళ్ళు పోతారు. నీ పెళ్ళా? పెటా కులైంది. అంతా సర్వనాశనం. ఇప్పుడు నా కొడుకు నీకోసం పెళ్ళి మానుకుని కూర్చు న్నాడు. నువ్వు తెరవెనక ఉండి నాటకం ఆడిస్తున్నావు. నువ్వు నాశనమైపోతావే. నాశనం అయిపోతావు"

అమూల్య శిలలా నిలబడింది. ఊపిరి పీల్చటం కూడా మర్చిపోయింది.

కొయ్యబారిపోయిన ఆమెకి నోరు తెర వటం కూడా సాధ్యం కాలేదు. కాసేపయాక ఎట్లాగో గొంతుపెగుల్చుకుని అంది.

"నేనేం చెయ్యగలను ఆంటీ. మీరడిగి నట్లు హైదరాబాద్ కూడా వదిలి వచ్చేశాను కదా"

"నువ్వు బతికున్నంతకాలం వాడు మరొక ళ్ళని చేసుకునేందుకు ఒప్పుకోడు. అసలు ఇంత సిగ్గులేకుండా ఎలా బతుకుతున్నావో ఆశ్చర్యం వేస్తోంది నాకు. మీ ఇంట్లోవా ళ్ళంతా చచ్చారు కానీ ఇంత దుర్మార్గురాలివి నువ్వు మాత్రం బతికే ఉన్నావు. బహుశా దెయ్యాలకి కూడా నువ్వంటే భయమేమో. అందుకే చావు కూడా నీ దగ్గరకు రావటా నికి భయపడుతోంది" రంగమ్మ వెటకారం నిండిన స్వరంతో కేకలు వేసింది.

ఆమె పని పూర్తయింది. అక్కడ ఆమెని ఎదుర్కొనేందుకు కూడా ఎవరూ లేరు. తను వచ్చిన పని అయిపోయింది కాబట్టి వెనక్కుతిరిగి వెళ్ళిపోయింది.

అమూల్య శిలలా నిలబడింది.

తనని చల్లటిగాలి చుట్టుముట్టటం కూడా ఆమె గమనించలేదు. పూర్తిగా కొయ్యబారి పోయింది ఆమె.

స్తంభించిపోయిన ఆమె మనసు ఇరుగు పొరుగుల వెక్కిరింపుల్నీ, వెటకారపు నవ్వుల్నీ కూడా గమనించలేకపోయింది.

ఆమె మనసు మొద్దుబారిపోయింది. అయినా అంత మొద్దుబారిన మనసూ ఆలోచిస్తూనే ఉంది.

విజయ్ గురించి...

అమూల్య మనసు ఆమెకి చెపుతోంది.

'అమూల్యా... ఇందాక విజయ్ తల్లి అన్నట్లు నువ్వు శనివి. నష్టజాతకురాలివి. నువ్వు పుట్టగానే నీ తల్లి పోయింది. నీ కుటుంబంలోని అంతా పోయారు. నీకె వరూ లేరు. ఎవరికీ నువ్వు అక్కర్లేదు. నీ జీవితం వృధా. అయినా అంత పనికిమా లిన జీవితమైన అది ఇతరుల జీవితాల్ని ప్రభావితం చేస్తూనే ఉంది. చూడు నీ కోసం, నీవల్ల విజయ్ పెళ్ళికి ఒప్పుకోవటం లేదు. నువ్వు బతికి ఉన్నంతకాలం ఎవర్నీ చేసుకోడు. అమూల్యా, నీవల్ల ఎవరికీ సుఖంలేదు. నీ చావువల్ల ఎవరికీ నష్టం లేదు. పైపెచ్చు నువ్వు చచ్చిపోతే విజయ్ పెళ్ళి చేసుకుని సుఖంగా ఉంటాడేమో! అమూల్యా చచ్చిపో అమూల్యా. చచ్చిపో. ఆమె మనసు ఘోషిస్తోంది.

'అమూల్యా... ఇంత వృధా జీవితానికి కూడా అందమైన శరీరాన్నిచ్చాడు దేవుడు. అది ఎంత కృంగి, కృశించినా ఇంకా ఎంతో





మందిని రెచ్చగొడుతూనే ఉంది. నీకు రక్షణ లేదు. భద్రతలేదు. ఒంటరి పక్షివి. ఎప్పుడేం జరుగుతుందో? చిన్నదానివే. ఎంతో జీవితం గడిచిపోయినట్లనిపిస్తున్నా, ఇంకా పాతికేళ్ళు కూడా నిండలేదు. మొత్తం జీవితం ముందే ఉంది. మరింత అవమానాన్నీ, ఆవేదనలనీ ఎదుర్కోకముందే చచ్చిపో అమూల్యా. చచ్చిపో'

"అవును. నేను చచ్చిపోవాలి" అనుకుంది అమూల్య.

"నేను చావాలి. విజయ్ నాకోసం ఎంతో చేశాడు. నాకోసం తనవాళ్ళను వదులుకున్నాడు. సమాజాన్ని లెఖ్ఖచెయ్యలేదు. ఎంతటి ప్రమాదాలనైనా ఎదుర్కొనేందుకు సిద్ధపడ్డాడు. తనని ఒక నిజమైన ప్రేమికుడిగా నిరూపించుకున్నాడు. నేను చావాలి. నేను చచ్చిపోవాలి. విజయ్ భవిష్యత్తు కోసం విజయ్ ఆనందం కోసం చచ్చిపోవాలి"

"విజయ్... విజయ్" ఆమె వెక్కివెక్కి ఏడ్చింది. వెర్రి ఆవేశంతో వంటింట్లోకి పరుగెత్తింది. ఆవేదనతో, ధృఢ నిశ్చయంతో తలుపులన్నీ గడియపెట్టింది.

కిరసనాయిల్ డబ్బా తీసి మొత్తం వంటి మీద గుమ్మరించుకుంది. అగ్గిపుల్ల తీసి అంటించుకుంది.

మంటలు... మంటలు... మంటలు.

"భగవంతుడా నన్ను అన్నింటిలో విఫలం చేశావు. దయచేసి, ఈ చావు ప్రయత్నంలోనైనా సఫలం చెయ్యి దేవుడా" ఆమె ఎలుగెత్తి అరిచింది.

మంటలకి చుట్టుపక్కలవాళ్ళు పరుగెత్తుకుని వచ్చారు. వాళ్ళు పరిస్థితి గ్రహించి, తలుపులు బద్దలుకొట్టి, లోపలకు వెళ్ళి, ఆమెని రక్షించేలోపలే అంతా ముగిసిపోయింది.

చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకుని, తన వాళ్ళందరినీ పోగొట్టుకుని, ఇరవైరెండేళ్ళు కూడా రాకుండానే క్రూరమృగంలాంటి మనిషి చేతిలో చిక్కుకుని, అతికష్టంమీద ఆ పెళ్లినుంచి బయటపడి, ఏ సుఖమూ లేని ఎడారిలాంటి బతుకులో, ఏకైక ఒయాసిస్సులాంటి ఒక్కగానొక్క మిత్రుడిని మిగుల్చుకుని, ఆ మిత్రుడి సుఖం కోసం జీవితాన్ని అతిఘోరంగా అంతం చేసుకున్న అభాగ్యురాలి జీవితం అలా ముగిసిపోయింది.

అతను కథ ముగించాడు.

ఆ కథని అతను ఒక్కరోజులో ముగించలేదు.

అతను చాలా బిజీమనిషి. అతనికి కోర్టుకి వెళ్ళటం, తర్వాత సాయంత్రం క్లయింట్లు వచ్చి మాట్లాడటం ఉండేవి.

అతను "ఓదార్పు" స్వచ్ఛంద సంస్థ సేవా కార్యకలాపాల్లో చురుగ్గా పాల్గొంటూ ఉండేవాడు. ఈ పనులన్నిటితో అతను ఇంటికి వచ్చేసరికి పది దాటేది. ఆమె అతనికోసం ఎదురుచూస్తూ ఉండేది. ఇంట్లో ఎప్పుడూ ఒక వంటమనిషి, పనిమనిషి ఉండేవాళ్ళు. కమలినికి అతను పుస్తకాలూ, వీడియో కాసెట్లూ ఇచ్చాడు. అవన్నీ ఆత్మహత్యా ధోరణి ఉన్నవాళ్ళను భుజం తట్టి ధైర్యం చెప్పి, ఆ ఆలోచననుండి ఇవతలకు లాగేవే. అవన్నీ చదవటం, అప్పుడప్పుడూ అతనితో కలిసి "ఓదార్పు" సంస్థ కార్యకలాపాలకు వెళ్ళటం, ఆత్మహత్యకు పాల్పడిన, పాల్పడబోయిన వాళ్ళ కథలు తెలుసుకోవటం జరిగాయి.

తనకు తెలియకుండానే తన దృక్పథంలో, ధోరణిలో మార్పు వచ్చిందని గ్రహించగలిగింది కమలిని.

ఈ కథ అతను అప్పుడప్పుడూ ముక్కలు ముక్కలుగా చెపుతూ వచ్చాడు. కథ పూర్తవటానికి నెలపట్టింది. మూడురోజులు మాత్రం ఉంటానన్న కమలిని బుద్ధిగా నెల రోజులూ ఉండిపోయింది.

కథ పూర్తిగా విన్న కమలిని నిట్టూర్చి

ఆనంద్‌వైపు చూసింది. అతను కిటికీలోంచి బయటకు చూస్తున్నాడు. రాత్రి పదకొండ వుతోంది. బయట చెట్లన్నీ వెన్నెలకాంతిలో మెరుస్తున్నాయి. చల్లటి వాతావరణం... అతని మొహంలోకి చూసింది కమలిని. ఏ భావాలూ కనిపించలేదు.

"కమలినీ" అన్నాడతను వెనుతిరిగి.

ఏమిటన్నట్లు చూసింది కమలిని.

"కమలినీ... ఇప్పుడు చెప్పు. ఈ కథలో ఆనంద్, శారద, అమూల్య, శిరీష, లలిత... అంతా ఆత్మహత్య చేసుకున్నవాళ్ళే. వాళ్ళ ఆత్మహత్యలమీద నీ అభిప్రాయం ఏమిటో చెప్పు" అన్నాడు.

కమలిని ఒక్క నిమిషం మౌనంగా ఉండి పోయింది.

"నా దృష్టిలో ఎవరిదీ సహేతుకమైన కారణం కాదు. ఆనంద్, శారద... కాస్త ఓపికపట్టి బతుకు తెరువు వెతుక్కుంటే ఏదో ఒకటి దొరక్కపోయేది కాదు. ఇక శిరీష. అన్నాళ్ళూ విన్న పాఠాల్ని దండగ చేసింది. కాస్త ఆగి ఆలోచించి ఉంటే చచ్చి పోయేది కాదు. భర్తకి మంచి బుద్ధి చెప్పి తన కాళ్ళమీద తను నిలబడి ఉండేది. ఇక అమూల్య తను చచ్చిపోతే అతను పెళ్లిచేసు కుంటాడేమో అని అనుకుని చావటం అవి వేకం. అది పూర్తిగా ఆవేశంతో చేసినపని. లలిత అంత ఫాస్ట్‌గా ఉన్నమనిషి, చివరికి అసమర్థురాలిలా చచ్చిపోవటం వింతగా ఉంది. కొంచెం బుర్రకి పదునుపెట్టి ఉంటే, తనని మోసం చేసిన వ్యక్తిని ఎదుర్కోవా లన్న ఆలోచన తట్టి ఉండేది" గబగబా చెప్పేసింది.

ఆనంద్ చిరునవ్వు నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు? " అంది కమ లిని.

"అది ఇతరుల సమస్య కాబట్టి అంత తేలిగ్గా చెప్పేయగలిగావు. అదే నీ స్వవి షయం అయివుంటే... నువ్వు వాళ్ళ పరిస్థి తిలో ఉండి ఉంటే? " అన్నాడు.

కమలిని అర్థం కానట్లు చూసింది.

"కమలినీ. నువ్వు చెప్పిన మాటలు నిజం. చాలా శాతం ఆత్మహత్యలు ఆవే శంలో తీసుకున్న నిర్ణయాలే అయివుం టాయి. కొంచెం ఆగి, ఆలోచిస్తే వాళ్ళు ఆ పని చెయ్యరు. కానీ వాళ్ళకు ఆ అవకాశం ఎక్కడుంటుంది? డిప్రెషన్‌లో ఉండి, కృంగిపోయి, ఎలా చచ్చిపోదామా అని చూసేవాళ్ళకు తీరిగ్గా ఆలోచించాలని ఎలా తడుతుంది. అందుకే మా సంస్థ "ఓదార్పు" ద్వారా అట్లాంటి వాళ్ళను ఆదుకుంటాం. మాకు ఫోన్‌నెంబర్లు, ఇ.మెయిల్, వెబ్ సైట్ అన్నీ ఉన్నాయి. కరపత్రాల ద్వారా, ప్రకటనల ద్వారా మా సంస్థ ఉద్దేశాన్నీ, మా సంస్థ గురించి వివరాల్నీ ప్రజలకు తెలుపుతూ ఉంటాము. ఎవరైనా నిరాశతో కృంగిపోయి ఉంటే, వాళ్ళు మా సంస్థని సంప్రదిస్తే, కావలసిన సలహా, సహాయం అందిస్తాం. ఈ ఏడాది.... దాదాపు నాలు గువందలమందికి మా సాయాన్ని అందించాం" అన్నాడతను.

"అత్తింటి బాధలు పడలేక కొందరు, అప్పులపాలై కొందరు, అక్రమ సంబంధా లతో కొందరు, పరీక్షల్లో ఫెయిలయ్యి కొందరు, ప్రేమలో విఫలమై కొందరు... పెళ్ళి అవదేమోనని కొందరు. తల్లో తండ్రో మందలించారని కొందరు... కారణాలు ఏవైనా రోజూ ఏదో ఒక ఆత్మహత్య వార్త తెలుస్తూనే ఉంటుంది.

దీనికి కారణం ఏమిటి?

మానవసంబంధాలు రోజురోజుకీ కృశించి పోతున్నాయి.

మనిషికీ, మనిషికీ మధ్య దూరం పెరు గుతోంది.

ఆధునిక సమాజంలోని వేగం, మనిషి లోని ఆలోచనను దెబ్బతీస్తోంది.

కృంగిపోయిన మనసు, జీవనంలోని ఒత్తిడి మనిషిమీద ప్రభావం చూపిస్తు న్నాయి.





ఏ సమస్య ఎదురైనా, చావు ఒక్కటే సమాధానమనే ధోరణి పెరుగుతోంది.

అందుకే నిరుద్యోగులు, చిరుద్యోగులు, ఉన్నతోద్యోగులు, విద్యార్థులు, డాక్టర్లు, ఇంజనీర్లు, వ్యాపారవేత్తలు, పోలీసు ఆఫీసర్లు, ఒకరేమిటి... ఎవరికైనా సరే తీవ్రమైన సమస్యలు ఎదురైనప్పుడు, చచ్చిపోతేసరి అనే అభిప్రాయం ఏర్పడుతోంది" అన్నాడతను.

"అవును" ఒప్పుకుంది కమలిని. కమలినిలో ఆసక్తి పెరిగింది.

"అవునుగానీ ఆనంద్‌గారూ. ఇంతకీ కథలో విజయ్ ఏమయ్యాడు చివరికి?" అడిగింది.

తనవాళ్ళు అంతమంది ఆత్మహత్యలు చేసుకున్నాక విజయ్ చాలా కృంగిపోయాడు. ఎందుకిలా జరిగిందన్న ప్రశ్న అతన్ని వేధించేది. వాళ్ళని మర్చిపోలేక సతమతమయ్యేవాడు. చివరికి ఎలాగో గుండె రాయి చేసుకున్నాడు. వాళ్ళందరి చావుకూ తను ఇప్పుడింక ఏంచెయ్యలేడు. కానీ అలా నిరాశకి గురయ్యి, చచ్చిపోదాం అనే ఆలోచనలో ఉన్నవాళ్ళను చావకుండా రక్షించవచ్చు.

ఆ లక్ష్యంతో ఆత్మహత్యల నివారణకు నడుం బిగించాడు. అడ్వకేట్‌గా ప్రాక్టీసు చేస్తూ కొందరు స్నేహితులతో "ఓదార్పు" సంస్థని స్థాపించాడు.

"అంటే..." కమలిని ఆశ్చర్యంగా చూసింది.

"అవును కమలినీ. నేనే ఆ విజయ్‌ని. నా పూర్తిపేరు విజయానంద్" అన్నాడతను.

కమలిని రెప్పవాల్చకుండా అతనివైపే చూస్తోంది. ఆ చూపుల్లో జాలీ, విస్మయం, ప్రేమా, సానుభూతి.

జీవితంలో తన వాళ్ళందరినీ పోగొట్టుకుని మోడులా నిలబడ్డ అతన్ని చూస్తే చెప్పలేనంత బాధ కలిగింది. కానీ అంతలోనే ఆమెకు అర్థమయింది. అతనికి తనవాళ్ళూ, పరాయివాళ్ళని లేదు. అంతా తన వాళ్ళేనని భావించేమనిషి.

"కమలినీ" అన్నాడతను.

"ఊ..."

"ఇప్పటికైనా నీకు ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచన పోయిందా?" అడిగాడు అతను.

"పోయింది. ఇప్పుడు నాకు ఆత్మహత్య చేసుకోవాలని లేదు" ధైర్యంగా సూటిగా చూస్తూ సమాధానం చెప్పింది కమలిని.

"గుడ్! అయితే అతన్ని పెళ్ళికి ఒప్పించమంటావా? మా సంస్థ తరఫున పోరాడమంటావా?" అడిగాడు అతను.

"అదేం వద్దు" అంది కమలిని.

"మరి?" ఆనంద్ అడిగాడు.

"ఆనంద్‌గారూ... ఇప్పుడు తల్చుకుంటే నామీద నాకే అసహ్యం వేస్తోంది. అతన్ని ప్రేమించి గుడ్డిగా వెంటతిరిగాను. అతను కాదంటే చివరికి ఆత్మహత్యకు కూడా సిద్ధపడ్డాను. ఆత్మగౌరవం, ఆత్మాభిమానం లేని నా ప్రవర్తన మీద నాకే జాలివేస్తోంది.

"అతను రాసిన ఉత్తరాలూ, ఫొటోలూ సాక్ష్యంగా నా దగ్గర ఉన్నాయి. నిజమే. కానీ అతను నామీద ప్రేమలేదనీ, ఊరికే సరదాకి తిరిగాననీ ఖచ్చితంగా చెపుతుంటే, నేను ఏమాత్రం అభిమానం లేకుండా అతనికోసం పాకులాడాలా?

దేవుడి దయవల్ల ప్రేమలో ఉన్నా ఏనాడూ హద్దులు మీరలేదు.

"ఆనంద్‌గారూ, నేను గట్టిగా నిర్ణయించుకున్నాను. నా లక్ష్యం, గమ్యం ఐ.ఏ.ఎస్. అవ్వాలని. నా లక్ష్యసాధనకు కృషిచేస్తాను. అంతే. అతని ప్రసక్తి నా జీవితంలో మరి లేదు"

దృఢంగా చెప్పింది కమలిని.

ఆత్మవిశ్వాసం, స్థైర్యం, దృఢనిశ్చయంతో పరిపూర్ణమైన యువతిలా కనిపిస్తోంది ఆమె.

ధైర్యంగా ముందడుగు వేయటానికి సిద్ధపడిన ఆ యువతిని ప్రశంసనిండిన కళ్ళతో చూస్తూండిపోయాడు ఆనంద్.



# ఏరిన ముత్యాలు

★ మానవుని మేధ, దాని సంపూర్ణ అర్థంలో వెయ్యింట తొమ్మిది వంతులు విద్య ఫలితం. మిగిలిన ఒక్క వంతుమాత్రం వారసత్వంగా సంక్రమించింది కావచ్చు

–వి.యం. సెచెనోవ్

★ నా వద్ద ఏమైనా డబ్బు వుంటే దానితో పుస్తకాలు కొంటాను . పుస్తకాలు కొనగా డబ్బు మిగిలిగే దానితో తిండి, బట్ట సమకూర్చుకుంటాను.

–ఎరాస్మస్

★ మనబాధలను మర్చిపోడానికి మార్గం ఇతరుల బాధల నివృత్తికి కృషి చేయడమే.

– ఒక సూక్తి

★ ఎవరైనా పశువు కాదలచుకుంటే మానవాళి యాతనను చూడకుండా కళ్ళు మూసుకుని తనగురించి మాత్రమే చూసుకోవచ్చును.

–మార్క్స్

★ శిక్షణ పొంది ఉండకపోతే యంత్రాన్ని నడుపవద్దు.

–ఒకసూక్తి

★ కృత్రిమ సౌందర్యం వేశ్య వంటిది.

–టాల్‌స్టాయ్

★ మనిషి ఎలాంటివాడో హృదయం వల్లనే కాదు, ముఖంలోనూ తెలుస్తుంది

–జార్జ్ మాక్‌డొనాల్డ్

★ వికృతమైన మనసు కంటే వికృతమైన ముఖం మంచిది.

–జేమ్స్ ఎల్లిన్

★ సంతోషాన్ని మించిన సౌందర్య సాధనం ప్రపంచంలో మరొకటి లేదు.

–లేడీ బెస్సింగ్టర్

★ కొత్తదనం పట్ల ఆపేక్ష మానవుని స్వభావంలోనే ఉంది

–ప్లీనీ

★ నీ సంతుష్టికై విందారగించు ఇతరుల సంతుష్టికై దుస్తులు ధరించు.

–ఫ్రాంక్లిన్

★ కాలమును మించిన మంచి బోధకుడు లేదు.

–పర్షియన్ సామెత

★ ఉత్సాహంలేకుండా ఇంతవరకూ ఎవరూ గొప్ప కార్యమును సాధించలేదు.

–ఎమర్సన్

★ లక్ష్యాన్ని మరిచిపోవకపోవడమే విజయానికి కీలకం

–బెంజిమన్ డిజ్రేలీ

★ నక్క తన చర్మాన్ని అయినా మార్చుకుంటుంది గానీ తన అలవాట్లను మార్చుకోదు.

–సూటోనియస్

సేకరణ : తిప్పారెడ్డి

# 'సాహసి' పై సమీక్షలు

ఏప్రిల్ 'చతుర'లో ప్రచురితమైన మొలకలపల్లి కోటేశ్వరరావు నవల 'సాహసి' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## సబల

*(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

ప్రాచీన కాలం నుండి 'న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అంటూ స్త్రీని వంట ఇంటికే పరిమితం చేశారు. ఇప్పటికీ కొన్ని మతాల్లో మధ్య యుగాల్లోలా స్త్రీ కేవలం భోగ్యవస్తువు. పిల్లల్ని కనే యంత్రంలా భావిస్తున్నారు. కనుకనే అనాదిగా స్త్రీ తన పోరాటం సాగిస్తూనే ఉంది. శీలం అనే దాన్ని స్త్రీకే పరిమితం చేసి హింసిస్తోంది పురుష సమాజం. పిపీలికాది జీవుల్లో, పక్షుల్లో, జంతువుల్లో స్త్రీ జాతికే ఆధిక్యతవుంది. పురుషుడు తను బలవంతుడనే అహంభావంతో స్త్రీని అణచే ప్రయత్నం చేస్తున్నాడు. కానీ స్త్రీల ఆలోచనా ధోరణి మారింది.

ఎవరో వచ్చి సహాయం చేస్తారనీ హక్కుల్ని ఇస్తారనీ చూడకుండా తమ శక్తియుక్తుల్ని వినియోగించి సాధికారత సాధించాలి.

ఈ నెల చతుర నవల 'సాహసి'లోని కథానాయిక కరుణ పాత్ర దీనికో ఉదాహరణ. సమాజంలో నిత్యం జరుగుతున్న సంఘటనల్ని తీసుకొని నవలగా మలిచిన తీరు బాగుంది. విద్యార్థుల్లో, యువతుల్లో కరుణకున్న సాహసం రావాలి.

చాలా సందర్భాల్లో స్త్రీకి స్త్రీయే శత్రువుగా మారుతుంది. అత్తల ఆరళ్లు, ఆడబిడ్డల దాష్టీకాలు పెరుగుతున్నాయి. తల్లికి ఎప్పుడూ కూతురికి త్వరగా పెళ్లిచేసి అత్తారింటికి పంపాలి అనే ఆలోచనే. నవలలో సరస్వతమ్మ పెద్దకూతురు కాపురం బాగులేకున్నా త్వరగా చిన్న కూతురు పెళ్లి చేయాలని, చదువు వద్దని భావిస్తుంది.

చిన్నప్పటినుంచీ స్త్రీని సబలగా ఆలోచించనీకుండా అబలగా పెంచుతున్నారు. ఈ ధోరణి తల్లిదండ్రుల్లో మారాలి. శంకరం లాంటి ఆలోచన వుండాలి. కూతురుని కొడుకుతో సమంగా చదివించాలి, ఉద్యోగం చేయించాలి.

**-ధప్పూరి శ్రీధరాచార్య**
ఆశిఫాబాద్- 504293

# ఇంకా బాగుండాల్సింది

*(రెండవ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

**'సాహసి'** నవల ద్వారా రచయిత స్త్రీలలో సాహసం పెంపొందాలని ఆశించారేమోకాని మరింత పటుత్వంతో కథని నడిపించాల్సింది. పట్టుదల, సాహసం వుంటే సాధించలేనిదంటూ ఉండదని చెప్పటంలో రచయిత కొంతమేరకు విజయం సాధించారు.

సగటు ఆడపిల్లకు ప్రతిబింబం రాధ. ఎవరు కామెంట్ చేసినా తలొంచుకొంటూ లొంగివుండే మనస్తత్వం అయినా తోడు దొరికితే ఎదిరించే స్థయిర్యం వస్తుందని చిత్రీకరించిన తీరు బాగుంది.

పసితనం నుండే పరిస్థితులను ఎదిరించే ధైర్యం, సాహసం కలది కరుణ. కాని ఎంతసేపూ సమాజంలోని ఒడిదుడుకులను కాక అల్లరి మూకలని ఎదిరించడంవరకే పరిమితం చేయడం బాగాలేదు.

సాహసానికి మారుపేరుగా కరుణ వ్యక్తిత్వం చిత్రీకరించిన తీరు, అమాయకంగా మగవాని దౌష్ట్యానికి బలైపోయిన రాధ, చేయని తప్పుకు చదువు మానేసిన వనజ, సగటు గృహిణిగా సరస్వతమ్మ, కూతురికి తోడుగా నిలిచే నాన్నగా శంకరం, పోకిరీ కుర్రాడిగా రాజు పాత్రలని చక్కగా మలిచారు.

నవలకి ప్రాణం పోసిన సంఘటన అసభ్యపోస్టర్ తొలగింపులో కరుణ ఓటమి. ఎంత వారికైనా వేళ్లూనికొనిపోయిన అవినీతిని పెరికి వేయడం కష్టం. అందుకు చాలా కృషి అవసరం అనే విషయాన్ని నిరూపిస్తున్నాయి.

ప్రిన్సిపాల్ విద్యార్థుల స్కాలర్‌షిప్స్ మింగడం, శాంతారాం రాధని లొంగదీసుకోవడం, సందీప్‌ని పోలీస్ ఆఫీసర్ రక్షించ పూనుకోడం సహజంగా చిత్రీకరించారు.

అయితే లెక్చరర్ సౌమ్య సమస్య అసంపూర్తిగా నిల్చిపోయింది.

హరిజనులపట్ల కరుణ స్పందించిన రీతి బాగుంది. కానీ అంత పసితనంలో నిజమైన అర్హతగల వారిని నిర్ణయించి ఆర్థిక సహాయం అందజేయడం సాధ్యమా?

సామాజిక ప్రయోజనాన్ని ఆశించి రాసిన ఈ నవలలో రచయిత తను ఆశించిన మేరకు "చుట్టూరా ఉన్న చీకటిని తిట్టుకొంటూ కూర్చోడంకన్నా చిన్నదైనా దీపాన్ని వెలిగించాలి" అనే సూక్తిని నిరూపించడంలో విజయం సాధించారనే చెప్పవచ్చు. కథనంలో మరింత బలమైన చిత్రీకరణను




చూపించి ఉంటే ఇంకా బాగుండేది.

-పి.హైమావతి
మంచిర్యాల్-504208

## వైవిధ్యభరితం

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

మహిళల సమస్యలపై పోరు సాగించే మహిళపాత్ర ద్వారా ఏప్రిల్ చతుర నవల 'సాహసి' చాలా ఆసక్తికరంగా సాగింది. అన్యాయం ఎక్కడ జరిగినా ఎదుర్కోవడం, న్యాయం కోసం పోరాడడం వంటి లక్షణాలుగల యువతిగా కరుణ పాత్రను మలచిన తీరు బాగున్నా, పదవ తరగతి చదివే వయస్సులోనే చందాలు పోగుచేయడం, మగపిల్లవాడిని పట్టుకు కొట్టే ధైర్యం కలిగి ఉండడం సహజత్వానికి కొంత దూరంగా ఉన్నాయి. కరుణ పాత్రను కనీసం ఉన్నత విద్యాభ్యాసం చేసిన మహిళగా మలచి ఉన్నా బాగుండేది. తీసుకున్న కథాంశం, పాత్రల తీరు, మలచిన వైనం అన్నీ సమర్థవంతంగా ఉన్నప్పటికీ, పెద్దపెద్ద మాటలను చిన్న వయస్సున్న పిల్లలతో పలికించడం కొంత మేరకు అసహజంగా ఉంది. మొత్తం మీద ఈ కాలపు ఆడపిల్లలకు కొంత ప్రోత్సాహం, కొంత ధైర్యాన్ని అందిస్తే వారి ఆత్మ విశ్వాసం ఏ మేరకు వృద్ధి చెందుతుందో నిరూపించుటలో రచయిత సఫలీకృతులయ్యారు. శంకరం పాత్రద్వారా పిల్లల పట్ల ఒక తండ్రి ప్రవర్తన ఏవిధంగా ఉండాలో, అదేవిధంగా సరస్వతమ్మ పాత్ర ద్వారా తల్లి పిల్లలపట్ల ఏవిధంగా ఉండరాదో తెలియచెప్పారు. ఇది తల్లితండ్రులను ఆలోచింపచేస్తుంది.

శాంతారాం వంటి లెక్చరర్లు, సందీప్ వంటి విద్యార్థులు ఉన్నంతకాలం ఆడపిల్లలు కాలేజీకి రావడానికే భయపడతారు. మధ్యలో సౌమ్య పాత్ర అనవసరం. పాత్రలకు సరైన ముగింపు లేదు. సందీప్‌లాంటి కిరాతకులకు జైలు శిక్ష సరిపోదు. కథాంశం ఎన్నుకోవడంలో, కథను నడిపించడంలో రచయిత తన ప్రత్యేకతను చాటుకున్నారు. కాని ఆసాంతం కథపై పట్టు సడలకుండా ఆసక్తికరంగా రచించినా చివరకు ముగింపు పేలవంగా ఉంది. మొత్తం మీద ఇదొక వైవిధ్యభరితమైన, సందేశాత్మకమైన నవల.

-బూరుగుల అరుణ మనోహర్
నవులూరు-522503

## సాహసోపేతం

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'సాహసి' పేరుకు తగినంత సాహసోపేతమైన సంఘటనలతో సాగకపోయినా, చదివించేవిధంగా ఉంది. చిన్నచిన్న సంఘటనలతో కరుణ పాత్రను సాహసిగా చిత్రించాలనుకోవడం నవలను హైలైట్ చేయలేకపోయింది. ప్రస్తుత సమాజం తీరు "ఎవరికి వారే యమునా తీరే" అన్న చందంగా ఉంటోంది. ఒకరిని గురించి మరొకరు పట్టించుకొనే ఓపిక, తీరిక రెండూ ఉండడం లేదు. ఒకవేళ వున్నా మన కెందుకులే అన్న ఉదాసీనత ముందుకొచ్చి వెనుకంజ వేసేలా చేస్తోంది. అలాంటి సమాజంలో పెరుగుతున్న కరుణ తనకు తానుగా ఎదుటివారి కష్టాల్లో పాలుపంచుకోవాలనుకోవడం, సహాయ సహకారాలందించడానికి ముందుండడం వంటి కారణాలవల్ల అభినందించవలసిన స్థాయిలోనే వుంది.

కరుణ తల్లిదండ్రులైన శంకరం, సరస్వతిల పాత్రల్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్దడంలో రచయిత కృతకృత్యులు కాలేకపోయారు. తల్లి మొదటినుండీ కరుణకు వ్యతిరేకమే. బాధ్యత కల్గిన 'ప్రిన్సిపాల్' వంటి పాత్రల్ని చులకనచేసి మాట్లాడించడం, అందునా చిన్నపిల్లలచేత అంత సబబుగా



లేదు. ఒక ప్రైవేట్ స్కూల్‌కి ప్రిన్సిపాల్‌గా 'దద్దమ్మ'ను మేనేజ్‌మెంటు ఎంపిక చేసుకోవడం అసంబద్ధంగా వుంది. కాలేజీల్లో అతి మామూలుగా జరిగే డొనేషన్స్, స్కాలర్‌షిప్పులు సక్రమంగా ఉపయోగించకుండా దుర్వినియోగపరచడం, సంఘంలో బాధ్యతాయుతమైన పదవుల్లో వుండి వాటిని తమ స్వార్థపరత్వానికి ఉపయోగించుకోవడం లాంటి సంఘటనలతో నవలను నడిపించడం అలాంటి వారిని వేలెత్తి చూపడమే! అశ్లీల చిత్రాలను ప్రదర్శించే థియేటర్ల యాజమాన్యంపై ఏ చర్యా తీసుకోలేని ప్రభుత్వ బాధ్యతారాహిత్యానికి 'సునంద' లాంటి పసి మొగ్గలు ఎన్ని వసివాడిపోతున్నాయో, 'దీనికి మీ జవాబేమిటి' అని ప్రభుత్వాన్ని నిలదీస్తున్నట్టు నవలలో చిన్నవే అయినా గుర్తించదగిన పాత్రలు రాధ, సౌమ్యలవి. ఆ పాత్రలకు ఏ ప్రయోజనమూ చేకూర్చకుండా వదలివేయడం సమంజసంగా లేదు. అలానే గోపాల్ పాత్రకి కూడా పెద్దగా ప్రాధాన్యతను సంతరించలేకపోయారు రచయిత. చివరికి కరుణ పాత్రను కూడా మధ్యలోనే వదలివేసినట్టుగా నవలకి ముగింపునిచ్చారు ఇది సాగే పయనం అన్నట్టుగా.

–వి. సువర్చలాజ్యోతి
తణుకు-534 211

## ఉదాత్త సందేశం

***(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

ప్రస్తుత విద్యార్థిలోకంలో రావలసిన చైతన్యానికి అద్దం పట్టింది సాహసి. కేవలం 'ఎమ్‌సెట్' ర్యాంకులను లక్ష్యంగా నిర్ణయించుకుని పుస్తకాల పురుగులుగా మిగిలిపోకుండా, సమాజానికి, తమతోటివారికి ఉపయోగపడే ఉన్నత వ్యక్తిత్వాన్ని కూడా సంతరించుకోవాల్సిన అవసరాన్ని ఈ నవల నొక్కి చెప్తుంది.

ఒక సమున్నత వ్యక్తిత్వం కలిగిన ధీరోదాత్త నాయకిగా కరుణని ఆవిష్కరించడంలో రచయిత కృతకృత్యులయ్యారు. కథలో చాలా విషయాలను రచయిత ఈమధ్య జరిగిన కొన్ని సంఘటనల నుంచి గ్రహించిన కారణంగా కథ కృతకంగా లేకుండా సరళమైన శైలి, వాడుక పదాల ప్రయోగంతో ఆసక్తికరంగా రూపొందింది.

అందరూ ఊహించే విధంగా గోపాల్, కరుణల పెళ్ళితో కథ ముగించకుండా, కల్పనకన్నా యధార్థస్థితి గొప్పదని కరుణతో చెప్పించడం బాగుంది. ఎక్కువ పాత్రలున్నా ఎక్కడా విసుగనిపించదు.

రాధ పాత్రను రచయిత అర్ధాంతరంగా వదిలివేసినట్లనిపిస్తుంది. అలాగే సందీప్‌కు, అతని స్నేహితులకు ఎలాంటి శిక్ష పడిందో వివరించాల్సింది.

ఐదవ తరగతి చదువుతున్న కరుణ తనని అనవసరంగా కొట్టిన టీచర్‌ను ఎదిరించే సన్నివేశం, ఆ సందర్భంలో కరుణ పరంగా వాడిన పెద్ద మాటలు కృతకంగా అనిపిస్తాయి. అలాగే లెక్చరర్ సౌమ్య సమస్యకు ఏ పరిష్కారం చూపకుండా ముగించారు.

కథలో చెప్పిన సందేశం ఉదాత్తంగా ఉండడంవల్లా, శైలీ సారళ్యతవల్లా, కథ సమకాలీన సమాజంలో జరిగిన సంఘటనలకు సమీపంగా ఉన్న కారణంగానూ పాఠకులను ఆకట్టుకుంటుందనడంలో సందేహం లేదు.

–టి.వి.కె. రెడ్డి
హైదరాబాద్- 500044

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

